# మాటలు - మంత్రాలు

కర్త

డా. మోపిదేవి కృష్ణస్వామి
ఎం. ఏ., పిహెచ్.డి

కూర్పు :

వాడపల్లి చక్రపాణిరావు
ఎం. ఏ., ఎం. ఫిల్

ప్రచురణ
వరల్డ్ టీచర్ ట్రస్ట్ సోదరబృందం
అమలాపురం శాఖ

# విషయానుక్రమణిక



---

**సవరణలు :**

పుట 8-పంక్తి 10- 'పెంచుకోవడమేనా' బదులు 'పండుకోవడమేనా'అనీ,
పుట 38-పంక్తి 2 - 'ఈ వృత్తివిద్యలవెంటపడిన' బదులు 'ఈఉత్తి విద్యలవెంటపడిన' అనీ చదువుకోవాలి.

# 1. మాస్టర్ ఇ. కె — మనం

- వారిది ఓమ్ - వారికి హోమ్
- రాష్ట్ర కాదు - కుర్రాష్ట్ర
- నిధులుకాదు - ప్రతినిధులు
- ప్రచారంకాదు - ప్రసారం

  యోగం వారికి - ఉపయోగం మనకి
- జేబునిబట్టిగాక విలువనుబట్టి

# మాస్టరు ఇ. కె - మననం

## హరిః ఓమ్ – హరికి హోమ్

అది బందరు - వివేకానంద మందిరం. తమను ఉద్దేశించి ప్రసంగించి, ఉత్తేజితులను చేయవలసిందిగా అచ్చటి సోదర బృందం కృష్ణస్వామిని కోరారు. కృష్ణస్వామి ప్రసంగాన్ని ప్రారంభిస్తూ "హరిః ఓమ్, శన్నోమిత్రః శం వరుణః......" అని ప్రార్థన చేసి, ఇలా అన్నారు:

"సమర్పణబుద్ధితో 'హరిః ఓమ్' అనగానే ఈ శరీరం హరికి 'హోమ్' గా రూపొందుతుంది. ఆ పైన 'అతడే' మన నుండి పలుకుతూ మనలను ఉత్తేజితులను చేస్తూ ఉంటాడు. ఇదీ నేనెరిగిన సత్యం. దీనినే గుర్తుంచుకోవాలి నిత్యం. ఈ స్పృహ మనకు కలిగి, మన మా స్పృహలో నిలబడగలిగిన కొద్దీ దేహం ద్వారా దివ్యజీవితం దేవుని లీలగా వ్యక్తమవుతుంది. ఈ సత్యాన్నే గుర్తు చేస్తూ మన పెద్దలు 'దేహమే దేవాలయం. జీవుడే సనాతనుడైన దేవుడు' అని దర్శనాత్మకంగా వివరించారు."

కృష్ణస్వామి పలుకులు వెలుగులు కాగా, అచ్చటి వారికి ఆత్మదర్శనం అరచేతి ఉసిరిక అయింది.

## రాళ్ళు కాదు – కుర్రాళ్ళు

ఒకసారి ఒక పెద్దాయన కృష్ణస్వామిగారితో మాట్లాడుతూ "మాస్టరుగారు చేస్తున్న కృషిని గూర్చి విన్నాను. బాగానే ఉంది. అన్నట్టు ఆయన ఆశ్రమాల్లాంటివేమైనా స్థాపించారా? స్థాపిస్తే ఎక్కడెక్కడ ఉన్నాయి? వాటి వివరాలు తెలుపుతారా?" అన్నారు.

అప్పుడు కృష్ణస్వామి, "మాస్టరుగారికి ఆశ్రమాలను కట్టడంలో కన్న, వ్యక్తుల వ్యక్తిత్వాలను తీర్చి దిద్దడంలోనే ఆసక్తి ఎక్కువ. తన శక్తియుక్తులన్నీ అలసినవారికి సేద తీర్చడంలోనూ, వలసినవారికి శిక్షణ నివ్వడంలోనూ ఖర్చు పెడుతున్నారాయన. ప్రేమపూర్వకమైన సేవద్వారా సేద తీరుస్తున్నారు. ప్రవర్తనతో కూడిన ప్రబోధం ద్వారా శిక్షణ నిస్తున్నారు.

"పెద్దలైనవారు తమకు కొంత దగ్గరైన వ్యక్తులను ప్రయోజకులుగా, సమర్థులుగా, సమాజానికి పనికివచ్చే వారుగా తీర్చిదిద్దడంపైన దృష్టి పెట్టకుండా, వారి నుండి చందాలు రాబట్టి, ఆశ్రమాలు నిర్మాణం చేసి, ధర్మసంస్థాపన జరిగింది అనుకుంటే, అది పొరపాటే అవుతుంది. ఆ ఆశ్రమాల్లో తమ తరువాత దీపాలు పెట్టేవాళ్ళకోసం వెతు

కోవలసిన గతి పడుతుంది. అందుకే మాస్టరుగారు వ్యక్తు లను సజీవ ఆశ్రమాలుగా తీర్చి దిద్దడమే ఉద్యమంగా పెట్టు కున్నారు. ఆయనకు కావలసింది ఆశ్రమాలకు పనికొచ్చే వాళ్ళు కాదు; సమాజాన్ని సరిచేసే కుర్రాళ్ళు.

"ఎంతోమంది గృహస్థులు మాస్టరుగారి వెలుగులో తమ గృహాలనే పవిత్రమైన ఆశ్రమాలుగా, సేవాకేంద్రా లుగా రూపొందించుకొంటున్నారు. గృహస్థాశ్రమం అన్న మాట పెద్దలు ఎందుకు వాడారో ఆ గృహాలను చూసినప్పుడు మనకు బోధపడుతుంది.

"శిక్షణ పొందేవారి సంఖ్య పెరిగినప్పుడు ఆ శిక్షణ కొరకు తగిన ఏర్పాట్లు చేసుకోవడం తప్పుకాదు. పైగా తప్పని సరి కూడాను. దానికి కావలసిన ప్రయత్నాలు ఈ మధ్యనే భౌతికకక్ష్యలో ప్రారంభమవుతున్నాయి. ఈ ప్రయత్న ఫలి తంగా వేలాది వ్యక్తులు సాధకులుగా, సేవకులుగా శిక్షణ పొందేటందుకు కావలసిన సౌకర్యాలు ఏర్పడనున్నాయి. వ్యక్తులకు సౌకర్యంగా ఉండడానికి సంస్థలు, కట్టడాలు రూపు కట్టుకోవడం మంచిది కాని, సంస్థలను ముందు ఏర్పాటుచేసి, ఆ ఏర్పాటు చేయడంలో కాలహరణం జరిగి, ఆపైన ఆ సంస్థలో శిక్షణ పొందేవారి కోసం, ఆ సంస్థను పోషించేవారి కోసం వీధిని పడడం ఏమంత మంచిపని? ఉద్దేశం మంచిదే అయినా, ఉపయోగం లేకుండా పోతుంది. శిక్షణ ఈయ వలసిన వ్యక్తి శిక్షణ నీయడం మాని, కట్టడాలు కట్టడం

మొదలుపెడితే, వంటవాడు వంటచేయడం మాని పేళ్ళు వేస్తూ కూర్చున్నట్టవుతుంది. శిక్షణ నిచ్చేవాడు శిక్షణ ఇస్తూ ఉంటే, ఆ శిక్షణ పొందేవారు తమకు అవసరమనిపించినపుడు తగిన సౌకర్యాలను తామే కల్పించుకుంటారు. కావలసిన సలహాలు, సూచనలు మాత్రం బాధ్యతతో శిక్షకుడు అందిస్తే సరిపోతుంది. మాస్టగారు ఇప్పుడు చేస్తున్న దదే.

"ఇల్లు కట్టుకోవడం, పొలాలు, సంపదలు, హోదాలు పెంచుకోవడంలో పడి, పిల్లలకు శిక్షణనిచ్చే తీరుబడి లేక, చివరి దశలో చెడిపోయిన బిడ్డలను చూసి, దుఃఖించే తండ్రి గతిఎలాంటిదో, ఆశ్రమాల నిర్మాణం పేరిట చందాల సేకరణ, వనరుల సమీకరణల్లో పడి, తనతో ఉన్నవారికి శిక్షణ నిచ్చే తీరిక లేక, ఊరూరా తిరుగుతూ ఉండే శిక్షకుల గతి కూడా అంతే అవుతుంది."

కృష్ణస్వామిగారి వివరణ అవతలి వ్యక్తిని ఆలోచనలో పడవేసింది. ఆయన తన సులోచనాల్ని తుడుచుకుంటూ, కృష్ణస్వామి వైపు తేరిపారజూస్తూ ఉండిపోయాడు కొంత సేపు. తేరుకోవడానికి ఆ మాత్రం సమయం పట్టదా మరి ?!

## నిధులుకాదు — ప్రతినిధులు

"మాస్టరుగారు అనేక ప్రాంతాల్లో ఉచిత హోమియో వైద్యాలయాలు నిర్వహిస్తున్నారు కదా ! ఈ వైద్యా లయాలు నడవడానికీ, సేవాకార్యక్రమాలు సాగడానికి

నిధులు ఎలా సమకూరుస్తున్నారు ?" అని అడిగారొకాయన, కృష్ణస్వామిని.

కృష్ణస్వామి ఇలా అన్నారు - "నిధులు ఉంటే సేవా కార్యక్రమాలు నడచిపోతాయనా మీ ఉద్దేశం ? నిధులు మూలుగుతున్నవాళ్ళున్నారు. వాళ్ళు ఈ మూలుగుతున్న ప్రజానీకానికి ఏంచేయగల్గుతున్నారు ? ముందు మనకు హృదయమున్న వ్యక్తులు కావాలి. జీవితాన్నే సేవగా మలుచుకోవాలన్న దీక్షకలిగిన వ్యక్తులు కావాలి. అలాంటి వ్యక్తులు అరుదైతే, కరువై తే ఏంజరుగుతుందో ప్రభుత్వంవారు తెరచిన ఉచిత వైద్యాలయాలు, ఇతర కార్యాలయాలు, మనకు నిరూపిస్తున్నాయి. వాటికి నిధులున్నాయిగా ! కాని, పని జరుగుతున్న దెంతవరకు ? అందుకే మాస్టరుగారు 'నాకు మనీ పవర్ కన్న మాన్ పవర్ ముఖ్యం. నేను ఒకవేళ అర్థిస్తే, తయారుచేయడానికిగాను మీ బిడ్డలను అర్థిస్తాను గాని, మీ సంపదలను అర్థించను' అని నొక్కి చెబుతూ ఉంటారు.

"సరైనవ్యక్తి కర్తవ్యోన్ముఖుడైనప్పుడు నిధులు వాటికవిగా నడిచి వస్తాయనేది సృష్టిలోని సత్యం. సముద్రంలోనికి నదులు వాటికవిగా వచ్చిపడటంలేదా ? మనకిప్పుడు కావలసింది నిధులుకాదు; ప్రతినిధులు. ప్రతినిధులు ఉన్నప్పుడు ప్రతి నిధీ సద్వినియోగ **మవుతుంది.** నిధుల సామర్థ్యం చేత

ఆకర్షింపబడతాయి తప్ప, కర్తృత్వం చేత ప్రోగుచేసుకోవడానికి వీలయ్యేవి కావు. వాటివైపు ఆశతో చూస్తున్నవాణ్ణి అవి అందీ అందక ఆడించేస్తాయి. తన కర్తవ్యం వెంట తాను వెళుతున్నవాడి నవి వెంటబడి సేవిస్తాయి. మాస్టరుగారు తాను అనుభవిస్తూ, సహచరులచేత అనుభవింపజేస్తున్న ముఖ్యసూత్రాల్లో ఇది ఒకటి."

మాస్టరుగారి సందేశానికి కృష్ణస్వామి చెప్పిన భావ్యం వింటున్న వ్యక్తికి వెలుగుదారి చూపించింది. ఆయన 'మీరు చెప్పింది అక్షరాలా నిజం' అంటూ కృష్ణస్వామి చెప్పిన మాటలను మననం చేసుకోసాగాడు.

## ప్రచారం కాదు – ప్రసారం.

"మాస్టరుగారు హిందూమత ప్రచారానికి నడుం కట్టుకున్నారు కదా, వారి ఉపన్యాసం మన గ్రామంలోకూడా పెట్టిస్తే బాగుండేదే. మీరా ప్రయత్నం ఎందుకుచేయలేదు?" అన్నాడొక గ్రామస్థుడు.

కృష్ణస్వామి చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారు: "ఉపన్యాసం కావాలో అక్కర్లేదో నిర్ణయించవలసింది నేను కాదు, మీ గ్రామపెద్దలు. మీకు కావాలి అనిపిస్తే దొడ్డిదారు లక్కర్లేదు. డైరెక్టుగా మాకిది కావాలి అని ఆయననే కోరవచ్చు. "ప్రచారానికి పూనుకున్నప్పుడు మన గ్రామానికి కూడా వచ్చి, చెప్పవలసిన బాధ్యత ఆయనకు లేదా?" అని

మీరు భావిస్తున్నట్లు నాకనిపిస్తున్నది. ఆయన ప్రణాళిక తగు మాత్రం వివరిస్తాను. ఆయన చేస్తున్నది ఉపన్యాసాలు కావు; ఉపదేశాలు. ఆయన ఉపదేశిస్తున్నది హిందూమతాన్ని కాదు; మానవధర్మాన్ని. ఆయన ద్వారా జరుగుతున్నది ప్రచారం కాదు; ప్రసారం. ఆయన ధర్మాన్ని బోధగా కాక, మనిషి నుండి మనిషికి స్పర్శగా ప్రసరింపజేస్తున్నవారు. అయస్కాంతం ఇనుపముక్కని స్పృశించినట్లు - సూర్యకిరణం కమలాన్ని స్పృశించినట్లు మానవజాతిని తన మాటలతో చేతలతో స్పృశించి మేల్కొల్పుతున్నవారు. మేల్కొనాలన్న తపన కల్గినపుడు మాత్రమే ఆయన స్పర్శ మనకు లభించేది. సిద్ధపడని వాణ్ణి పట్టుకు తోమేవాడు పిచ్చివాడవుతాడు కాని పరమగురువు కాడు."

కృష్ణస్వామి వివరణకు అవతలివ్యక్తి కొంచెం సిగ్గుతో తలవంచుకుంటూనే ఆయన వేసిన చురకలకు తగిన రీతిలో స్పందించి తనలో తాను ఆలోచించుకుంటున్నట్లుగా కనిపించాడు. కావలసిందదేగా మరి !

## యోగం వారికి _ ఉపయోగం మనకి

1983 జనవరి గురుపూజల్లో, మాస్టరుగారి తత్వాన్నీ, వ్యూహాన్నీ విశదీకరిస్తూ కృష్ణస్వామి, "మాస్టరుగారంటే భారతీయులకు మొదట వైద్యునిగా తెలుసు. తరువాత ఆధ్యాత్మికవేత్తగా తెలుసు. విదేశీయులకు ఆయన మొదట ప్రవక్త, ఆ తరువాత వైద్యుడు. విదేశీయులు ఆయననుండి

లభించే ఆత్మవిద్యకు అఱ్ఱులుచాస్తూ ఉండగా, భారతీయులు ఆయననుండి లభిస్తున్న సేవకు మాత్రం వెంటబడుతున్నారు. మాస్టరుగారు ప్రేమమయులు కనుక,విదేశీయులకు వారు కోరిన యోగాన్నీ, భారతీయులకు వారికి కావలసిన ఉపయోగాన్నీ సహజమైన చిరునవ్వుతో ఏక కాలంలో అందిస్తున్నారు. విదేశాల్లో వెలుగును ఎక్కువగా పంచిపెడుతూ ఇక్కడ మాత్రం మనకు కావలసిన పనిని ఎక్కువగా చేసి పెడుతున్నారు.

"రోగులుగా ఆర్తులుగా ఉండిపోతూ ఆయననుండి సేవను పెంచుకోవడమేనా మనం చేయగలిగింది ! ఆయన శంఖారావం విని వికసించేందుకు మన జాతి నోచుకోలేదా ! ఇప్పటికే అలసులమై ఆలస్యం చేశాం. సోమరులమై ఆ వెలుగు మొదల ఏమరపాటు చెందుతూ వచ్చాం. ఈ అవలక్షణాల నుండి మనం బయటపడదల్చుకుంటే తప్ప, మాస్టరుగారు చూపిస్తున్న విశ్వరూపం మనకు సాక్షాత్కరించదు. నవతర నిర్మాతగా ఆయన ఇస్తున్న చేయూత మనకు లభించదు."

ఇలా సాగిన కృష్ణస్వామి ప్రబోధం వింటున్నవారిని ఒక కుదుపు కుదిపింది.

### జీలు (Zeal)ను బట్టిగాక – పీలునుబట్టి

మాస్టరుగారి వ్యూహాన్నీ, మన కర్తవ్యాన్నీ విశదీకరిస్తూ పై సందర్భంలోనే కృష్ణస్వామి ఇంకా ఇలా అన్నారు: "అయితే మనలో కొందరం మాస్టరుగారి ద్వారా సేవ

పొందడమేగాక, మాస్టరుగారిలాగ సేవ చేయడానికి యత్ని స్తున్న వాళ్ళం ఉన్నాం కదా" అని మనం అనుకోవచ్చు. కొద్దిగా ఆత్మపరిశీలన చేసుకుంటే, మనకొక సత్యం తెలుస్తుంది. మాస్టరుగారి విదేశీ శిష్యుడు 'జీలు'ను బట్టి పని చేస్తూ ఉండగా, భారతీయ శిష్యుడు వీలునుబట్టి మాత్రమే పనిచేస్తున్నాడు.

"విదేశీయులలో మాస్టరుగారు చూపుతున్న ప్రణాళికకు జీవితాలు సమర్పణ చేసుకొంటున్న స్త్రీ పురుషుల సంఖ్య చూస్తే, భారతీయులమైన మనకు ఆశ్చర్యమే కలుగుతుంది. ఎందుకంటే, మనం మన పనులనుకొన్నవాటి నన్నిటినీ చేసుకొని, మిగిలిన 'టయిం'లో మాస్టరుగారు చూపించిన మంచి పనిని చేయడానికి చూస్తున్నాం. అంతే నంటారా కాదా! భారతీయుడు తన దినచర్యలో మాస్టరుగారికి కొంచెం చోటుపెట్టడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. విదేశస్థుడు తన జీవితాన్ని ఆయన ప్రణాళికకు అనుగుణంగా మలచుకొని, రాకెట్ స్పీడుతో విశ్వశ్రేయస్సుకోసం పని చేస్తున్నాడు. కాస్సేపు మంచి పనిచేసి, తృప్తిపడిపోయే అల్పసంతోషులమైన మనకూ, విశ్వంమొత్తానికి కావలసిన పని చేయడానికి నడుంకట్టిన 'రూడాల్ఫ్' వంటి యూరప్ దేశస్థునికీ ఎంత తేడా ఉంది! అందుకే వారు 'జీలు'నుబట్టి చేస్తుంటే,

మనం వీలునుబట్టి మాత్రమే పని చేస్తున్నాం అన్నాను. మనకు కూడా 'జీలు'నుబట్టి పనిచేసే మంచి రోజులు రావాలి."

కృష్ణస్వామి విశ్లేషణ శ్రోతలను ఆలోచనలో పడవేసింది. వారిలో చాలామంది ఆత్మపరిశీలన చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టు కనిపించింది.



# 2. తీరనిబాధ _ తీరైనబోధ

- తప్పుజరిగిందనడానికి లేదు-తట్టుకోవడమే కష్టంగా ఉంది
- మరచిపోవడం కాదు మలచుకోవడం
- ఋణానుబంధం కాదు క్రీడానుబంధం
- ఉన్నవాళ్ళకేగా చేయగలిగింది
- బాధపడటం తప్పుకాదు - బాధ్యతనే విడువరాదు
- నిస్వార్థమైన మమకారమే పరమప్రేమగా రూపొందుతుంది
- భారతం వ్రాసినవాడే బాధపడ్డాడు
- దేహాలు అశాశ్వతం కాని, జీవితాలు శాశ్వతమే
- సైనికుడినై సాహసిస్తాను

# తీరని బాధ-తీరైన బోధ

తప్పు జరిగిందనడానికి లేదు-
తట్టుకోవడమే కష్టంగా ఉంది

"ఇన్ని సంవత్సరాలుగా నిరంతరం అదేపనిగా మీరు సేవచేస్తున్నారు. అలాంటి మీకు దేవుడు ఇలాంటి శిక్ష విధించవచ్చా? ఇది న్యాయమా?" అన్నారొక ఆత్మీయులు, కృష్ణస్వామిని అనునయించడానికి ప్రయత్నిస్తూ.

అంత బాధలోనుండీ కృష్ణస్వామి ఇలా అన్నారు -

"దైవాన్ని తప్పుపట్టడానికి అవకాశం లేదు. అతడి ప్రణాళిక ప్రకారం అతడు ఘట్టాలు నడిపిస్తున్నాడు. కాకపోతే, సాగుతున్న మన అనుభూతికి తీవ్రవిఘాతం కలగడంతో మనమే తట్టుకోలేకపోతున్నాం. బాధ, అపేక్ష మన మమకారానికి సంబంధించినవి. సంఘటన దేవుడి ప్రణాళికకు చెందినది. ఇచ్చినప్పుడు ఎందుకని ప్రశ్నించామా, తీసుకు వెళ్ళినప్పుడు ప్రశ్నించగలగడానికి? తప్పు జరిగిందనడానికి లేదు. కానీ, తట్టుకోవడమే కష్టంగా ఉంది."

కృష్ణస్వామి కనులవెంట దుఃఖం పొంగి పొర్లింది.

## మరచిపోవడం కాదు – మలచుకోవడం

"చెప్పినంత తేలిక కాదనుకోండి. ఎలాగైనా ఈ సంఘటనని మరచిపోవడానికి ప్రయత్నం చేయండి. తప్పదుమరి. కాలం ఎలాగూ కొంత సహకరిస్తుందనుకోండి" అన్నారు కృష్ణస్వామిని చూడవచ్చిన సన్నిహితులొకరు.

"మరచిపోవడం సాధ్యమూ కాదు, కర్తవ్యమూ కాదు. ఇన్నాళ్ళూ మనతో సహచరించి వెలుగులు నింపిన వ్యక్తిని, భౌతికంగా దూరమైనంత మాత్రాన మరచిపోవడమంటే అది కృతఘ్నతే అవుతుంది. చేయవలసింది మరచిపోవడం కాదు; బాధను అనుభూతిగా మలచుకోవడం. దానికి కొంత కాలం పడుతుంది. పట్టనివ్వండి. కృష్ణుడు బృందావనాన్ని విడిచినప్పుడు గోపికలు బాధతో విలవిల్లాడిపోయారు. కాలక్రమంలో ఆ బాధ అనుభూతిగా రూపొందగా నిరంతర కృష్ణ సాన్నిధ్యంలో వారు జీవించారు.

"నాకూ అదే అవస్థగా, అదే గమ్యంగా గోచరిస్తోంది" అన్నారు కృష్ణస్వామి.

## ఋణానుబంధం కాదు – క్రీడానుబంధం

"మీరు గుండె దిటవు చేసుకోవాలి. మనకు ఋణం తీరిపోయింది. అంతే అనుకోవాలి. ఋణం తీర్చుకోవడానికి వచ్చాడు, తీర్చుకుని వెళ్ళిపోయాడు. 'ఋణానుబంధ రూపేణ

పశు పత్నీ సుతాలయః' అన్నారు పెద్దలు" అన్నారొక సన్నిహితులు, కృష్ణస్వామిని ఓదార్చడానికి ప్రయత్నిస్తూ.

కృష్ణస్వామి తలపైకెత్తి, అన్నవారి కన్నుల్లోకి సూటిగా చూస్తూ, "ఇది ఋణానుబంధం కాదు; క్రీడానుబంధం. మనిషికీ మనిషికీ మధ్య నున్నది ఋణానుబంధమేనా? ఇది చాలా నీచమైన దృష్టి. అప్పులు తీర్చుకోడానికేనా ఈ జన్మలన్నీ? జమాఖర్చుల లెక్కకేనా ఈ సృష్టి? దారుణమైన ఆలోచన. ఈ ఆలోచన. మనిషి హృదయం రాయిలా గట్టిపడడానికి పనికివస్తుందిగాని, ప్రేమగా ద్రవించి, అనుభూతిగా పర్యవసించడానికి పనికిరాదు."

అవతలి వ్యక్తి ఇంకొంత వివరం కావాలన్నట్టు ఆర్తితో చూస్తున్నాడు.

కొద్దిసేపాగి, కృష్ణస్వామి మళ్ళీ ఇలా అన్నారు :

"మొదట దైవం తాను అనేకం కాగోరగా ఈ సృష్టి వచ్చింది* అని మనకు వేదోపనిషత్తులు చెబుతున్నాయి. ఆ కోరికతోనే అనేకమైన మూర్తులు ధరించి, ఆ దైవం లీలగా క్రీడిస్తున్నట్టు భాగవతం కీర్తిస్తోంది.♦ క్రీడ, లీల అని ఋషులు చెబుతూ ఉండగా, కర్మబంధం, ఋణసంబంధంగా పండితులు జమకట్టారు. ఎదుటి మనిషిని దైవంగాచూస్తే ముక్తస్థితిని

* సోఽకామయత బహూస్యాం ప్రజాయే యేతి

♦ నర్తకుని భంగి పెక్కగు మూర్తుల నెవ్వడాడు

పొందుతావు అని ఋషులు చెప్పగా, తోడిమనుషులను వదిలించుకుంటే దేవునికి దగ్గరౌతావని మెట్టవేదాంతులు భ్రమపడ్డారు. సర్వమూ ఆయన క్రీడ అయినప్పుడు, ఈ మూర్తులన్ని ఆయనవే అయినప్పుడు మూర్తికీ మూర్తికీ మధ్య నున్నది పూర్తిగా క్రీడానుబంధమే కదా !"

"అయితే కర్మ సిద్ధాంతం నిజం కాదంటారా? ఆ వ్యక్తి" అడిగాడు.

"కొంతవరకే" అంటూ కృష్ణస్వామి ఇలా వివరించ సాగారు-

"ఒక ఆటస్థలంలో ఆటగాళ్ళు కొందరు చేరి తమ ఆనందం కోసం ఆడుకోవడానికి ఉపక్రమిస్తారు. ఆట ఒకసారి ప్రారంభమయిన తరువాత పాయింట్లు రావడం, పాయింట్లు పోవడం, గెలవడం, ఓడడం, దానిని బట్టి మళ్ళీ మళ్ళీఆడుతూ ఉండడం జరుగుతూ ఉంటుంది. ఆడుకుంటున్నది ఈ గెలుపు ఓటములను లెక్కపెట్టుకోవడం కోసం కాదని, ఆనందం కోసమని గుర్తున్నంతవరకు గెలుపు ఓటములు వారిని బంధించవు; బాధించవు. అవే ముఖ్యమనుకున్నవారిని అవి బంధించకమానవు. భూమి అనే క్రీడారంగంపై సృష్టిక్రీడ ప్రారంభమైన తరువాత దేహాలు ధరించిన ఆటగాళ్ళగా మన కథా అంతే. కాబట్టే లాభనష్టాలు, జయాపజయాలు, సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలకు అతీతంగా ఉంటే తాను అనుభవానికి వస్తానని గీతలో భగవానుడు చెప్పాడు.

లాభనష్టాదులపైన దృష్టి ఉన్నవారికి సన్నివేశాలు ఋణాను బంధాలు. అంతర్యామిపైన దృష్టి ఉన్నవారికి అవి క్రీడాను బంధాలు. అందుకే కర్మసిద్ధాంతం కొంతవరకే అన్నాను నేను. ఆటలో హద్దులు, బద్దెలు, నియమాలు, అవుటయి పోవడాలు ఉండవని కాదు, ఉంటాయి. కానీ ఆట ఆనందం కోసమని గుర్తున్నంతవరకు అవి మనని ఉత్సాహపరుస్తాయే తప్ప, ఏడిపించవు.

"అన్నిటికన్న పైనున్న సత్యం ఏమిటంటే, కర్మ తాను చేస్తున్నాను అని భ్రమపడినవారికి, కర్మబంధం ఉంటుంది. కర్మ తమనుండి జరుగుతున్నది అని దర్శించినవారికి ఆ బంధం స్థానంలో అనుబంధం, ఆనందం ఉంటాయి. సారాంశ మేమిటంటే, వేదాంతం పేరిట ఎండిపోకండి అని. తోటి జీవులను బంధాలుగా ఋణసంబంధాలుగా చూసే నీచస్థితికి దిగజారకండి, వారిని దైవస్వరూపంగా దర్శించి, వారి ఆరాధనగా జీవితాన్ని మలచుకోండి, వారి మూర్తులు దూర మైనా గోపికల్లా మధురస్మృతులు జ్ఞప్తిచేసుకుంటూ తరించండి అని".

"ఇంత బోధలోనూ మిమ్మల్ని ప్రశ్నించి ఎక్కువ సేపు మాట్లాడించాను. మీ మాటలు అమృతప్రాయమైనవి. అయినా ఈ సందర్భంలోకూడా..."

"ఫరవాలేదు. మీరు ప్రశ్నించడంవల్ల మరొకసారి సత్యదర్శనం పొందే ప్రయత్నం నాలో జరిగింది. ఆ దర్శ

నాన్ని నాకు అందించేటందుకు నిమిత్తంగా మీరిక్కడ ఉన్నారు" అంటూ కృష్ణస్వామి అరమోడ్పు కన్నులతో ఒక విధమైన అనుభూతితో నిలిచారు.

## ఉన్నవాళ్ళకేగా చేయగలిగింది!

"ఇంత బాధలో ఉండికూడా ప్రత్యేకంగా మా ఊరు మనిషిని పంపించి, నన్ను రప్పించి, మందిస్తున్నారు మీరు. అలాంటి మీకు ఇంత బాధపెట్టాడా దేవుడు!" అంటూ కళ్ళ నిండా నీళ్ళు నింపుకుంది ఒక స్త్రీమూర్తి.

"శరీరంలో లేనివాడికి నేనేం చేయగలనమ్మా? ఉన్న వాళ్ళకేగా చేయగలిగింది!" అంటూ బాధతోకూడిన వాత్స ల్యంతో చూశారు కృష్ణస్వామి.

## బాధపడడం తప్పుకాదు — బాధ్యతనే విడువరాదు

"నీవిలా కుమిలిపోకూడదు. నువ్వే ఇలా అయితే, మిగిలినవాళ్ళు ఏమవుతారు? ఏదో ఒక వ్యాపకం పెట్టుకుని, నిన్ను నువ్వు తమాయించుకోవాలి. నువ్వు మా అందరికీ చెప్పగలిగినవాడివి. మీకు మేమేం చెప్పగలం?" అన్నది కృష్ణస్వామి చెల్లెలు కళ్ళనిండా నీళ్ళు నింపుకుని.

"బాధ కలుగుతున్నప్పుడు పడకుండా ఉండడం ఎలా సాధ్యమమ్మా? బాధపడడం తప్పుకాదు. బాధ్యతనే విడిచిపెట్ట

కూడదు. నాకు వేరే వ్యాపక మెందుకు? నా కర్తవ్యమే నా వ్యాపకం. నేను చేస్తున్నది, చేయవలసినది ఇంత ఉండగా వ్యాపకాన్ని వెతుక్కోవడ మెందుకమ్మా ?

"చెప్పగలిగినవాడిని అన్నావు. నాకు తెలిసింది చెబుతాను విను. ఎంత బాధ కలిగినా ఫరవాలేదు. ఆ బాధ, దానికి కారణంగా కనపడుతున్నవారిమీద విద్వేషంగానో, ఎదురుగా నున్న కర్తవ్యం యెడల వైముఖ్యంగానో మారకుండా ఉండడమే కావలసింది. రాముడు తనకు కలిగిన బాధనంతటినీ అలాగే అనుభవించాడు. అందుకే మానవులకు ఆదర్శమయ్యాడు" అంటూ వివరిస్తున్న కృష్ణస్వామి రామగాథ లోతులలోనికి మానసికంగా ప్రవేశిస్తున్నట్టు కనిపించారు.

## నిస్వార్థమైన మమకారమే పరమప్రేమగా రూపొందుతుంది

"అన్నీ తెలిసినవారు మీరు. మిమ్మల్ని ఓదార్చగలగటం మాకెలా సాధ్యం? కానీ మీరు బాధపడుతుంటే చూడలేం. తట్టుకోవాలి మీరు. ఎంతైనా ఆ మమకారపాశం గట్టిది కదా! అది మనిషిని కుదిపివేస్తుంది" అన్నారు సన్నిహితులొకరు కృష్ణస్వామిని చూడవచ్చి.

"స్వార్థపూరితమైన మమకారం పాశమన్నమాట నిజమే. కాని నిస్వార్థమైన మమకారం ప్రేమగా, పరమ

ప్రేమగా రూపొందగలిగిన దవుతుంది. నేనిప్పుడూ అతడు చూపిన వెలుగును. అతని సాహచర్యంలోని తీపిని తలచుకొని దుఃఖిస్తున్నాను తప్ప, ఇంక దేనినీ ఆశించికాదు. గోపికలు, కృష్ణుడు తమను విడిచి వెడుతున్నప్పుడు ఆ ఎడబాటుకు బాధతో నుళ్ళుతిరిగిపోలేదా ? కానీ ఏం జరిగింది ? ఆ బాధే క్రమంగా జీవితానుభూతిగా రూపొందింది. కృష్ణుడే వారికి జగమంతా కనిపించేటట్టు చేసింది. ఆపైన నిరంతర కృష్ణ సాన్నిధ్యంలో వాళ్ళ జీవితాలు వేణుగానంగా సాగాయి. నిస్స్వార్థమైన వాళ్ళ మమకారమేగా ఇంతటి దివ్యస్థితిని వాళ్ళకు అనుగ్రహించింది ! వారిలాంటి బాధే ఇదికూడా. కానీ కృష్ణుడు వారి బాధను కాదన్నాడేమో చూశారా ! బాధపడటం తప్పన్నాడేమో చూశారా ! అతనికి తెలుసు-నిస్స్వార్థమైన ఆ మమకారమే వాళ్ళ జీవితాల్లో తన సాన్నిధ్యాన్ని నింపగలదని"అంటూ కృష్ణతత్త్వాన్ని స్మరించారు కృష్ణస్వామి.

## భారతం వ్రాసినవాడే బాధపడ్డాడు !

"మీరు భారత భాగవతాలు తెలిసినవారు. తత్త్వ జ్ఞానాన్ని మీకు వివరించటానికి యత్నించడం సాహసమే అవుతుంది. మీరు ఈ బాధనుండి త్వరలో తేరుకోవాలని కోరుకుంటున్నాను" అన్నారు ఆత్మీయులైన ఒకరు.

"భారత భాగవతాలను మనకెవడు భిక్షపెట్టాడో ఆ వ్యాసుడికే ఈ బాధ తప్పలేదు. కావాలని ఈశ్వరుణ్ణి

కోరి శుకుణ్ణి పుత్రుడుగా పొందాడు. శుకుడు పుట్టుసిద్ధుడై స్త్రీ పురుష భేదానికి అతీతంగా దివ్యత్వంతో వర్తించడం చూసి ఆనందించాడు. తాను దిగివచ్చిన ప్రణాళిక పూర్తి కాగానే శుకుడు ఉత్తరదిక్కుగా బయలుదేరి, చుట్టూఉన్న చెట్లకు పొదలకు "మాతండ్రి నా వెనుక నాకోసమై వస్తూ నన్ను ఆర్తితో పిలిచినపుడు నా బదులు మీరు పలకాలి సుమా" అని చెప్పి ముందుకు సాగుతాడు. వెళ్ళగా వెళ్ళగా రెండు పెద్ద కొండశిఖరాలు వస్తాయి. శుకుడిప్రయాణం ఆగేదికాదని తెలిసి ఆ రెండు శిఖరాలు చూర్ణమైపోయి దారినిస్తాయి. శుకుడు వాయుపథాన్ని అతిక్రమించి సర్వ భూతాత్మకుడైపోతాడు. వ్యాసుడు శుకునిసంగతి తెలిసి శుకుడు నడిచినదారిని పట్టి "శుకా! శుకా!" అని పిలుస్తూ ముందుకు సాగుతాడు. శుకుడు సర్వభూతాత్మకుడయ్యాడని తెలిసి దీనవదనుడై ఒక కొండచివర బాధతో మూలుగుతూ నిలబడిపోతాడు. అప్పుడు శివుడు సాక్షాత్కరించి వ్యాసుణ్ణి ఓదార్చి ఇలా అంటాడు: "పంచభూతాలతో సమానమైన వీర్యంగల పుత్రుడు కావాలని కోరావు; పొందావు. మీ ఇరువురిగాథ శాశ్వతంగా నిలచిపోతుంది. తనకర్తవ్య నిర్వహణంచేసి తనువు విడిచాడతను. బిడ్డయెడల నీ ప్రేమ ఎట్టిదో నాకు తెలుసు. ఇకపైన నీ కుమారుని నీడ నీతో నడుస్తూ నీకు ఆలోటును తీర్చే ప్రయత్నం చేస్తుంది." వ్యాసుడు అప్పటికి కొంత ఊరట చెందుతాడు. జీవితాంతం తనతో నీడగా కలిసి సాగుతున్న పుత్రుని మూర్తిని చూసుకుంటూ కర్తవ్య నిర్వహణ చేస్తాడు.

"పరిశోధనకోసం భారతాన్ని చదువుతున్నప్పుడు ఈ ఘట్టం నన్ను నిలబెట్టింది. అప్పు డనిపించింది నాకు - వేదాంత మంటే గుండెను బండరాయిగా చేసుకోవడం కాదని. ఆర్ద్రత లేని హృదయం అదీ ఒక హృదయమేనా ? వ్యాసుడు పొందిన స్థితి అతనినేం తక్కువచేసింది ? అతడి హృదయమార్దవాన్ని మనకు తెలియజేస్తుంది. గడ్డాలు మీసాలు నిస్స్వార్థమైన మమకారానికి అడ్డాలు కావని తెలియజెబుతుంది.

"ఇలాంటి సన్నివేశాలు, హృదయాన్ని కరిగించేవి, కరిగించి సంస్కరించేవి అనేకం పవిత్ర గ్రంథాలో ఉండగా, మెట్టవేదాంతం ఎక్కడనుండి వచ్చిందబ్బా అని ఆశ్చర్య పోయానప్పుడు. ఆనాడు ఈ ఘట్టం నన్ను నిలబెట్టింది. ఈనాడు విధే నన్ను అలాంటి ఘట్టంలో నిలపెట్టి, చూస్తోంది" అంటూ వ్యాసస్మరణతో కనులు మోడ్చారు కృష్ణస్వామి.

**దేహాలు అశాశ్వతం కాని,**
**జీవితాలు శాశ్వతమే**

సన్నిహితు లొకరు కృష్ణస్వామిని ఓదారుస్తూ, "మీకు తెలియనిదేముంది, అశాశ్వతమైన మానవ జీవితాలను గురించి!" అన్నారు.

కృష్ణస్వామి ఒక్కక్షణం మౌనంగా ఉండి ఆ వ్యక్తితో ఇలా అన్నారు: "మానవదేహాలు అశాశ్వతమేగాని, మానవ జీవితాలు అశాశ్వతం కాదు సుమా ! రాముడి గాథ, కృష్ణుడి

కథ, మహనీయుల జీవిత చరిత్రలు, మనకీ సత్యాన్ని స్పష్టం చేస్తున్నాయి. వాళ్ళు దేహాలువిడిచిపెట్టి ఎన్నివేల సంవత్సరాలయింది! అయినా వారి జీవితాలేమైనా పాతబడ్డాయా? అయితే అందరి జీవితాలూ అలా నిలబడవేం? అన్న ప్రశ్న వస్తుంది మనకి. దేహాలు ధరించినవారిలో రెండు రకాల వాళ్ళుంటారు - దేహంకోసం - బ్రతికేవాళ్ళు, ధర్మంకోసం బ్రతికేవాళ్ళు అని. దేహంకోసం బ్రతికేవాళ్ళకి దేహాన్ని పోషించుకోవడమే పరమావధి. దానికే వాళ్ళకి జీవితకాలం సరిపోతుంది. కాబట్టి దేహంతోపాటే ఆ జీవితాలుకూడా కాలగర్భంలో కలిసిపోతాయి. ధర్మంకోసం బ్రతికేవాళ్ళు ధర్మ నిర్వహణకొరకు దేహాన్ని ఒక పనిముట్టుగా స్వీకరించి లోకశ్రేయస్సు సాధించడంలో తమ పనితనాన్ని చూపిస్తారు. దేహాలు పడిపోయిన తర్వాత కూడా ఆ జీవితాలు, ఆ జీవితాల్లోని పనితనం ఆచంద్ర తారార్కం నిలచిపోతాయి. కాలకాలాల్లో తరతరాల మానవులకు పథనిర్దేశం చేస్తూ ఉంటాయి.

"వేదాదిత్య జీవితం కూడా ఆ కోవకు చెందినదే కనుక, అది శాశ్వతం. స్మరించుకోవలసినదేతప్ప, మరచిపోవలసినది కాదు."

మానవజీవితాల అనుపానులను లోతుపాతులను తడిమిచూస్తున్నది **ఆయన మనస్సు.**

## సైనికుడినై సాహసిస్తాను

"బాబుని గూర్చిన ఇంత బాధలో ఉండి కూడా మీరు గ్రంథరచన చేస్తున్నారు. నాకు కావలసిన ప్రణాళిక లిస్తున్నారు. జాతిరుగ్ణతలను గూర్చిన విశ్లేషణను అంది స్తున్నారు. కర్తవ్యం నిర్దేశిస్తున్నారు. ఒక ప్రక్క బాధ, మరొక ప్రక్క బోధ. మీ కెలా సాధ్యమౌతోందోగాని, ఆశ్చర్యంగా ఉంది నాకు" అన్నాను నేను.

కృష్ణస్వామి ఇలా అన్నారు :

"విదేశీయులు మన దేశాన్ని ఆక్రమించే ప్రయత్నం చేస్తున్నప్పుడు జరుగుతున్న ఆ యుద్ధంలో మాతృదేశ రక్షణకై కలిసికట్టుగా పోరు సలుపుతున్న, ప్రాణస్నేహితు లైన ఇద్దరు సైనికులున్నారనుకో. ఆ ఇద్దరిలో ఒకడు ఆ పోరులో తూటాలు తగిలి, శరీరాన్ని విడిచిపెట్టాడనుకో. మిగిలినవా డేం చేస్తాడు ? స్నేహితునికోసం ఆక్రందించడం మానేస్తాడా? ఆక్రందించడంలో పడి, యుద్ధాన్నే మానేస్తాడా? ఆక్రందిస్తూనే యుద్ధం చేస్తాడు. ఆ బాధతోనే మరింత విజృంభిస్తాడు. తన స్నేహితుని బదులు కూడా తానే యుద్ధం చేస్తాడు. దేశరక్షణయెడల అతనిదీక్ష పెరుగుతుందితప్ప తగ్గదు. ఇక అతను విశ్రమించడు. తన ప్రాణానికి కూడా తెగించి, మరింత ముందుకు సాగుతాడు. సరిగా అలాంటి స్థితిలోనే ఉన్నానిప్పుడు నేను.

"నే పనిచేస్తున్న ప్రణాళికలో నా బిడ్డను కూడా ఒక సహచరునిగా భావించాను. అతడూ అలాగే ప్రవర్తించే వాడు. ఇంతలో అతడు దేహం విడిచాడు. నాకు బాధ పెరిగింది; కర్తవ్యమూ పెరిగింది. విశ్రమించవలసిన సమయం కాదిది. ఆ బాధ ఇచ్చినప్రేరణతో దేహాన్ని దివ్యప్రణాళికకు మరింతగా అంకితం చేయడమే నేను చేయగలిగింది, నేను చేయవలసింది.

"దేహం బుద్బుదం వంటిదని మరొకసారి నిరూపించాడు, వెన్నుతట్టాడు వేదాదిత్య. ఏమో ఏ క్షణాన్నైనా ఈ శరీరాన్ని అప్పజెప్పవలసి రావచ్చు. అంతలోపల నానుండి ఉద్దేశింపబడిన కర్తవ్యనిర్వహణం జరగాలి. అందుకే ఈ ప్రయత్నమంతా."

కృష్ణస్వామివదనం గంభీరంగా ఉంది. ఆ కళ్ళు కర్తవ్యోన్ముఖమైన చూపులతో దివ్యత్వాన్ని వెదజల్లుతున్నాయి.

# మాత్రల వైద్యం - మాటల వైద్యం

## చుట్టాలు వచ్చినా చట్టాలు తప్పకండి

ఒకసారి డిస్పెన్సరీలో రోగులను పరీక్షిస్తున్నారు కృష్ణస్వామి. ఒక స్త్రీ కేస్‌షీటును పరిశీలిస్తూ, "ఈ మధ్య అపథ్యం ఏం జరగలేదుకదా" అన్నారు.

దొరికిపోయామనుకుంటూ ఆవిడ "ఈమధ్య బంధువులొచ్చారండి. మనం తినడంలేదుకదా అని వాళ్ళకెలా అలా పెట్టగలం చెప్పండి ?" అంటూ సాగదీసింది.

"మందు దొరికిందికదా అని పసందుగా అన్నీ లాగించేశారన్నమాట. అసలు తినాలని ఉన్నది మనకి. చుట్టాలొచ్చారన్నది వంక. ఇలా అయితే మందులేం పని చేస్తాయి ? చుట్టాలు వచ్చారంటే, నేనొప్పుకోవచ్చు కానీ, అవి ఒప్పుకోవుగా, చుట్టాలొచ్చినా చట్టాలు తప్పకుండా ఉంటేనే మందు పనిచేసేది" అని మందలించి, ఆవిడకు మందు వ్రాసి పంపించేశారు.

# 3. మాత్రలవైద్యం – మాటలవైద్యం

- చుట్టాలువచ్చినా చట్టాలు తప్పకండి
- పిల్లకాయలుకావాలా ? ఉల్లిపాయలుకావాలా ?
- ఏదో ఒక మందే పడాలి
- ఆస్తిపాస్తులు రాకపోయినా, ఆధివ్యాధులు వచ్చేస్తాయి
- మందుకు రావడమేకాదు, ముందుకురావాలి
- నెంబరా ? మెంబరా ?
- కాంపౌండ్‌లోకి వచ్చినవాళ్లా కాంపౌండరే
- రోగ్‌లులేరు, ఉన్నది రోగులే !
- అందుకున్నాను - అందుకు ఉన్నాను

ప్రక్కనున్న సహచరునితో "పథ్యం పేరిట ఇంద్రియ నిగ్రహానికి మంచి ట్రయినింగ్ పెట్టాడయ్యా హానిమన్. రోగం కుదరడంతో బాటు పనిలోపని యోగం కూడా కుదిరి పోతుందనుమా" అన్నారు చిన్నగా నవ్వుతూ.

## పిల్లకాయలు కావాలా? ఉల్లిపాయలు కావాలా?

ఒకావిడ తన ఇద్దరు బిడ్డలకు కృష్ణస్వామిగారిదగ్గర మందు ఇప్పిస్తోంది. శ్రద్ధ తక్కువగా ఉన్నట్లు గమనించి, "పథ్యం సరిగ్గా జరుగుతోందా?" అని నిలదీశారు కృష్ణస్వామి.

ఆవిడ జంకిన గొంతుతో "పిల్లలు తినకూడదనుకోండి. అందుకని మేం మానుకోలేం గదండి" అంది.

"అయితే వాళ్ళకి వేరే వండి పెట్టండి."

"రోజూ వేరే వండిపెట్టడం అంటే కష్టంగదండి."

"అయితే ఉల్లి, వెల్లుల్లి, మసాలాలు కొనడం పూర్తిగా మానేయండి."

"జిహ్వ ఎన్నాళ్ళని కట్టుకోగలమండీ!"

"ఇదిగో ఏవమ్మా, నీకు కావలిసింది పిల్లకాయలో ఉల్లిపాయలో తేల్చుకో. ఉల్లిపాయలు కావాలంటే పిల్లకాయల ఆరోగ్యం కుదుటపడదు. పిల్లకాయలు కావాలంటే ఉల్లిపాయలు తరగడానికి వీలుపడదు. ఏం చేవంటావ్? ఎవరు కావాలి?"

"పిల్లకాయలేనండి. మీరు చెప్పినట్టే, ఉల్లిపాయలూ అవీ మానేస్తాం. మరి వాళ్ళు బాగోవాలనేకదండి ఇదంతా" అంటూ మందు వ్రాయించుకొని నమస్కరించి వెళ్ళి పోయింది.

కృష్ణస్వామి ప్రక్కనున్న సహచరునితో "పాపం పిచ్చావిడ. ఉన్ననిజం ఒప్పుకుంది. ఎంతోమంది మనతో పథ్యం చేస్తున్నామని దబాయించి చెబుతూ, లోపల లాగించేస్తూ ఉంటారు. నష్టం వాళ్ళకేనని మర్చిపోతూ ఉంటారు" అన్నారు నవ్వుతూ.

## ఏదో ఒక మందే పడాలి

ఒకరోజు ఒకతను మందుకు వచ్చాడు. కేసుషీటును పరిశీలిస్తూనే వాసన పట్టారు కాబోలు- "ఏంవోయ్ ! మందే మన్నా అలవాటుందేమిటి ?" అన్నారు నవ్వుతూ.

"కొంచెంగా ఉందండి. సెమపడేవాళ్ళం కదండి. ఆమాతరం పడితేనేనండి బండి నడిసేది."

"ఆ మందుపడితే, ఈమందు పనిచేయదుమరి. ఏదో ఒక మందే పడాలి. ఏమందు కావాలో నీవే నిర్ణయించుకో."

అతను కొంచెంసేపు తైలమాతోపడి, "మందు పని సేయదంటున్నారు కదండి. మరి తప్పదంటే మానేస్తానండి. సెడిపోయిన శరీరం కుదుటపడాలి కదండి" అని దణ్ణం పెట్టాడు.

"దాన్ని వదిలేయ్, దీన్ని మొదలెట్టు" అని మందు వ్రాసి పంపారు కృష్ణస్వామి.

## ఆస్తిపాస్తులు రాకపోయినా ఆధి వ్యాధులొచ్చేస్తాయి

ఆస్త్మాతో బాధపడుతున్నానని ఒక స్త్రీ మందు తీసుకునేటందుకు వచ్చింది. ఆమె కేసుషీటు పరిశీలిస్తూ కృష్ణస్వామి, మీతల్లిదండ్రుల్లోగాని, వారి తల్లిదండ్రుల్లోగాని ఈ ఆస్త్మా లక్షణాలు ఎవరికైనా ఉండేవా అమ్మా?" అని అడిగారు.

"మా అమ్మమ్మగారికి ఉండేదండి. అలా పెద్దవాళ్ళ కుంటే వచ్చేస్తుందాండీ?"

"పెద్దవాళ్ళకు లేకుండా పెద్ద వ్యాధులేవీ పిల్లలకు డైరక్టుగా రావండి. ఆస్తిపాస్తులు వచ్చినా రాకపోయినా. ఈ ఆధివ్యాధులు మాత్రం తప్పకుండా వచ్చేస్తాయి. వారి డబ్బులకు వారసలమైనా కాకపోయినా, వాళ్ళ జబ్బులకు మాత్రం తప్పకుండా వారసుల మవుతాము."

ఆమెకు విషయం బోధపడి, "మాకు కలగబోయే పిల్లలకు కూడా వచ్చేస్తాయాండి?" అన్నది.

"మీరు నిష్ఠతో హోమియోమందు తీసుకుంటే వ్యాధి తత్త్వం కరిగిపోతుంది. ఆపైన కలగబోయే పిల్లలు

ఆరోగ్యవంతులవుతారు. తరంనుండి తరానికి సంక్రమించే దీర్ఘవ్యాధులను కరిగించివేయడమే హోమియోకున్న ప్రత్యేకమైన సద్గుణం. శ్రద్ధగా పథ్యంచేసి, బయటపడండి జబ్బునుండి" అంటూ ధైర్యం చెప్పారు కృష్ణస్వామి.

ఆమెకు తమ వంశమే ఆ వ్యాధినుండి బయటపడినట్టనిపించింది.

## మందుకు రావడమేకాదు – ముందుకు రావాలి

ఒక యువకుడు క్రమబద్ధంగా మందు పుచ్చుకుంటున్నాడు. చాలవరకు స్వస్థత పొందాడు. ఇదివరకు లేని చురుకుదనం, ఉత్సాహం, జిజ్ఞాసా అతనిలో కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి. ఒకసారి అతను మందుకు వచ్చినప్పుడు మందు వ్రాసిఇస్తూ, "ఏంవోయ్, మీ పరీక్షలైపోయినాయా?" అన్నారు కృష్ణస్వామి.

"అయిపోయాయండి"

"అయితే ఏం చేస్తున్నావ్?"

"ప్రస్తుతం ఖాళీగానే ఉన్నానండి"

"ఈ వయస్సులో ఖాళీగా ఉండటమేమిటోయ్?"

"మీరేదైనా చెబితే, చేయాలని ఉందండి."

"నీ వీలునుబట్టి రోజూనో, లేక ఆదివారంనాడో వచ్చి, మందులు కట్టిఇవ్వగలవా?"

"వస్తానండి, ఆమాట నేనే అడుగుదా మనుకున్నా నండి."

"అందుకేనోయ్, నే కలగజేసుకున్నది. మందుకు రావడమేకాదు, ముందుకు రావాలి. ఎప్పుడూ పేషంట్‌గా ఉండిపోవడం అవమానం కాదుటోయ్!" అంటూ వెన్నుతట్టి పంపారు కృష్ణస్వామి.

ఆరోజునుండి, నేనూ ఒక సేవకుణ్ణికదా అని పరవశించా డా యువకుడు.

## నెంబరా ? మెంబరా ?

కొన్ని నెలలపాటు వైద్యసేవలో పాల్గొని, ఆమధ్య కనపడని యువకుడొకడు మందుకనివచ్చి, క్యూ ప్రకారం నెంబరు తీసుకొని వచ్చాడు. సర్వసామాన్యంగా సేవలో పాల్గొనే సభ్యుల కుటుంబాలకు ముందుగా మందిచ్చి పంపించే ఆచారం ఉన్నది. వారికి నెంబరక్కర్లేదు.

నెంబరు తీసుకుని వరుసలో వచ్చిన యువకుణ్ణి చూచి చిరునవ్వునవ్వి, 'ఇంతకూ నీవు నెంబరా, మెంబరా?' అన్నారు కృష్ణస్వామి.

మెంబరు స్థితినుండి నెంబరు స్థితికి జారిపోయినందు కా యువకుడు బాధతో సిగ్గుపడి, తలవంచుకున్నాడు.

కృష్ణస్వామి అతని భుజం తడుతూ "బాధపడ్డానికి కాదయ్యా నేనన్నది, **బోధ పడటానికి.** నీ ఆరంభశూరత్వాన్ని

ఆచరణశూరత్వంగా మలచుకో. మలచుకోవాలని గట్టిగా సంకల్పించుకో. మేమూ నీలాగ జారుతూ ఎగబ్రాకుతూ నేర్చుకున్నవాళ్ళమే లే" అన్నారు.

ఆ ప్రేమకు యువకుని కన్నుల్లో నీళ్ళు తిరిగాయి. మందు వ్రాయించుకున్న అతను మందులు కట్టడంలో ప్రవేశించి, పూర్వంకన్న ఉత్సాహంగా పని చేయసాగాడు.

కృష్ణస్వామి సహచరునివైపు తిరిగి, "మనకన్న చిన్న వాళ్ళని ట్రీట్ చేస్తున్నప్పుడు మన పెద్దవాళ్ళు మనసెలా ట్రీట్ చేస్తూ వచ్చారో గుర్తుండాలి సుమా" అన్నారు, మాస్టరు ఇ. కె. ప్రేమను స్మరించుకుంటూ.

## కాంపౌండ్‌లోకి వచ్చినవాడల్లా కాంపౌండరే

"మీదగ్గరకొస్తే బలే ఆశ్చర్యంగా ఉంటుందండి. ఒక వారం పేషంటుగా కనపడినవాడు మరి రెండు వారాల్లో మందులుకట్టి ఇచ్చేస్తూ ఉంటాడు. ఎక్కడైనా పేషంట్లు మందు పుచ్చుకుని వెళ్ళిపోవడం ఉంటుందిగాని, పేషంట్లు సేవకులుగా మారిపోవడం ఇక్కడే చూస్తున్నా!" అన్నా రొకరు ఆనందాశ్చర్యాలతో.

కృష్ణస్వామి ఇలా అన్నారు - "వచ్చినవాళ్ళను నేను పేషంట్లుగా చూస్తేకదా వాళ్ళు పేషంట్లుగా ఉండిపోయేది, వెళ్ళిపోయేది! వాళ్ళు నాకు పేషెంట్లుకాదు; పేటెంట్లు.

కాంపౌండ్‌లోకి వచ్చినవాడెల్ల నేడో రేపో కాంపౌండర్‌గా రూపొందడం, తర్వాత తర్వాత డాక్టరుగా స్థిరపడడం నా కెప్పుడూ అనుభవమే. మిగిలినచోట్ల ఇలా జరగడం లేదన్నారు మీరు. ఎలా జరగడమైనా, మన దృష్టినిబట్టి ఉంటుంది. వారు 'ఇన్‌కమ్' కోరుతున్నారు వ్యక్తులనుండి. మనం వ్యక్తులకు 'వెల్‌కం' చెబుతున్నాం. ఇన్‌కంకూ, వెల్‌కమ్‌కు తేడా లేదు మరి?"

అడిగిన వ్యక్తి, సత్యదర్శనం పొంది సంతోషంతో పొంగిపోయాడు.

## రోగ్‌లు లేరు-ఉన్నది రోగులే

"అవలక్షణాలు కలవాళ్ళని వాడు త్రరోగ్ అండి అంటూ ఉంటాం. మోసాలు చేసేవాళ్ళు, అబద్ధాలాడేవాళ్ళు, చాడీలు చెప్పేవాళ్ళు, లేనిపోని నిందలు వేసేవాళ్ళు, ఆ నిందలు పదిమందికీ అందేటట్టు మోసేవాళ్ళు, కాపురాలు తీసేవాళ్ళు, దొంగతనాలు చేసేవాళ్ళు - ఇలాంటి వాళ్ళంతా రోగ్స్‌అని మన ఉద్దేశం. హోమియో తత్త్వశాస్త్రాన్ని ద్రష్టలైన పెద్దల దగ్గర ఉపదేశం పొందినవారికీ, శ్రద్ధతో అధ్యయనం చేసినవారికీ తెలుస్తుంది- వాళ్ళంతా రోగ్‌లు కాదు, రోగులేనని. వ్యాధి పీడితులుతప్ప, దుఃఖించడానికీ, దుఃఖింపచేయడానికి ఎవరూ సిద్ధపడరని ఆశాస్త్రం ఉదాహరణ పూర్వకంగా వివరిస్తుంది. అప్పుడు దుర్బలులుగా దుర్మార్గులుగా ప్రవర్తిస్తున్నవారిని చూచి, మనకు జాలి వేస్తుందితప్ప, ద్వేషం

కలగదు. మానవుడికి పరిపూర్ణమైన భూతదయ అబ్బడానికి హోమియో తత్త్వశాస్త్రం ఒక మంచి స్నేహితునిలా సహాకరిస్తుంది. సద్గురువులా దివ్యదర్శనాన్ని అనుగ్రహిస్తుంది" అన్నారొకసారి కృష్ణస్వామి సదవగాహనకు హోమియో శాస్త్రమిచ్చే చేయూతను వివరిస్తూ.

## అందుకున్నాను - అందుకు ఉన్నాను

కోడూరులో వైద్యసేవలో ఉన్నారు కృష్ణస్వామి.

ఒక తల్లి తన 14 ఏళ్ళకుర్రాణ్ణి తీసుకుని క్యూ ప్రకారం కృష్ణస్వామినిచేరి, బిడ్డనుగూర్చి చెప్పి, అతని అలవాట్లు అభ్యాసాలనుగూర్చి వివరించి, "ఒక్కగానొక్క కొడుకు-వీణ్ణి మీరే అన్నివిధాలుగా తీర్చిదిద్దాలి. మీచేతుల్లో పెడుతున్నాను" అంటూ కుర్రవాడి చేతుల్ని కృష్ణస్వామి చేతులకందించింది. ఆ చేతుల్ని అందుకుంటూ కృష్ణస్వామి, "అందుకున్నాను. అందుకు ఉన్నాను" అంటూ ప్రేమ కురుస్తున్న కన్నులతో ఆమెవైపు చూశారు.

ఆయన వాక్యంలోని భావం ఎంత లోతైనదో అంత విశ్వాసం ఆమెకు కలిగి, "అందుకేగా స్వామీ, పనిగట్టుకుని పట్టుకొచ్చాను" అన్నది నమస్కరిస్తూ.

కృష్ణస్వామి ఆమెవైపు ఓదార్పుగా చూశారు.

"బరువంతా దిగిపోయి, ఒళ్ళే తేలికైపోయినట్టుంది, మీనోటినుండి ఆ మాట వినేటప్పటికి" అంటూ పరవశించిందామె.

# సమాజము-సంస్కరణ

## నాన్న బ్రహ్మన్ అయినప్పుడు
## నాన్-బ్రాహ్మిన్ ఎక్కడ ?

"ఆఫీసుల్లోనూ, యూనివర్శిటీల్లోనూ ఎక్కడ చూసినా కులతత్త్వం. అంతటా బ్రాహ్మిన్, నాన్-బ్రాహ్మిన్ ఫీలింగే" అన్నాడొక మిత్రుడు ఇష్టాగోష్ఠి జరుపుతూ కృష్ణస్వామి గారితో.

కృష్ణస్వామి చిరునవ్వు నవ్వుతూ "నాన్న బ్రహ్మన్ అయినప్పుడు నాన్‌బ్రాహ్మిన్ ఎక్కడున్నాడు ? అందర్నీ సృష్టించింది ఒకే బ్రహ్మకదా, అయినప్పుడు అందరూ సోదరులే కదా! నాన్‌బ్రాహ్మిన్ వేరే ఉన్నాడని అనుకుంటే, అతణ్ణి సృష్టించడానికి మరొక నాన్‌బ్రహ్మ కూడా ఉండవలసి వస్తుంది. సృష్టి తత్త్వం తెలిసికూడా ఈ దృష్టిలోపం రావడం విచిత్రం కదూ" అన్నారు.

మిత్రుడు "మీ చమత్కార సంభాషణ మూలాలనే కుదిపేస్తోంది సుమా" అన్నాడు, ఆశ్చర్యం పొందుతూ.

# సమాజము-సంస్కరణ

## నాన్న బ్రహ్మన్ అయినప్పుడు నాన్-బ్రాహ్మన్ ఎక్కడ ?

"ఆఫీసుల్లోనూ, యూనివర్శిటీల్లోనూ ఎక్కడ చూసినా కులతత్త్వం. అంతటా బ్రాహ్మిన్, నాన్-బ్రాహ్మిన్ ఫీలింగే" అన్నాడొక మిత్రుడు ఇష్టాగోష్ఠి జరుపుతూ కృష్ణస్వామి గారితో.

కృష్ణస్వామి చిరునవ్వు నవ్వుతూ "నాన్న బ్రహ్మన్ అయినప్పుడు నాన్ బ్రాహ్మిన్ ఎక్కడున్నాడు? అందర్నీ సృష్టించింది ఒకే బ్రహ్మకదా, అయినప్పుడు అందరూ సోదరులే కదా! నాన్ బ్రాహ్మిన్ వేరే ఉన్నాడని అనుకుంటే, అతణ్ణి సృష్టించడానికి మరొక నాన్ బ్రహ్మకూడా ఉండవలసి వస్తుంది. సృష్టి తత్త్వం తెలిసికూడా ఈ దృష్టిలోపం రావడం విచిత్రం కదూ" అన్నారు.

మిత్రుడు "మీ చమత్కార సంభాషణ మూలాలనే కుదిపేస్తోంది సుమా" అన్నాడు, ఆశ్చర్యం పొందుతూ.

"సత్యాన్ని వంటపట్టించడానికి సరసం చాలు; విరసం అక్కర్లేదు" అన్నారు, కృష్ణస్వామి మరొక చెణుకు విసురుతూ.

## పాలిటిక్స్ - పాడుట్రిక్స్

ఒక విద్యార్థి మందుకనివచ్చి, కాస్సేపు కృష్ణస్వామి గారితో మాట్లాడివెళదామని ఆయనకు ఖాళీఅయ్యేదాకా ఉన్నాడు. ఆపైన తనను గూర్చిన తికమక లేవో చెప్పుకుంటూ "ఏంవిటోనండి, ఎక్కడ చూసినా పాలిటిక్సే" అన్నాడు.

"పాలిటిక్స్ కావయ్యా అవి పాడుట్రిక్స్" అన్నారు నవ్వుతూ కృష్ణస్వామి.

ఆ విద్యార్థి ఆశ్చర్యపడుతూ నవ్వాడు.

కృష్ణస్వామి ఇలా అన్నారు -

"ప్రతి పిచ్చివేషాన్ని, ప్రతి దుష్ట ఆలోచనని, స్వార్థం కోసం పడే ప్రతి కక్కుర్తిని పాలిటిక్స్ అంటే ఎలా ? ఆపదం చౌకబారయిపోదూ ? రాజ్యక్షేమం కోసం వేసే ఎత్తుగడలు రాజకీయాలవుతాయి. స్వార్థం కోసం పడే కక్కుర్తుల్ని రాజకీయాలనవచ్చా ? అందుకే నేనీ వెధవవేషాలన్నిటినీ పాలిటిక్స్ అనకుండా పాడుట్రిక్స్ అంటున్నాను. నామకరణం బాగుంది కదూ !"

"చాలా బాగుంది. పరిస్థితులకు తగ్గట్టుగా ఉంది" అన్నాడతను.

## అవును, చదువు 'కొంటు'న్నారు

ఒకసారి ఒకాయన ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతూ "ఇక్కడ ఈ పిల్లలు చదువుకుంటున్నారు. అక్కడ ఆ పిల్లలు చదువుకుంటున్నారు" అంటూ తమ పిల్లల్ని గూర్చిన భోగట్టాలు చెప్పసాగాడు.

మధ్యలో కృష్ణస్వామి చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారు - "అవును, మన పిల్లలు చదువు 'కొంటు'న్నారు."

కృష్ణస్వామిగారి విరుపు ఆయనకు అర్థమై నిజమే నన్నట్టు నవ్వేశాడు.

పిల్లలకుగాను ఇక్కడ ఇంత ఖర్చవుతోంది, అక్కడ అంత ఖర్చవుతోంది అన్న విషయాలను ఏకరువు పెడుతున్న వాడు ఆవిరువుని అర్థంచేసుకోలేడా! అది విరుపుకాదు; మన సమాజం వీపుపైన కృష్ణస్వామి చరుస్తున్న ఒక చరువు.

డబ్బులు ఖర్చవుతున్నాయి, పట్టాలొచ్చేస్తున్నాయి తప్ప, మనపిల్లలకు జరుగుతున్న దేమిటి? మనకు ఒరుగుతున్న దేమిటి?

## వృత్తి విద్యలు - ఉత్త విద్యలు

పూర్వం మనం ఆశ్రయించినవి వృత్తివిద్యలు. ఇప్పుడు మనం ఆశ్రయించడానికి మోజు పడుతున్నవి ఉత్తవిద్యలు. వృత్తివిద్యలవల్ల, సమాజానికి ఉపయోగపడి, మన అన్నం

మనం సునాయాసంగా పొందేవాళ్ళం. వాటిని విడిచిపెట్టి ఈవృత్తివిద్యలవెంటపడినతర్వాత, ఎంత చదివినా ఉద్యోగం కోసం ముష్టెత్తక తప్పదు కదా! అన్ని ఫారాలు చదివి ఏమి చేయాలో తెలియక ఏ కోళ్ళఫారాలో పెట్టుకున్న వాళ్ళెంత మందిలేరు? ఈ కోళ్ళఫారాలు డైరీఫారాలు పెట్టుకోవడానికి చదువుపేరిట ఇన్నివేలు తగలబెట్టడ మెందుకు? చిన్నప్పటి నుంచి మనపెద్దవాళ్ళ దగ్గర శిక్షణ పొంది ఉంటే, ఇంతకన్న చక్కగా వాటిని నిర్వహించగలం కదా! చదువుకున్నతర్వాత వాటి దగ్గరకు వచ్చామని తెలిస్తే, ఆ కోళ్ళు, గేదెలు మనను ఒక ఆట ఆడించేస్తాయి సుమా! పనినివిడిచి చదువుకున్నవాడు తిరిగి పనిని ఎలాచేయగలడు? పనిని విడువక చదువుకున్న వాడు, తాను చేయగలిగిన పనినిగూర్చి చదువుకున్నవాడు మనకిపుడు కావాలి" అంటూ వివరించారు ప్రస్తుత విద్యా విధానంలోని అవకతవకలను సమీక్షిస్తూ కృష్ణస్వామి ఒకసారి

## వెనుకబడిన జాతులు కారు —
## వెన్నెముక జాతులు మీరు

1981 ఆగష్టు 15న స్నేహపూర్వకమైన ఆహ్వానాన్ని పురస్కరించుకుని, ఒక బి. సి. హాస్టల్‌లోని విద్యార్థుల్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ, కృష్ణస్వామి-

"మీవి వెనుకబడిన కులాలని అన్నవారెవరు? వెనుక బడిన కులాలుకాదు - వెన్నెముకవంటికులాలు మీవి.

Backward casts కాదు - Backbone casts. బాక్‌వర్డ్ అన్న మాటే ఆక్‌వర్డ్‌గా ఉంది. మనం ఏది భావిస్తే అదయిపోతాం. 'నేను పనికిరానివాణ్ణి, నేను పనికిరానివాణ్ణి' అని పదేపదే అనుకుంటే నేను నిజంగానే పనికిరానివాణ్ణయిపోతాను. అలాంటిదే నేను వెనుకబడినవాణ్ణి అనుకోవడం కూడా. నిజానికి మీ కులాలవాళ్ళు చేస్తూ వస్తున్న కాయకష్టం మీదనే ఈ దేశం ఇప్పటివరకూ నిలబడి ఉంది. మిగతావాళ్ళంతా మీ కాయకష్టాన్ని అమ్ముకునో కొనుక్కునో బ్రతుకుతున్నవాళ్ళే. అయితే, ఒక ప్రమాదం వచ్చింది - చదువుకుని పని చేయలేనివాళ్ళూ, పనిచేయడానికి ప్రాణం ఒప్పనివాళ్ళూ దళారీలుగామారి, ఈ పనిచేస్తున్న వాళ్ళను మోసం చేయడం ప్రారంభించారు. వాళ్ళ మోసంలో పడకుండా ఉండాలి అంటే మీరు చదువుకోవాలి. మీకు అక్షరం ముక్కలు రావాలి. లోకరీతులు తెలియాలి.

"కానీ, మీరు మరో విధంగా మోసపోయే ప్రమాదం ఉంది. ఈ చదువుకోవడంలో పడి, మీరు చేస్తున్న పనిని మానివేయడమో, లేక దాన్ని హీనంగా చూడడమో చేయకూడదు. అదే జరిగితే, మీరుకూడా మాలాంటి చదువుకున్న వారిలాగ కర్మభ్రష్టులవుతారు. చేతిలో ఉన్న పనిని వదలుకొని, ఇంకెవరో ఇచ్చే పనికోసం చేయి జాచే దుస్థితికి దిగజారకండి. మీ వృత్తివిద్యలు మీరు నేర్చుకుంటూనే ఈ చదువులు మీరు **చదువుకోండి.** లేకపోతే లేని గోడకు

సున్నం కొట్టినట్టవుతుంది మీ పని" అంటూ కృష్ణస్వామి చేసిన విశ్లేషణ ఆ కుర్రవాళ్ళకు బాగా హత్తుకుంది. తమను గూర్చి తమకు తెలియజెప్పినందుకు వారెంతో సంతోషించారు. తెలియనివి చెప్పేవారు చాలామంది ఉంటారు. కానీ, తెలియ జెప్పగలవారు కొందరే ఉంటారు.

## అవకాశంతోపాటు అర్హతను కూడా పెంచగలగాలి

"వెనుకబడినవారిని పైకి లేవనెత్తడానికి కోట్లు కోట్లు ఖర్చుపెడుతోంది ప్రభుత్వం. కానీ అభివృద్ధి కాగితాలమీద కనిపించినంతగా జీవితాలలో కనిపించడంలేదు. దీనికి కారణ మేమిటంటారు ?" అని అడిగారు సన్నిహితులొకరు కృష్ణ స్వామిని.

కృష్ణస్వామి ఇలా అన్నారు - "కోట్లు కోట్లు ఖర్చుబెట్టి ప్రభుత్వం ఏం చేస్తోంది ? బాగుపడడానికి అవకాశాలు కల్పిస్తోంది. కానీ వ్యక్తి బాగుపడడానికి అవకాశం ఒక్కటే చాలదు. అతనికి అర్హతకూడా పెరగాలి. అంటే ఆ అవ కాశాన్ని సద్వినియోగం చేసుకోగల సంస్కారం అతనిలో పెంపొందాలి. తగిన సంస్కారం లేనప్పుడు అవకాశాలు లభించడం చిల్లుకుండకు నీళ్ళుపోసేవాడు దొరకడం లాంటిది. అవకాశాలు కల్గించే ప్రయత్నంతోబాటు, అర్హతను పెంచే ప్రయత్నం కూడా ఏకకాలంలో జరిగినప్పుడు మాత్రమే ప్రయత్నాలు ఫలించగలవు. కానీ నాయకుల దృష్టి

అవకాశాలు కల్పించి వారి నుండి ఓట్లు పొందడంపైన ఉంటోంది తప్ప, వారెంతవరకు తామిచ్చిన అవకాశాలు సద్వినియోగ పరచుకుంటున్నారన్న అంశం మీద ఉండడం లేదు. ఈ దృష్టిలోపం చాలా దారుణ ఫలితాలకు దారి తీయగలదు. అసలు మార్గమేమిటంటే ముందు నాయకుల అర్హతలు పెరగాలి-'యథారాజా, తథాప్రజా' కదా మరి!"

"మీ వివరణ చక్కటి సత్యదర్శనాన్ని కల్గిస్తోంది. మీ మాటలు అక్షరాలా నిజం" అంటూ తృప్తి చెందాడు ఆ అడిగిన వ్యక్తి.

## నినాదం చాలదు–నిర్మాణం కావాలి

"నవసమాజం కావాలి, సమసమాజం కావాలి, శాస్త్రీయ విద్యావిధానం రావాలి మొదలైన నినాదాలు గోడలపైన కనబడుతూ ఉంటాయి. ఊరేగింపుల్లో వినబడుతూ ఉంటాయి. ఈ నినాదాలు మంచివే. అవన్నీ కావలసిందే. రావలసిందే. కాని,రప్పించేవారెవరు అన్నది ప్రశ్న. ఆ ప్రశ్నను సూటిగా వేసుకుంటే రప్పించవలసిందీ, రూపొందించవలసిందీ మనమేగాని ఆ గోడలుకాదనీ కాబట్టి వాటిపై వ్రాసి లాభం లేదనీ జవాబు వస్తుంది. రావాలని గొంతెత్తి అరుస్తున్న మనం గోడలు పాడుచేస్తున్న మనం అవి రావడానికిగాను చేస్తున్న కృషి ఏమిటని మనని మనం ప్రశ్నించుకోవలసి ఉంటుంది.

"వీటిని తీసుకురావలసిన బాధ్యత ప్రజలు పాలకులమీద, పాలకులు ప్రజలు, ప్రజల్లోని మేధావులమీద తోసేస్తూ కాలక్షేపం చేస్తున్నారు. కాని నవసమాజ నిర్మాణంలో మనలో ప్రతిఒక్కరికీ పాత్ర ఉంటుందని గ్రహించి తనవంతు పాత్రనెరిగి నిర్వహించగలవాడే నిజమైన పౌరుడు. మనం అలాంటి పౌరసత్వానికి నోచుకోవలసి ఉంటుంది. హక్కుల ఎడల అపేక్ష, బాధ్యతల ఎడల ఉపేక్ష మన జాతిలక్షణంగా కనబడుతోంది. ఈ లక్షణంనుండి మనం బైటపడాలి. నినాదం చాలదు; నిర్మాణం కావాలి. నిర్మాణాత్మకమైన కృషిలేని నినాదాలు గాలికి ఒత్తిడి,కంఠానికి రాపిడి తప్ప, ప్రయోజనాన్ని సాధించలేవు. ఈ సత్యాన్ని ఇప్పటికైనా మనం గ్రహించాలి. నేనుగాక ఇంకెవరో చేయలేదనే బాధలే నినాదాలు. నేనుచేస్తే మరి కొంతమంది చేస్తారని తెలియాలి" అన్నారొకసారి యువకుల్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ కృష్ణస్వామి.

## తిట్టడంకాదు_తట్టడం కావాలి

"సమాజం కుళ్ళిపోయిందని దిగజారిపోతుందని ఇక బాగుపడదని శపించినట్టు తిట్టేవాళ్ళు తగులుతూ ఉంటారు. దానివల్ల తిట్టేవాళ్ళలో ద్వేషం, విన్నవాళ్ళకు నిస్పృహ పెరగడం తప్ప జరిగేదేమీ ఉండదు. చేయవలసింది తిట్టడం కాదు; తట్టడం.

"ప్రతి మనిషిలోనూ ఎంతో కొంత మంచి ఉంటుంది. ఆ మంచిని తట్టి లేపేవాళ్ళిపుడు కావాలి. మాటలతో

మాత్రమే దాన్ని తట్టగలమనుకోవడం మన అనుభవంలేని తనాన్ని తెలియజేస్తుంది. ప్రవర్తనతో మాత్రమే దాన్ని మనం కర్తవ్యోన్ముఖంగా తట్టగలం. అంటే మనుషులలోని మంచిని తట్టి, మనిషిని పెంచగల తోటమాలులవంటి మంచి వేత్తలు మనకిప్పుడు కావాలి.

"వక్తృత్వంతో మనుషులను ఆవేశపరచగలం. వ్యక్తిత్వంతో మాత్రమే మనుషులను ఆచరింప జేయగలం. నవ సమాజాన్ని కోరేవారు ఈ సత్యాన్ని గ్రహించగలగడం ఎంతైనా అవసరం. నవసమాజ నిర్మాణానికి కావలసింది ప్రవర్తనతో కూడిన ప్రబోధం. అప్పుడు ప్రబోధం మనిషిని మేల్కొలుపుతుంది, ప్రవర్తన మనిషిని తీర్చిదిద్దుతుంది. ప్రవర్తనలేని ప్రబోధం మనిషిని రెచ్చగొట్టకలదు తప్ప, తీర్చిదిద్దలేదు. ప్రబోధం లేకపోయినా ప్రవర్తనఉంటే, ఆ ప్రవర్తన రామకథలా జగత్తును ఆక్రమించగలదు. కాల కాలాల్లో మానవుల వెన్నుతట్టి, జీవితాలను తీర్చిదిద్దగలదు" అంటూ కృష్ణస్వామి ఒకప్పుడు చెప్పిన మాటలు మంత్రాలై నా చెవుల్లో ఇప్పటికీ మారుమ్రోగుతూనే ఉన్నాయి.

భుజకీర్తులు కలవారు కాదు –
భుజంకలిపేవారు ఇప్పుడు కావాలి

"మహత్తర విషయాలు తెలిసినవారు ఉండవచ్చు. మహాపండితులు ఉండవచ్చు. అఘటనఘటనా సమర్థులూ ఉండవచ్చు. కానీ మనకిప్పుడు కావలసింది భుజకీర్తులు కల వారు కాదు, భుజం కలిపి నడిచేవారు.

"పెద్దవాళ్ళు అనబడేవారిలో రెండురకాలవాళ్ళుంటారు. మిగిలిన సమాజం తమను గౌరవించాలి అని కోరుకునే వారొకరకం; సమాజాన్ని మనకున్న శక్తియుక్తులతో సేవించు కుందాం అని దీక్ష వహించి, సామాన్యులతో భుజం కలిపి నడిచేవారింకొకరకం. ఈ రెండురకాల్లో మొదటివారికి కావలసింది సన్మానం. రెండవవారు కోరేది సన్మార్గం. మొదటివారు ప్రజలు తమకొరకు ఉన్నారనుకొంటారు. రెండవవారు ప్రజలకొరకు తామున్నామని తెలుసుకుంటారు. మొదటిరకంవారికి ప్రజలు కానుకలు చెల్లించుకుంటారు. రెండవరకంవారికి ప్రజలు తమ జీవితాలనే సమర్పించు కుంటారు. పెద్దవాళ్ళల్లో రెండవరకంవారి సంఖ్యపైన ఆధారపడి ఉంటుంది సామాజిక పురోభివృద్ధి. అందుకే వారి సంఖ్య పెరగాలని కోరుకుంటున్నాను" అన్నారు కృష్ణస్వామి చక్కటి విశ్లేషణ నందిస్తూ ఒకసారి.

## తిరుగుబాటు కాదు,
## తిరిగి బాటకెక్కించడం కావాలి

చరిత్ర గతిని శ్రద్ధతో పరిశీలిస్తే, కొన్ని శతాబ్దులలో మానవజాతి సుఖంగా సహజీవనం చేసినట్టు, ఇంకొన్ని శతాబ్దుల్లో భేదభావంతో మారణహోమాలు జరుపుకున్నట్టు తెలుస్తుంది. భౌతికంగా మానసికంగా సమస్థితిని అనుభ వించడానికి సిద్ధపడినప్పుడు జాతి సుఖపడుతూ ఉంటుంది. సమస్థితికి సిద్ధపడనప్పుడు పోరాటాలతో దుఃఖపడుతూ ఉంటుంది.

"సహజీవనానికి దారితీసే బాట ఒకటి ఉన్నది. ఆ బాటనే అనాదిగా ద్రష్టలంతా దర్శిస్తూ వస్తున్నారు. ధర్మ సంస్థాపనమంటే మరల మరల మానవ జాతిని ఈ బాటకు చేరుస్తూ ఉండడమని అర్థం. శాశ్వతమైన ఈ బాటనే పెద్దలు సనాతన ధర్మము అని పిలిచారు. సనాతనమంటే ప్రాచీనమని అర్థంకాదు; శాశ్వతము, నిత్యనూతనము అని అర్థం. మనిషికీ మనిషికీ సంబంధం ఎలా ఉండాలి అన్నది, ఎలా ఉంటే సుఖపడతారు అన్నది దేశకాలాలకు అతీతంగా ఒకే విధంగా ఉంటుంది. ఇప్పుడు మనకు తిరుగుబాటు తెచ్చే వారు కాదు, తిరిగి బాటకెక్కించేవారు కావాలి. క్రొత్తదాన్నే సాధించాలనుకోవడం కక్షుతనాన్ని తెలియజేస్తుంది. కావలసినదాన్ని సాధించుకోవాలనుకోవడం వివేకాన్ని సూచిస్తుంది.

"కావలసినదానిపైన దృష్టి ఉన్నవాడికి పాతక్రొత్తలంటవు. పాతక్రొత్తలంటనివాడే దేశకాలాలకు అతీతంగా ఉన్న సహజీవనమార్గాన్ని తన దేశకాలాలకు అనుగుణంగా సమన్వయించి, అందించగలుగుతాడు. సమన్వయించినప్పుడల్లా అది క్రొత్తగా కనపడుతూ ఉంటుంది. కానీ, సమన్వయించినవాడికి తెలుసు అది - సనాతనమైనదని, నిత్యనూతనమైనదని" అంటూ కృష్ణస్వామి లోతులకు తీసుకువెళ్ళి లోటులు దిద్దుకునే మార్గం చూపారు ఒక ప్రసంగంలో.

# సహాచరులు-సరిదారి

## మందడుగు – ముందడుగు

"మాస్టరుగారు మా ఇలువేల్పు. మా చిన్నబ్బాయి జబ్బుతో మాకు మాస్టరుగారి నీడ దొరికింది. ఆ తరువాత మీగూర్చి మీ రశ్రద్ధ చేయద్దు అని మా ఆవిడ పదేపదే చెప్పడంతో నేను కూడా వారిదగ్గర మందు మొదలుపెట్టాను. ఈమధ్య మా మరదలు వచ్చింది. ఆవిడ అనారోగ్యాన్ని గురించి కూడా మాస్టరుగారినే సంప్రదించాం. ఈ మధ్యనే తమకు కూడా మాస్టరుగారి మందే కావాలని, వినికిడివల్ల విశ్వాసం పెరుగుతోందని మా నాన్నగారు ఉత్తరం వ్రాశారు. ఈ విధంగా మేమూ, మా కుటుంబం, మా వంశం, బంధుమిత్రులు - అందరం మాస్టరుగారి మార్గంలోకి చేరుకున్నాం. ఆ బాటనే నడుస్తున్నాం."

తమకు సన్నిహితుడైన ఆ వ్యక్తి మాటలు విని, కృష్ణస్వామి చిన్నగా నవ్వారు.

'ఏమి అలా నవ్వుతున్నారు?' అని అడిగాడు ఆయన.

# సహచరులు-సరిదారి

## మందడుగు — ముందడుగు

"మాస్టరుగారు మా ఇలువేల్పు. మా చిన్నబ్బాయి జబ్బుతో మాకు మాస్టరుగారి నీడ దొరికింది. ఆ తరువాత మీగూర్చి మీ ర|శద్ధ చేయద్దు అని మా ఆవిడ పదేపదే చెప్పడంతో నేను కూడా వారిదగ్గర మందు మొదలుపెట్టాను. ఈమధ్య మా మరదలు వచ్చింది. ఆవిడ అనారోగ్యాన్ని గురించి కూడా మాస్టరుగారినే సం|పదించాం. ఈ మధ్యనే తమకు కూడా మాస్టరుగారి మందే కావాలని, వినికిడివల్ల విశ్వాసం పెరుగుతోందని మా నాన్నగారు ఉత్తరం |వాశారు. ఈ విధంగా మేమూ, మా కుటుంబం, మా వంశం, బంధుమి|తులు - అందరం మాస్టరుగారి మార్గంలోకి చేరుకున్నాం. ఆ బాటనే నడుస్తున్నాం."

తమకు సన్నిహితుడైన ఆ వ్యక్తి మాటలు విని, కృష్ణస్వామి చిన్నగా నవ్వారు.

'ఏమి అలా నవ్వుతున్నారు?' అని అడిగాడు ఆయన.

"మీరు 'మాస్టరుగారి మార్గానికి చేరుకున్నాం, నడుస్తున్నాం' అన్నారు కదా, అందుకు నవ్వొచ్చింది."

తానన్నదానిలో తప్పేమిటా అన్నట్టు చూశాడాయన.

కృష్ణస్వామి ఇలా వివరించారు -

"మీరు చెప్పిన సన్నివేశాల్లో మీరు మాస్టరుగారిని ఉపయోగించుకుంటున్నట్టు స్పష్టంగా తెలుస్తోంది. అంతో వం- తప్పులేదు, మనకు ఉపయోగపడడానికే ఆయన ఉన్నారు కనుక. కానీ ఆయన మార్గంలో నడుస్తున్నాం అన్నారు మీరు. నడిస్తే అంతకన్న కావలసింది లేదు. ఆయనలా పదిమందికి ఉపయోగపడగలిగినప్పుడు మాత్రమే ఆయన మార్గలో మనం నడుస్తున్నట్టు అవుతుంది. అంతవరకు వారిని ఉపయోగించుకుంటున్నాం అని మాత్రం చెప్పవచ్చు. ఉపయోగం పొందే స్థితినుండి ఉపదేశంపొందేస్థితికీ, మందు అడిగే స్థితినుండి ముందడుగు వేసే స్థితికీ మనం ఎదగాలి. అలా ఎదిగినప్పుడుమాత్రమే ఆయన మార్గం మనకు చేరువౌతుంది."

ఆ వ్యక్తి కొంచెం సిగ్గుపడుతూ "మీరన్నది నిజమే. మీరన్నట్టు ఆయననుండి ఉపయోగం పొందేస్థితినుండి ఆయనలా ఉపయోగపడే స్థితికి ఎదగాలనీ, ఆయన మార్గాన నడిచే మంచిరోజులు రావాలనీ కోరుకుంటున్నాను" అన్నాడు.

"వచ్చాయి కాబట్టే కృష్ణస్వామిగారినుండి ఈ హెచ్చరిక మీకు అంది ఉంటుంది" అన్నాను నేను.

నమ్ముకుంటున్నామా? అమ్ముకుంటున్నామా?

మాస్టరుగారి ఆశీస్సులతో ఒక వ్యాపారసంస్థను పెట్టి దినదిన ప్రవర్ధమానంగా నడుపుతున్న వ్యక్తి ఒకరు ఒకసారి కృష్ణస్వామిని కలిసి ఇలా అన్నారు -

"మాస్టరుగారి దయవల్ల మా వ్యాపారం నిరాఘాటంగా సాగుతోంది. ఎక్కడకు వెళ్ళినా ప్రతి సంస్థలోనూ, మాస్టరుగారి శిష్యులు, అభిమానులు ఉంటారుకదా! వాళ్ళందరూ ప్రేమతో సహకరిస్తున్నారు. మా ఖాతాదారుల్లో కూడా ఎక్కువమంది మాస్టరుగారిని బాగా తెలిసున్నవారే. ఆ అభిమానంతోనే మా సంస్థకు అలవాటు పడ్డారు. ఆయన దయవల్ల చీకూచింతా లేకుండా బండి నడిచిపోతోంది."

కొంచెం ఆగి, కృష్ణస్వామి ఇలా అడిగారు- "పూర్వం మీరు డిస్పెన్సరీలో సేవచేస్తూ కనపడేవారు. ఈమధ్య ........?"

అతనందుకొని ఇలా అన్నాడు - "సాగటంలేదండీ. వ్యాపారం పని సరిపోతోంది".

"సాయంకాలం ఉపన్యాస సమయంలో కూడా...?"

"కుదరడంలేదండీ. అప్పటికీ ఎంతో ప్రయత్నిస్తున్నాను."

కృష్ణస్వామి ఇలా అన్నారు-

"నాకు అప్పుడప్పుడు ఒక అనుమానం వస్తూ ఉంటుంది. మాస్టరుగారిని మనం నమ్ముకుంటున్నామా, లేక అమ్ముకుంటున్నామా అని. ఆయన పేరును ఉపయోగించు కోవడంలో ఉన్న కుతూహలం ఆయన చూపిస్తున్న మార్గాన నడవడంలో కనపడనప్పుడల్లా నాకీ సందేహం వస్తూ ఉంటుంది."

అవతలి వ్యక్తి కొంచెంగా తలవంచుకున్నాడు. కృష్ణ స్వామి ఇంకా ఇలా అన్నారు-

"మాస్టరుగారిని ఉపయోగించుకోవడం తప్పు కాదు. కానీ మాస్టరుగారిలా మనం నలుగురికి ఉపయోగపడడం జరుగుతున్నప్పుడు మాత్రమే ఆ ఉపయోగాన్ని స్వీకరించ డానికి అర్హుల మౌతాము. లేనప్పుడు మనం అవకాశ వాదులమే."

ఆలోచనలో పడినట్టయి అతని కన్నులు కొద్దిగా చెమర్చాయి. కొంచెం గద్గదమైన కంఠంతో ఇలా అన్నాడు- "నిజమే, మీరన్నది. వెనక్కి తిరిగి చూసుకుంటే, నేను అవ కాశ వాదినేమో అనిపిస్తోంది. దారిదొరికేటంతవరకు సేవలో పాల్గొన్నాను. ఉపన్యాసాలకు శ్రద్ధగా వచ్చాను. కానీ చిత్రం! ఆయన దయవల్ల దారి దొరికింది. ఈ సంస్థ పెట్టాను. బండి నడుస్తోంది. నాకు తెలియకుండా నేను

మాస్టరుగారికి దూరమయ్యానని ఇప్పుడు మీ మాటలవల్ల బోధపడింది. అవసరం తీరేటప్పటికి మనిషి మనస్సు ఎందుకిలా చిత్రంగా ప్రవర్తిస్తుందో!" అతని కళ్ళనుండి నీళ్ళు జలజలా రాలాయి.

కృష్ణస్వామి "కలత పడకండి. కర్తవ్యాన్ని గమనించండి. మిమ్మల్ని కర్తవ్యోన్ముఖుల్ని చేసేటందుకే పని కట్టుకుని హెచ్చరించాను. మీకు తెలియకుండానే జారిపోతున్నారు గనుక, సహచరుడిగా తెలియజెప్పాను. మనకి మనం చెప్పుకోకపోతే ఇంకెవరు చెపుతారు? నాకు మీరు చెప్పాలి, మీకు నేను చెప్పాలి. ఒకరి నొకరు హెచ్చరించుకొంటూ మాస్టరుగారితో కలిసి నడవాలి" అనే వాక్యాలతో కన్నీళ్ళు తుడిచారు.

"వస్తాను సార్. రేపట్నుంచి ఇదివరకు లాగానే ప్రవర్తిస్తాను. మీరే చూస్తారుగా" అంటూ సెలవు కోరాడు.

కృష్ణస్వామి ఇలా అన్నారు-

"మీరు చేస్తున్న పనిని మానుకుని సేవలో పాల్గొనకండి. పనిని సద్దుబాటు చేసుకునేటందుకు వీలయితేనే చూడండి. లేనప్పుడు మీరు చేస్తున్న పనినే మాస్టరుగారి వెలుగులో చేయండి. ఆయన వెలుగును విడవకుండా ఉండడమే మనకు ముఖ్యం."

"పరవా లేదులెండి. వచ్చేస్తాను. మాస్టరుగారి సేవలో ఎంతో కొంతసేపు పాలుపంచుకుంటేనే మీరన్నట్టు మిగిలిన

వృత్తివ్యాపారాలు ఆయన వెలుగులో నిర్వహించడానికి వీలవుతుంది అని నాకనిపిస్తోంది. లేకపోతే ఇప్పుడు వచ్చినట్టే ఏమరుపాటు వచ్చేయగలదు. వస్తాను" అంటూ తృప్తిగా సెలవు తీసుకున్నాడు.

## జీతంకన్న జీవితం విలువైనది

ఒకసారి ఒక నడివయస్సువాడు తనకు బంధువైన ఒక యువకునితో కృష్ణస్వామిగారిని కలిశాడు. మాటల సందర్భంలో "మావాడు మిమ్మల్ని ఎప్పట్నుంచో ఒక ప్రశ్న అడుగుదా మనుకుంటున్నాడు. 'అడగవచ్చు. ఆయనేమీ అనుకోరు. ర' మ్మని నాతో తీసుకువచ్చాను. ఆ ప్రశ్నకు మీరు చెప్పబోయే సమాధానం విందామని నాకూ ఉంది" అన్నాడతను.

"సంకోచం ? ఎందుకు మనమధ్య ఉండవలసింది చనవుగాని, సంకోచం కాదు" అన్నారు కృష్ణస్వామి, ఆ యువకుని చూస్తూ.

"ఏమీ లేదు. మీరు ఉద్యోగం చేయకుండ మాస్టరుగారితోనే ఉండిపోవాలని ఎందుకు నిర్ణయించు కున్నారు ? అన్నదే నా ప్రశ్న."

కృష్ణస్వామి నవ్వుతూ, "మనిషి అన్నవాడు తనకు తగిన పనిని చేయాలని నా ఉద్దేశం. దీనినే మన పెద్దవాళ్ళు స్వధర్మ నిర్వహణం అన్నారు. మనంచేసే పనివల్ల మనం

పెరగాలి. అన్ని విధాలా పెరగాలి. పూర్వం వృత్తివిద్యల నాశ్రయించినప్పుడు ఈ పెనుగుదల సిద్ధించేది. బుద్ధిమంతుడైన ఒక వడ్రంగి ఉన్నాడనుకో. అతను సమాజానికి కావలసిన పని చేసిపెడుతున్నాడు, కుటుంబాన్ని పోషిస్తున్నాడు. వృత్తిని కళగా అభ్యసిస్తూ తాను పెరుగుతూ ఆత్మతృప్తిని అనుభవిస్తున్నాడు.

"ఆధునికమయిన విద్యావిధానంవల్ల మనిషి ఉద్యోగై కేవలం పొట్టపోసుకో గలుగుతున్నాడు. పొట్టపోసుకోవడమే గమ్యంగా పెట్టుకున్న యువకుడు తన స్వభావానికి తగని ఉద్యోగంలో కూడా కోరి ఇరుక్కుంటున్నాడు. దొరికిన కోర్సులో చేరడం, దొరికిన ఉద్యోగం చేయడం. అంతేగా మనం చేస్తున్నది! అందుకే మన జీవితాల్లో ఆత్మతృప్తికి బదులు అసంతృప్తి కలుగుతోంది. ప్రశాంతికి బదులు అశాంతి పండుతోంది. ఈ సత్యాన్ని గమనించిన నేను నన్ను నేను పెంచుకోదలచుకున్నాను. నేను చేసేపనిలో ప్రతి అంశం నా పెరుగుదలకు పనికిరావాలి, ప్రతిక్షణం నేను ఆత్మతృప్తిని అనుభవించగలగాలి. అందుకే దుర్లభమైన మాస్టరుగారి సన్నిధిలో ఈ జీవితాన్ని సమర్పణ చేశాను. చేశాను అనడం కన్న జరిగింది అనడం ఎక్కువ భావ్యం. ఇనుపముక్క అయస్కాంతానికి నేను అతుక్కున్నాను అనవచ్చా? అయస్కాంతంచేత ఆకర్షింపబడ్డాను అనవచ్చు. నాకు జీతంకన్న, జీవితం విలువైనది" అన్నారు.

యువకుడు విస్తుపోయి వింటున్నాడు. బహుశా తానెక్కవలసిన మెట్లవైపు చూస్తున్నాడేమో!

## కారులేనివాడికి పెట్రోలు ఎందుకు?

ఒకసారి ఒక యువకుడు కృష్ణస్వామిగారిని కలిసి "మా ఊళ్ళో మీ ఉపన్యాసం జరగాలని ఎప్పట్నుండో అనుకుంటున్నాం. మీరు తప్పకుండా రావాలి" అన్నాడు.

కృష్ణస్వామి చిన్నగా నవ్వుతూ "కారులేనివాళ్ళకు పెట్రోలు ఎందుకయ్యా?" అన్నారు.

ఆ యువకుడు ఆశ్చర్యంగానూ, అర్థంకావలసింది ఉందన్నట్టుగానూ చూశాడు.

కృష్ణస్వామి ఇలా అన్నారు -

"నలుగురికీ పనికొచ్చే మంచిపని ఏదైనా చేస్తున్న వాళ్ళకు, చేయడానికి సిద్ధపడుతున్నవాళ్ళకు మా బోటి వాళ్ళ మాటలు పనికివస్తాయి. కాలక్షేపంకోసం వినే వాళ్ళకు, చెప్పేవాళ్ళ పాండిత్యాన్ని కొలవడానికి కూర్చునే వాళ్ళకు ఈ మాటలు అనవసరం. మంచిపని అనే వాహనానికి దిగి వస్తున్న సందేశాన్ని పెట్రోలుగా వాడుతున్న వాళ్ళం మేం. వాహనం లేకుండా పెట్రోలు నాహ్వానించడం అనవసరం కదా!"

ఆ మాటల గాంభీర్యానికి ఆ యువకుడు స్పందించాడు. "బోధపడింది మాస్టారూ! జరిగిన ఆలస్యానికి సిగ్గు పడుతున్నాను. త్వరలోనే వాహనాన్ని సిద్ధంచేసుకుని మిమ్మల్ని కలుసుకుంటాను" అని నమస్కరించాడు.

"నీ వలా సిద్ధపరచుకు రాగలవాడవని తెలిసేనయ్యా హెచ్చరించింది. మీరు నివురుగప్పిన నిప్పులు. మీ సామర్థ్యం అనే నిప్పుపైన అలసత్వం అనే నివురు కప్పుకొని ఉంది. ఆ నివురును ఊది అగ్నిని జ్వలింపచేయడానికే మా ప్రయత్నం. వెళ్ళి రా, శుభం."

## సత్కర్మాచరణకు సద్గోష్ఠి పెట్రోలు

ఒకసారి ఒకానొక కేంద్రంనుండి ఒక సోదరుడు వచ్చి కృష్ణస్వామిగారితో సమాలోచనం జరుపుతున్నాడు. డిస్పెన్సరీ నిర్వహణ మొదలైనవాటినిగూర్చి విని "సద్గోష్ఠు లేమైనా జరుపుకుంటున్నారా ?" అని అడిగాడు కృష్ణస్వామి.

"లేదండీ" అన్నాడతను.

"వారానికి ఒకరోజైనా నలుగురూ చేరి, ఏదో ఒక సద్గ్రంథాన్ని అధ్యయనం చేసి, వివరించుకోకపోతే మనకు తెలియకుండానే మనకు తుప్పుపడుతుంది సుమా! సత్కర్మాచరణ చిరకాలం కొనసాగాలి అంటే సద్గోష్ఠిని పెట్రోలుగా ఆ వాహనానికి పోసితీరాలి. లేకపోయినట్లయితే ఎంత మంచి ఉద్దేశంతో మనం ఒకచోట ఒక మంచిపని

చేయడానికి జేరినా క్రమంగా అభిప్రాయ భేదాలు పుట్టుకొచ్చి కుళ్ళిపోతాం. తోడివారితో దేవుడికి బదులుగా మనం దెప్పిపొడవడానికి పనికొచ్చే వ్యక్తి కనబడతాడు. సమర్పణా బుద్ధితో సద్గోష్ఠిలో క్రమశిక్షణతో పాల్గొంటున్నప్పుడు మాత్రమే తోడివారిని మనకన్నా ఇతరంగా చూసే నరకం నుండి మనం బయటపడతాం. అందుకే మన పెద్దలు స్వాధ్యాయ ప్రవచనాల ఎడల ఏమరుపాటు చెందవద్దని హెచ్చరించారు" అని అనేటప్పటికి "మీరన్న మాటలు అక్షరాలా అనుభవంలో కనబడుతున్నాయి. కారణం తెలియక తికమకపడిపోతున్న నాకు కర్తవ్యం బోధించారు. కానీ నిర్వహణకే సరైన వ్యక్తి ఎవరా! అని ఆలోచిస్తున్నాను" అన్నాడతను.

"ఏం నీవు తగవా ?" అన్నారు కృష్ణస్వామి.

"నేనా!" అన్నాడతను సిగ్గుపడుతూ.

"పదాలు పలకడం కూడా చేతకానివాళ్ళు మైకుల్లో దేవుడి పేరిట స్తుతులకు బదులుగా సుత్తులు చెల్లిస్తున్న ఈ రోజుల్లో ఆ మాత్రం నోరుచేసుకోలేవుటయ్యా ! నోరు చేసుకోవడానికి జంకితే ఊరు మీది కాకుండా పోతుంది. చెప్పుకోవడానికి సంకోచించే నపుంసకత్వంనుండి మీరు బయటపడాలి. ధర్మబోధకు కావలసింది సత్ప్రవర్తనగాని, చెప్పడంలో హొయలుకాదు."

"మీరు చరచిన వెన్నుచరుపు నా వెరపును పోగొట్టింది. కర్తవ్యానికి సిద్ధమవుతున్నాను" అన్నాడతను చేతులు జోడిస్తూ.

**గురించి చెప్పడం చాలదు,**
**గురి ఉంచి నడవడం కావాలి.**

"ఒక మహాపురుషునిపేర మనం ఒక బృందంగా ఏర్పడడం, ఆయనను స్మరించుకోవడం, ఆయన అనుయాయులుగా మనను భావించుకోవడం మంచి విషయాలు. కానీ మనదేశంలో ఇలాంటి బృందాలు ఎక్కువభాగం సమావేశాలకే పరిమిత మవుతున్నాయి. వారానికో, పదిహేను రోజులకో ఒకచోట జేరడం, తాము నమ్మిన మహానుభావుణ్ణి గురించి నాలుగు మంచి ముక్కలు చెప్పుకోవడం, అనుభూతి చెందడం, తిరిగి ఇళ్ళకు చేరుకోవడం, ఎప్పుడైనా ఉత్సవాలు, పర్వదినాలు పెద్ద ఎత్తున జరుపుకుంటూ ఉండడం - ఈ మాత్రమే చాలదు.

"మనదేశంలో జరుగుతున్న చిత్రమేమిటంటే విప్లవాన్ని కోరేవారు అప్పుడప్పుడు తమ ఆవేశాలను వెళ్ళగక్కి ఊరుకొంటున్నారు. ఆస్తికుల మనుకునేవాళ్ళు వార్షికంగానో, అర్ధవార్షికంగానో ఒకచోట గుమిగూడి హడావిడిగా తొక్కిసలాడి తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నాం అనుకుంటున్నారు. రెండు సందర్భాల్లోనూ జాతి కర్మనిష్ఠను పొందలేకపోతున్నదని స్పష్టంగా తెలుస్తున్నది. ఏ పేరుతో పిలవబడితేనేం, జరుగుతున్నదిదే.

"ఒక మహానుభావుడికి మనమెందుకు నమస్కరిస్తున్నాం? ఆయన చేసిన త్యాగాలకు, చూపిన సత్ప్రవర్తనకు

ముచ్చటపడి నమస్కరిస్తున్నాం. ఆ గుణగణాలను గూర్చి వివరించుకొంటూ మురిసిపోతున్నాం. నేనేమంటున్నానంటే, వివరించడం చాలదూ, ఆ గుణగణాలను వరించడం, జీవితంలో అలా చరించడం కావాలీ అని. గురించి చెప్పడం చాలదు; గురి ఉంచి నడవగలగాలి. అలా జరగనప్పుడు మన జీవితాలకు సార్థకత లేదు.

"ఒక మహావ్యక్తికి నమస్కరిస్తున్నప్పుడు ఆ వ్యక్తిలా మనం జీవించగలిగితే మనకూ, ఆ మహాపురుషునికీ కూడా జనన మరణాతీతమైన లోకాలలో ప్రాణప్రతిష్ఠ జరుగుతుంది. అలా జీవించకుండా ఆ మహాపురుషుని పేర కాలక్షేపం మాత్రమే చేస్తున్నప్పుడు మిగిలిన లోకం మనతోపాటుగా ఆ మహాపురుషుణ్ణి కూడా గేలిచేయడానికి ప్రయత్నిస్తుంది. మనం ఉండవలసిన తీరులో ఉండలేకపోతున్నందుకు సమాజ రూపంలో ఉన్న సర్వాంతర్యామి పరిహాస పూర్వకంగా మనల్ని ఎత్తిపొడుస్తున్నాడని, మందలిస్తున్నాడని మనం గ్రహించాలి. కర్తవ్యనిష్ఠుడైన వాడు ఏ వాదానికి చెందిన వాడైనా, ఏ వర్గానికి చెందినవాడైనా అందరిచేతా గౌరవింప బడతాడు" అంటూ కర్తవ్యాన్ని బోధించారు ఒకఆధ్యాత్మిక సోదరబృందాన్ని ఉద్దేశించి ప్రసంగిస్తూ కృష్ణస్వామి.

## ధర్మసంస్థాపన అంటే ధర్మసంస్థల స్థాపనా?

ఒకసారి సామాజిక పరిస్థితులను సమీక్షిస్తూ, సహచరులతో చిరునవ్వుతో ఇలా అన్నారు కృష్ణస్వామి -

"భగవానుడు ధర్మసంస్థాపన జరగాలి అంటే మనవారు ధర్మసంస్థల స్థాపన జరగాలని తాపత్రయపడుతూ ఉంటారు. ఒకసంస్థను స్థాపిస్తే సమస్తాన్నీ ఉద్ధరించేస్తున్నా మన్నంత భ్రమను పొందుతూ ఉంటారు. జరగవలసింది సంస్థాపన గాని, సంస్థల స్థాపన మాత్రమే కాదు సుమా! ధర్మసంస్థాపన జరగవలసింది మానవుల హృదయాల్లో. అది, చెబుతున్నవారి పవిత్రత, ప్రవర్తనల వల్ల జరుగుతుందితప్ప, సంస్థలవల్ల జరగదు. సంస్థలు పని జరపడానికి ఉపకరణాలు మాత్రమే. పని చేతకానివాడికి ఉపకరణం ఉండీ ఏం లాభం? పరీక్షు వ్రాయలేకపోతున్నవాడి చేతిలో మంచి కలంలా అది వెలవెల బోదూ?

"ఇంకో ప్రమాదం కూడా ఉంది సుమా! 'లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు' అని మన పెద్దలంటే లోకంలోని మన సంస్థ సుఖంగా ఉంటే చాలు అని మనం అనుకుని సరి పెట్టుకోవడమో, ఉరిపెట్టుకోవడమో జరగవచ్చు. సరిపెట్టు కోవడం అంటే మనసంస్థ మనకు చాలునని మిగిలిన సంస్థలను ఉపేక్షించడం. ఉరి పెట్టుకోవడమంటే మన సంస్థకన్న గొప్పది మరి లేదు అని మిగిలిన సంస్థలను ఆక్షేపించడం. ఇంతకీ ఇదంతా కలిలక్షణం. మనందరం కలిసి ఉండకుండా చూడడమే ఆకలిలక్షణం."

## సాధించలేనివారు సాధిస్తారు

ఒకసారి కృష్ణస్వామి సహచరులకు హితవు చెబుతున్నారు- "తన ప్రవర్తనమీద దృష్టిలేని వాడు ఇతరుల ప్రవర్తనమీద దృష్టి పెడుతూ ఉంటాడు. అది బస్సు నడుపుతున్నవాడు తన డ్రైవింగ్ గురించి చూసుకోకుండా అటు ఇటు పోతున్న బస్సు డ్రైవర్ల డ్రైవింగ్‌ను పరిశీలిస్తూ ఉండడంలాంటిది. దీనికి ఫలితం ప్రమాదాలు జరగడమే. వివేకవంతుడైన డ్రైవరు తన డ్రైవింగ్‌పైన, తాను వెళుతున్న పథంపైన చక్కటి దృష్టితో నిష్ఠతో ఉంటాడు. వివేకవంతుడైన మనిషి ప్రవర్తన కూడా సరిగ్గా ఇలాగే ఉంటుంది. తన కర్తవ్యంపైన దృష్టి ఉంటుంది తప్ప, ఇతరుల కర్తవ్యనిర్వహణ గురించి అభిప్రాయాలు అతనివద్ద వినిపించవు.

తనకు ఏదంటూ ఒకటి ఏర్పాటు చేసుకోనివాడే 'వీడిలా వాడలా' అంటూ కాలాన్ని కాలుస్తూ ఉంటాడు. 'అది సరే, నీవు సాధిస్తున్నదేమిటి?' అని ప్రశ్నిస్తే, సమాధానం శూన్యం. అసలు చేయనివాడికన్న కాస్తో కూస్తో తప్పో ఒప్పో చేస్తున్నవాడు నయంకదా! అసలు చేసే స్వభావం అంటూ ఉంటే ఇవాళ కాకపోతే రేపైనా దారిన పడతాడు. ఇతరులను గూర్చి చర్చించే స్వభావం ఉన్నవాడు ఒకపట్టాన ఆ ఊబినుండి బయటపడడం కష్టం. ఈ లోకంలో

రెండు తరహాల వాళ్ళుంటారు. సాధించేవారు కొందరు, వారిని గూర్చి 'సాదించే'వారు కొందరు. సాధించలేనివాడు 'సాదిస్తూ' కూర్చుంటాడు" అన్నారు నవ్వుతూ.

## పనికిరానివాడు పనికి రానివాడే

ఒకసారి సోదరబృందంతో ఇష్టాగోష్ఠిలో ఉన్నారు కృష్ణస్వామి. జరుగుతున్న కార్యక్రమాల గురించి, వాటిల్లో పాల్గొంటున్న, పాల్గొనలేకపోతున్నవారి గురించి మాటలు సాగుతున్నాయి. ఉన్నట్టుండి కృష్ణస్వామి ఒకరివైపు తిరిగి, "ఇంతకూ ఈ లోకంలో పనికిరానివాడు ఎవరు?" అని ప్రశ్నించారు.

అందరూ ఆ ప్రశ్నకు చిత్రమైన ఆశ్చర్యంతో ఆయన వంక చూస్తున్నారు. ఆయనిలా అన్నారు- "పనికిరానివాడెవడో తెలుసా? పనికి రానివాడే."

అందరూ నవ్వేశారు.

"నిజానికంతే కదా! ఎన్ని తెలిసినా, ఎన్ని శక్తియుక్తులున్నా ఆ వ్యక్తి పదిమందికి పనికొచ్చే మంచిపనికి వాటిని వినియోగించలేనప్పుడు వ్యర్థమే కదా! అందుకే చెప్పాను- తెలివితేటలు, సిరిసంపదలు మొదలైనవాటి ఎక్కువ తక్కువలతో నిమిత్తం లేకుండా పనికి రాని ప్రతివాడూ పనికిరానివాడేనని." ఈ నిర్వచనం అందరికీ నచ్చింది.

## ఎంచేవాడు కాదిపుడు పెంచేవాడు కావాలి

సహచరులతో సంభాషణలో ఉన్నారు. కృష్ణస్వామి సంభాషణ అటుతిరిగి ఇటుతిరిగి ఒకరిద్దరు, అక్కడ లేని సోదరులను గూర్చి, అతనిలా చేశాడు, ఇతనలా చేశాడని ఏకరువు పెట్టసాగారు. అన్నీ సావధానంగా విని, కృష్ణస్వామి ఇలా అన్నారు.

"ఎంచడం తేలిక; పెంచడం కష్టం. ఎంచడానికి లోపాలు ఎవరిలో దొరకవు? ఎంచేవాడి దృష్టి మనిషిలోని చెడు మీద పడుతుంది. పెంచదలచినవాడి దృష్టి ఎదుటి మనిషిలోని మంచిమీద లగ్నమవుతుంది. ఎంచదలచినవాడు మనిషిలోని చెడును చెరిగిపోస్తాడు. పెంచదలచినవాడు మనిషిలోని మంచికి కుదురు చేసి, నీరుపోసి, తోటమాలిలా పెంచుకొంటాడు. ఎంచదలచినవాడు మనిషిలోని మంచిని విస్మరిస్తాడు. పెంచదలచినవాడు మనిషిలోని చెడును ఉపేక్షిస్తాడు. మనకిప్పుడు కావలసింది ఎంచేవాడు కాదు, పెంచేవాడు. ఎంచే ప్రయత్నంలో అవతలి మనిషి విరోధి అవుతాడు. పెంచే ప్రయత్నంలో అవతలి వ్యక్తి ఆత్మీయుడై, క్రమంగా అర్హతను పెంచుకొంటాడు. మీరందరూ నాకెందుకు ఆత్మీయులయ్యారు? ఆలోచించండి. మీతోడివారు మీకు ఆత్మీయులయ్యే అదృష్టానికి మీరూ నోచుకోండి."

కృష్ణస్వామి ఆర్ద్రంగా చేసిన ఈ వివరణ సహచరుల హృదయాలను ఆకట్టుకొని, వారి కన్నుల ధారలను కరిగించి వేసింది.

## తెలుగు కష్టం ఇంగ్లీషు 'కష్టమ్' (Custom) గా మారాలి

సమాచరుడొకడు "రోజూ ఆరుగంటలకి ప్రేయరుకి రావాలి అంటే కొంచెం కష్టమే అవుతోందండి. పనులు రోజూ ఒకేలా ఉండవు కదా!" అన్నాడు.

కృష్ణస్వామి నవ్వుతూ, "మీరు చెప్పిన తెలుగు కష్టం కొంచెం శ్రద్ధపెడితే ఇంగ్లీషు 'కష్టమ్' (Custom)గా మారిపోతుంది. ఇంగ్లీషులో కష్టమ్ అన్నమాటకు ఆచారమని కదా అర్థం! ఒక మంచిపని రోజూ ఒకే వేళకు చేయడం మొదటిలో కష్టం అనిపించినా, శ్రద్ధపెట్టి ఏదో ఒకలా రోజూ ఆ వేళకు ఆపనిని చేయసాగితే క్రమంగా అది ఆచారంగా రూపొందుతుంది. అప్పుడిక మానమన్నా ఆ పనిని మానలేరు మీరు" అంటూ చమత్కరించారు.

## శిలలు చాలా ఉన్నాయి – శిల్పులే కావాలి

పేమంటుగా పరిచయమైన ఒకాయన కృష్ణస్వామికి సన్నిహితులయ్యారు. ఆయనకి పదిమందికి సేవ చెయ్యాలనే తపన ఉంది. కానీ కంగారెక్కువ. తోడివాళ్ళు ఆయనకి హడావిడి ఎక్కువ అని ఆక్షేపిస్తూ ఉండేవారు. 'మాస్టర్ ఆఫ్ కన్ఫ్యూజన్' అనే బిరుదు కూడా ఇచ్చేశారు. కృష్ణస్వామి ఆయనని చేరదీసి, ఆ కంగారుకు హోమియోమందు వేసి, మెల్లగా లైన్లో పెట్టడం ప్రారంభించారు. అతను మందుల్లు

కట్టడం దగ్గర్నుంచి, వైద్యాలయ నిర్వహణం వరకూ చాల తక్కువకాలంలో చేయితిరిగిన వాడయ్యాడు. మొదటి దశలో ఆయన్ని చూసిన సహచరడొకరు "చిత్రంగానూ, ఆశ్చర్యంగానూ ఉంది. ఎంతలో ఎంతమార్పు!" అని ఆనం దాన్ని ప్రకటించగా కృష్ణస్వామి ఇలా అన్నారు-

"శిలలు చాలా ఉన్నాయి, శిల్పులే కావాలిపుడు. మంచిపని చేద్దామని, పదిమందికి పనికిరావాలని అభిలషించే వారి సంఖ్య బాగా పెరుగుతోంది. వారిని తీర్చిదిద్దగల సమర్థులే ఎక్కువ సంఖ్యలో మనకిప్పుడు కావాలి. వ్యక్తులు తీర్చిదిద్దబడాలి అంటే దిద్దదలచినవాడు మొదట ప్రేమ స్వరూపుడై ఉండాలి. ప్రేమ లేనిదే సహనం అబ్బదు. సహనం అబ్బనిదే సామర్థ్యం రాణించదు. అందులోనూ రూపురేఖలు దిద్దవలసింది జీవశిల్పాలకు కదా! కదులుతున్న తెరమీద బొమ్మ గీయగలవాళ్ళిప్పుడు కావాలి."

# ఆత్మవిద్య - అసలురూపం

## మూలాధారం - మూలే ఆధారం

అవనిగడ్డ గాలిగోపురం గుళ్ళో కృష్ణస్వామి భాగవత ప్రవచనం సాగుతోంది. భీష్మస్తుతి ఘట్టం అనుభూతి ప్రదంగా, అంతరార్థసహితంగా నడుస్తోంది. నిర్యాణానికిముందు భీష్ముడు చేసిన ఆ స్తుతిలోని యోగవిద్యారహస్యాలను అలవోకగా, ఆనందదాయకంగా వివరిస్తూ, "యోగవిద్యను ఇలా భాగవతమార్గంలో, వ్యాసుని అడుగుజాడల్లో వివరించుకొంటేనే అర్థమవుతుంది; జీవితం అర్థవంతమూ అవుతుంది. ఇలా కాక మూలాధారం, స్వాధిష్ఠానం అంటూ పొడిపొడిగా మొదలుపెడితే, జనానికి అందనూ అందదు; జనం మనకి అందనూ అందరు. మూలాధారం అని మొదలు పెట్టిన మనకు గుడిలో ఒకమూలే ఆధారం అవుతుంది" అంటూ చెణుకు విసిరారు కృష్ణస్వామి.

ప్రసంగం మంచి పాకాన ఉందేమో, చెణుకులోని సత్యం ఇట్టే బోధపడింది శ్రోతలకి.

# 6. ఆత్మవిద్య – అసలురూపం

- మూలాధారం మూలే ఆధారం.
- చేయవలసింది నిందించడం కాదు, అందించడం
- అడిగేసేవారు కాదు, అడుగు వేసేవారు కావాలి.
- వదిలించుకోవడం కాదు, వదులుగా ఉంచుకోవడం
- వదలవలసింది బంధువులను కాదు, బంధాలను
- పట్టించుకోకపోవడం కాదు, పట్టించుకోకపోవడం.
- బిడ్డలు లాగిపట్టే బెడ్డలు
- తెలుగుసంసారం హిందీ సంసారం కావాలి
- అశాశ్వతంకాదు 'అ' శాశ్వతమే
- కలిసిబ్రతకండి, ఒకటిగా తెలిసిబ్రతకండి
- ఆత్మదర్శనం 'ఐక్యత'కోసమే
- పరమహంస - పరిమహింస
- సామగ్రి అదే - సంస్కారమే వేరు
- నాదాన్ని వినకపోతే నినాదాన్ని వినవలసి వస్తుంది.

## చేయవలసింది నిందించడం కాదు అందించడం

"ఈ రోజుల్లో వేదా లెవడి క్కావాలి? ఉపనిషత్తులు, పురాణాలు చదివేవాడెవడు ? సంస్కృతం ఎంతమంది నేర్చుకుంటున్నారు ? బంగారంలాంటి మన సంస్కృతినిగూర్చి పట్టించుకొంటున్నవాడెవడు ? ఈ దేశం ఎటువైపు వెళుతోంది ? ఏమైపోతుంది ?" అంటూ సభల్లో కొందరు పెద్దలు బాధతో నిందిస్తూ, నిందిస్తూ బాధ పెడుతూంటారు. అది సరే గాని, వేదాల్లో ఉన్నదేమిటో ఉపనిషత్తు లేమి చెబుతున్నాయో, పురాణాలతరవా ఏమిటో ఈ ప్రజలకు అర్థమయ్యేటట్టు చెప్పవలసిన బాధ్యత ఆ పెద్దలకు లేదా ? అర్థమయ్యేటట్టుగా చెబితే కొంతమంది వింటారు. నిత్య జీవితానికి సమన్వయించి, జీవితాలను వెలిగించుకోగలిగేటట్టు చెప్పగలిగితే ఎంతోమంది వింటారు. కాబట్టి నిందించడం కాదు చేయవలసింది, తగినరీతిలో అందించడం.

"తగిన రీతిలో అందించాలి అంటే శిక్షణ, తపస్సు చాలా అవసరం. సామాన్యంగా మనం మనకు అర్థమయ్యింది చెబుతాం గాని, వినేవాళ్ళకు అర్థమయ్యేలా చెప్పలేం. మనకి తెలిసింది ఏకరువు పెడుతూంటాంగాని, వినేవారికి కావలసింది ఏమిటో, ఎంతవరకో గ్రహించుకోలేం. పెట్టెలను వదలిపెట్టి వెళ్ళిపోతున్న ఇంజనులా వినేవాళ్ళను పట్టించుకోకుండా ఒకపట్టు పట్టేసేవాళ్ళమే ఎక్కువవుతుంటిమి. ఇంకొంత మందికి మైకు దగ్గరకాగానే మైకం కమ్మేస్తుంది. ఆ మైకంతో

వాళ్ళు దేన్లోంచి దేన్లోకి వెళ్ళిపోతారో, ఎక్కడ మునిగి ఎక్కడ తేలతారో దేవుడికే తెలియాలి. ఇలాంటి పొరపాట్ల వల్లనే జనసామాన్యం పవిత్ర వాఙ్మయానికి దూరం అవుతున్నారు. వాళ్ళు అవుతున్నారా? మనం చేస్తున్నామా? ఆత్మపరిశీలన చేసుకోవలసి ఉంది. అర్థమయ్యేటట్టుగా, నిత్యజీవితంలో అక్కరకు వచ్చేటట్టుగా చెప్పగలిగితే ప్రజలు తండోపతండాలుగా జేరి శ్రద్ధగా వింటారన్నది, వినియోగించుకొంటారన్నది అనుభవంలోని సత్యం" అంటూ పెద్దలు నలుగురూ జేరిన ఒక సభలో చివరివక్తగా నోరు చేసుకొన్నారు కృష్ణస్వామి.

## అడిగేసేవారు కాదు, అడుగువేసేవారు కావాలి

ఒక గ్రామంలో సేవాకార్యక్రమ నిర్వహణలో ఉన్నారు కృష్ణస్వామి. మధ్యలో ఆయన కొంచెంసేపు విరామానికని ఇవతలికి వచ్చారు. ఇదేసందని ఒక ముగ్గురు వ్యక్తులు కృష్ణస్వామి దగ్గరకు చేరారు. ఆధ్యాత్మిక సాధనకు సంబంధించిన కొన్ని పడికట్టురాళ్ళ వంటి ప్రశ్నలు వేస్తూ 'వీటికి మీరేం చెబుతారు?' అన్నట్టు చూడసాగారు.

"ఈ ఊరు వస్తున్న పెద్దలందర్నీ ఇవే ప్రశ్నలు వేస్తూ వస్తున్నారుకదా, ఎవరినుండీ మీకాకవలసిన జవాబులు లభించలేదా?" అన్నారు కృష్ణస్వామి.

ఆ వ్యక్తులు కొంచెంగా అదిరిపడ్డారు. అందులో ఒకతను 'ఎవరేం చెబుతారో తెలుసుకోవాలికదండీ. తెలుసుకోవడం తప్పంటారా?' అన్నాడు.

"తెలుసుకోవడం తప్పు కాదు గాని, తెలుసుకొన్నట్టు నడుచుకోకపోవడం తప్పు. ఊరికే తెలుసుకొంటూ కూర్చోవడం వల్ల ఉపయోగమేముంది ?"

"మీరు చెప్పింది నిజమేననుకోండి. ఈ విధమైన జిజ్ఞాస ఉండడం తప్పంటారా ?" అన్నాడు మరొకతను.

"మీ జిజ్ఞాస ఎంతటిదో నాకు తెలుసు. వచ్చినవారి పరిజ్ఞానాన్ని పరీక్షించడానికి మీరు అడుగుతున్నారు తప్ప, నేర్చుకోవడంకోసం కాదని కూడా నాకు తెలుసు. నాకిప్పుడు కావలసింది అడిగేసేవారు కాదు; నాతో పాటుగా అడుగు వేసేవారు. లోకశ్రేయస్సుకై ధర్మమార్గాన నడవడానికి ఇష్టపడిన వారికి మాత్రమే 'నా' నుండి సమాధానం పొందడానికి పిలవుతుంది. ఇది అహంకారం కాదు. నన్ను నడుపుతున్న వెలుగును గూర్చిన పవిత్రమైన భావం మాత్రమే. అందుకోడానికి సిద్ధపడినవాళ్ళను మాత్రమే ఏ కాలంలోనైనా ఆ వెలుగున్ప్రశిస్తుంది. సిద్ధపడకుండా తెలుసుకోగోరిన వారికీ, పరీక్షించడానికి పూనుకొన్న వారికీ దానిని గూర్చిన అభిప్రాయాలే దక్కుడు. సెలవు" అంటూ సేవలోనికి మళ్ళీ చొరబడ్డారు కృష్ణస్వామి.

ఆ వ్యక్తులు అటూ ఇటూ చూసి వచ్చిన త్రోవ పట్టారు.

## వదిలించుకోవడం కాదు, వదులుగా ఉంచుకోవడం

ఒకసారి పర్యటనలోనున్న కృష్ణస్వామిగారిని కలిసిన వారి బంధువొకరు తమ కుటుంబ విషయాలను ఆయనకు ఏకరువు పెడుతూ "ఈ పిల్లలందరికీ ఎవరిదారి వారికి చూపించి, ఎంత తొందరగా వదిలించుకుంటే అంత మంచిదని చూస్తున్నానయ్యా" అన్నారు విసుగ్గా.

కృష్ణస్వామి నవ్వుతూ, "చేయవలసింది, వదిలించుకోవడం కాదు, వదులుగా ఉంచుకోవడం. అది కూడా మనం వాళ్ళని వదిలిపెట్టడానికి కాదు. ఏకారణంచేతనైనా వాళ్ళు మనల్ని వదిలిపెడితే దుఃఖించకుండా ఉండడానికి."

ఆ బంధువు ఆశ్చర్యంగా చూస్తూనే ఆలోచనలో పడ్డాడు.

## వదలవలసింది బంధువులను కాదు- బంధాలను

ఒకసారి ఒక నడివయస్కుడు "ఈ ఇంట్లో గొడవలతో వడలేకపోతున్నాను. వీళ్ళందర్నీ వదిలి ఏ భద్రాచలమో వెళ్ళిపోదామనుకుంటున్నాను. అక్కడ పడిఉంటే ఏదో వేళ్ళకి ఆ మాత్రం ముద్ద దొరక్కపోతుందా ?" అంటూ వైరాగ్యాన్ని అభినయించాడు.

కృష్ణస్వామి ఇట్లా అన్నారు :

"వెళ్ళక వెళ్ళక భద్రాచలమే వెళతావూ ? వెళ్ళి రాముడికి దణ్ణాం పెడితే, రాముడేమని అడుగుతాడో తెలుసా

'నీ వొకడివే వచ్చావేం ? కుటుంబమేది ? నేను చూడు-అరణ్యవాసానికి కూడా భార్యతోనూ, తమ్ముడితోనూ కలిసి బయలుదేరాను. ఇప్పుడు నీవు దణ్ణం పెడుతున్నచోట కూడా మేం కలిసే ఉన్నాం. కలిసి ఉండడం ఎలాగో నేర్చుకోవడానికే మీరు మాదగ్గరకు రావలసింది' అంటాడు."

అతను కొంచెం సిగ్గుతో తలవంచుకొన్నాడు.

కొంచెం ఆగి, కృష్ణస్వామి, మళ్ళీ ఇలా అన్నారు - "వదలవలసింది బంధువులను కాదయ్యా, బంధాలను. బంధాలు బయట ఉండవు. మన మనస్సులో ఉంటాయి. మనతో ఉంటున్నవారిపైన అభిప్రాయాల రూపంలో ఏర్పడి, మనని బిగిస్తూ ఉంటాయి. సన్న్యసించవలసింది వాటిని. చేతనవుతుందేమో చూడు. అది చేతనయితే ఎక్కడున్నా ఒకలాగే ఉంటుంది.

## పట్టించుకోకపోవడం కాదు,
## పట్టి ఉంచుకోకపోవడం

"ఏది ఎలా జరిగితే అలా జరుగుతుంది. ఎవడెలాపోతే అలా పోతాడు. ఎవళ్ళ విధికి ఎవళ్ళు కర్తలు? అని అనిపించి ఈమధ్య జరుగుతున్నవాటిని పట్టించుకోవడం మానేస్తున్నాను" అన్నారొకరు, కృష్ణస్వామితో విరక్తిగా ముఖంపెట్టి.

కృష్ణస్వామి ఇలా అన్నారు - "చేయవలసింది పట్టించుకోకపోవడం కాదు; పట్టి ఉంచుకోకపోవడం. పట్టించుకోవలసింది పట్టించుకోకపోవడం కర్మ భ్రష్టత అవుతుందతప్ప వైరాగ్యం కాదు. పట్టించుకోవలసినవి తప్ప కుండా పట్టించుకోవాలి. ఆయా కర్తవ్యకర్మలను శ్రద్ధతో నిర్వహించాలి. నిర్వహించిన తర్వాత, జరిగిన సన్నివేశాలను గూర్చిన అభిప్రాయాలను మాత్రం మనస్సులో పట్టి ఉంచు కూడదు. పట్టి ఉంచుకుంటే మనస్సు ఒత్తిడి ననుభవిస్తుంది. దీనినే బంధం అంటారు.

"నిరంతర కర్మాచరణలో ఉండేవాడికి పట్టి ఉంచుకునే ఖాళీ ఉండదు. పనికీ పనికీ సందున్నప్పుడు మాత్రమే అభిప్రాయాలనే బుడగలు పుట్టుకొస్తాయి. సందివ్వని కార్యకర్మ నిర్వహణలో నిమగ్నం కాగలిగినపుడు మాత్రమే మానవ జీవితానికి సహజమైన హాయి, నిండైన తృప్తి దొరుకుతాయి. ఈ దివ్యస్థితినే మోక్షస్థితి అంటారు. కనుక వైరాగ్యం పేరిట సోమరితనాన్ని వరించకుండా కర్తవ్యాన్ని శ్రద్ధతో నిర్వహించండి."

## బిడ్డలు లాగి పట్టే బెడ్డలు

ఆ మధ్యనే తమకు కలిగిన మగబిడ్డను తీసుకుని కృష్ణ స్వామిని చూడవచ్చారు ఒక దంపతులు. యోగక్షేమాలయిన తరువాత ఇష్టాగోష్ఠి నడుస్తోంది.

"ఈమధ్య బయటికి వెళ్ళే అవకాశమే అంతగా కలగడంలేదండి. ఇద్దరం కలిసి బయటికి వెళ్ళడం అంటే

గగనమయిపోతోంది. బాబు పుట్టిన తర్వాత ఇదివరకటి రొటీనంతా మారిపోయిందంటే నమ్మండి. ఎక్కడికైనా వెళ్ళాలంటే వీడితోసహా వెళ్ళాలి కదా! ఆమాత్రం ఈమాత్రం వాతావరణం, నీళ్ళుమారితే వీడి ఆరోగ్యంలో ఏం తేడా వస్తుందోనని భయం" అందావిడ.

ఆమె మాటలకు ఆయన వంతపలుకుతున్నాడు.

కృష్ణస్వామి నవ్వుతూ ఇలా అన్నారు -

"బావుంది మీ కథ. పొట్ల పిందెల చివర రాతిబెడ్డలు కడుతూ ఉంటారు, ఎందుకో తెలుసా? వంకర్లు తిరిగి చిన్నవై పోకుండా, సాగి పెద్దవి కావాలని. ఈ బిడ్డలు మనల్ని అలా లాగి పట్టే బెడ్డలు సుమా!

"మీరే ఉన్నారనుకోండి! ఈ బిడ్డకలగకముందు మీ విహారాలకి ఎవరైనా అడ్డు చెపితేమాత్రం ఆగేవారా? ఆరోగ్యానికి మంచిది కాదని హెచ్చరించినా మానేవారా? ఆ ఉత్సాహం అలాంటిది. ఇపుడు బిడ్డ కలిగాక ఇదివరకటిలా తిరగండి అన్నా తిరగ్గలరా? చూశారా, బిడ్డవల్ల మీ జీవితాలకు స్పీడు తగ్గి క్రమశిక్షణ వస్తోంది! భగవంతుడు సందేశాల ద్వారా కాక, సన్నివేశాలద్వారానే మనకెక్కువ నేర్పుతూ ఉంటాడు సుమా!"

ఆ దంపతులు మీరు చెప్పింది నిజం అంటూ నవ్వుతూ సిగ్గుపడ్డారు.

## తెలుగు సంసారం హిందీ సంసారం కావాలి

ఒకరోజు రాత్రి సన్నిహితులొకరు కృష్ణస్వామిని జేరి కష్టసుఖాలు చెప్పుకుంటూ "ఏమిటోనండీ, ఎంతసేపూ ఈ సంసారం ఈ గొడవలతోనే సరిపోతోంది. దైవచింతనకి పట్టుమని పదినిమిషాలుకూడా సందుదొరకడంలేదు" అంటూ నిట్టూర్చారు.

కృష్ణస్వామి చిరునవ్వుతో ఇలా అన్నారు -

"ఇంతకూ ఈ సంసారాన్ని విడిచిపెట్టేస్తే దైవచింతన తీరిగ్గా చేసుకోవచ్చునా మీ ఉద్దేశం? జరగవలసింది అది కాదు. మీ తెలుగు సంసారం క్రమంగా హిందీ సంసారం కావాలి. దైవచింతనకు పరమావధి అదే."

వింటున్న వ్యక్తి ఆశ్చర్యంగా చూశాడు.

కృష్ణస్వామి ఇలా వివరించారు :

"హిందీలో 'సంసార్' అంటే ఏమిటి? ప్రపంచమని అర్థం. ప్రపంచమే మన కుటుంబమన్న విశాల భావాన్ని అనుభవంలో పొందడమే ఆధ్యాత్మిక చింతనకు పరమావధి. మనం పెద్దవాళ్ళని చెప్పుకుంటున్నవాళ్ళూ, దేవుళ్ళుగా పూజించుకుంటున్నవాళ్ళూ అందరూ ప్రపంచాన్ని తమ కుటుంబంగా దర్శించి, దానికోరకు బాధ్యతతో పనిచేసిన వారే. అందుకే వాళ్ళకు మనం నమస్కరించడం. మనం

నమస్కరించినప్పుడల్లా మనకూడా వాళ్ళలాగ మనస్కరించాలని ఆ పెద్దలు ఆశీర్వదిస్తూ ఉంటారు. ఆలుబిడ్డలే కుటుంబమనే సంకుచితదృష్టి నుండి జీవులందరూ తమ కుటుంబ సభ్యులనే విశాలదృష్టిని అలవరచుకొనేటందుకే మనం యోగసాధన చేయవలసింది.

"నాకు ఒకందుకు నవ్వు వస్తూ ఉంటుంది. ఆలుబిడ్డలకు మాత్రమే తనను పరిమితం చేసుకొన్న మనిషి వారితోటి సహజీవనంలోనే ఒడుదుడుకులు వస్తున్నాయని సోలిపోతున్నాడు కదా, శోకిస్తున్నాడు కదా! మరి, ప్రపంచమంతా తమకుటుంబమని బాధ్యతపడి పనిచేస్తున్న ఆ పెద్దవాళ్ళేమనుకోవాలి?

"అసలు మనం అనుకుంటున్న ఈ చిన్న కుటుంబం మనచుట్టూ ఎందుకుంటుందో తెలుసా? మనం అందుకోవలసిన పెద్దకుటుంబ బాధ్యతకు తగిన శిక్షణ నిచ్చేటందుకే. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, ఆలుబిడ్డలు మొదలైనవారితో సహచరిస్తూ చక్కని శిక్షణ పొందినవారే ప్రపంచమనే పెద్ద ఇంటిలో బాధ్యతగల సభ్యులుగా ప్రవర్తించగలుగుతారు. ఈ సత్యాన్నే శ్రీరాముడు తన జీవిత సన్నివేశాలద్వారా మనకు ఉపదేశిస్తున్నాడు. రామాయణాన్ని ఒకసారి ఈ దృష్టితో చదివి చూడండి."

కృష్ణస్వామిగారి వివరణ విని ఆవ్యక్తి క్రొత్తలోకం లోనికి ప్రవేశిస్తున్నటుగా కనిపించాడు.

## అశాశ్వతం కాదు 'ఆ' శాశ్వతమే !

"ఏమున్నది? ఈ కనబడుతున్నదంతా అశాశ్వతమే గదా ! మనకు ఆ శాశ్వతమైన వస్తువే ముఖ్యం" అన్నారొక పెద్దవారు కృష్ణస్వామితో.

కృష్ణస్వామి వినయగంభీరంగా ఇలా అన్నారు -

"అశాశ్వతమేమీ లేదు. అశాశ్వతంగా కనిపిస్తున్నది, అనిపిస్తున్నది కూడా ఆ శాశ్వతమే. సృష్టిగా వ్యక్తమైనది కూడా పరమాత్మే అయినపుడు వ్యక్తస్థితిని అశాశ్వతమని ఎలా అనగలం ?

"సముద్రం అలగా వ్యక్తమవుతున్నది. సముద్రమూ అలా కూడా వేరుగా కనబడుతున్నాయి. అల పైకివచ్చి, ఒడ్డుకు తగిలి, తిరిగివెళ్ళి కలిసిపోయేదిగాను, సముద్రం శాశ్వతమైనదిగాను మనకు అనిపిస్తూ ఉంటుంది. నిజానికి అల సముద్రం కన్న వేరుగా ఉంటుందా ? సముద్రంయొక్క రూపాంతరమేగదా అల ! అలగా ఉన్నది కూడా సముద్రమే. మనం అనుకొంటున్న సముద్రం, మనం చూస్తున్న అల కలిసి అసలు సముద్రం. ఈ సత్యాన్ని గమనించినవాడికి అల అశాశ్వతం కాదని తెలుస్తుంది. అల వచ్చిపోయేది కాదు, సముద్రమే అలగా వస్తూ పోతూ ఉంటుంది అన్న దర్శనం లభిస్తుంది.

"అలాగే, పరమాత్మే సృష్టిగా వ్యక్తమవుతూ, ఉపసంహరించుకొంటూ ఉన్నాడు.కనబడుతూ తనలోనికి కరిగి పోతూ ఉన్నాడు. కనుక ఉన్నదీ, కనబడుతున్నదీ ఆ శాశ్వతమే తప్ప అశాశ్వతమనేది ఏమీ లేదు." ఇలా కృష్ణస్వామి తత్త్వజ్ఞానపు లోతులకు వెళ్ళి చేసిన వివరణ విని, "మీరు వివరించిన అంశం ధ్యానం చేయవలసిందే సుమా!"అన్నారా పెద్దాయన.

## కలిసి బ్రతకండి, ఒకటిగా తెలిసి బ్రతకండి

"'కలిసి ఉంటే కలదు సుఖం' అన్న సామెత మనం వింటూ ఉంటాం. అంటూ ఉంటాం. అయితే కలిసి ఉంటున్న చోట్లల్లో ఎక్కడో తప్ప సుఖం కనబడటంలేదు. చాలాచోట్ల అభిప్రాయ భేదాలో, సాధించుకోవడాలో, ఒకరి నొకరు ఎంచుకోవడాలో, ఎక్కువతక్కువలు ఊహించుకోవడాలో కనబడుతుంటాయి. మరి, కలిసి ఉంటే కలదు సుఖ మన్న మాట ఏమైంది ? ఆ మాట ఒట్టిదేనా ? కాదుగాని, కలిసి ఉంటేనే చాలదు. తామంతా ఒకే వెలుగు యొక్క వ్యక్తరూపాలని తెలిసి ఉన్నప్పుడు మాత్రమే సుఖం లభిస్తుంది. తోడి వ్యక్తిలో వ్యక్తిని కాక, వెలుగును దర్శించగల నైపుణ్య మబ్బాలి.అప్పుడు మాత్రమే సహవాసం చిరకాలం నిలుస్తుంది" అంటూ లలితంగా వివరించారు కృష్ణస్వామి, సహజీవనానికి రాచబాట చూపుతూ ఒక ప్రసంగంలో.

(10)

## ఆత్మదర్శనం 'ఐక్యత' కోసమే

"అన్నదమ్ములైనవారు మంచీచెడూ వెనకాముందూ చూసుకోకుండా కీచులాడుకొంటుంటే తెలిసిన పెద్దవాళ్ళు ఏమంటారు ? 'అన్నదమ్ములు మీరు. ఒకతల్లికి, తండ్రికి పుట్టినవాడు, ఒకళ్ళ తప్పును మరొకళ్ళు సద్దుకోవడమో, దిద్దుకోవడమో చేసుకోవలసినవాళ్ళు - ఇలా కీచులాడుకొంటూ బజార్న పడటం, జీవితాల్ని దుఃఖమయం చేసుకోవటం పద్ధతేనా? మీలో ఎవరు నష్టపోయినా మీ తల్లిదండ్రులకు ఒకే బాధసుమా' అంటూ పుట్టుకను గుర్తుచేస్తారు. ఎందుకలా చేస్తున్నారు ? కనీసం తమ పుట్టుకచోటు ఒకటని తెలియజెప్పినప్పుడన్నా వాళ్ళు కనులు తెరచి, ఆస్తిపాస్తులకు బదులుగా ఆత్మీయతకు చోటియ్యగలరేమో చూద్దామని. అలా ఇచ్చేలా చేద్దామని. అలాగే మానవులు తెగలుగా, వర్గాలుగా, మతాలుగా, పార్టీలుగా, స్త్రీ పురుషులుగా తమను తాము వేరుగా చూసుకొంటూ చెడిపోతున్నప్పుడు ఈ సృష్టి మొత్తం ఒకే వెలుగునుండి వ్యక్తమయిందనీ, మన మందరం ఆ వెలుగుయొక్క రవ్వలమేననీ తెలియజెప్పడం ఎంత అవసరం! ఎన్ని రకాలుగా నచ్చచెప్పినా ఈ దివ్యదర్శనం కలిగినప్పుడు మాత్రమే మనుషుల మధ్య నిజమైన 'ఐక్యత' సిద్ధించి స్థిరపడుతుంది. ఈ 'ఐక్యత'ను అనుభవించి, అనుభవింపజేయడానికే సుమా, మన వాళ్ళు ఆత్మదర్శనాన్ని పొందుతూ, అనుగ్రహిస్తూ వచ్చింది!" అంటూ ఆత్మదర్శనంయొక్క ఆవశ్యకమును' ప్రయోజనాన్ని ముద్రంగా వివరించారు ఒకప్రసంగంలో.

## పరమహంస – పరమహింస

"ఆత్మదర్శనానికి పరమావధి అయిన 'ఐక్యత'ను అనుభవించలేనప్పుడు అనుభవించడానికి సిద్ధంగా లేనప్పుడు పవిత్ర గ్రంథాలెన్ని చదివినా ఉపన్యాసాలూ, విన్యాసాలూ ఎన్ని చేసినా ఒరిగేదేమీ ఉండదు. ఆత్మదర్శనం అనుభవించి అనుభవింపజేస్తున్నవాడు ఋషి అవుతున్నాడు. దానిని అనుభవించకుండా దానినిగూర్చి సాగదీస్తున్నవాడు 'పండితుడు' అవుతున్నాడు. ఇద్దరూ వుచ్చుకొనేది ఒకే గ్రంథాలయినా స్థితిభేదాన్నిబట్టి ఒకరు ఋషిగా మరొకరు 'పండితుడు'గా ఉంటున్నారు.

"ఆత్మదర్శనంద్వారా 'ఐక్యత'ను అనుభవిస్తూ అభిలషించారు గనుకనే, రామకృష్ణాదులు పరమహంసలయ్యారు. ఆత్మదర్శనం కొరకు ఉద్దేశింపబడని ఆచారకాండ నుండి వ్యక్తమయ్యేది పరమహంస కాదు, పరమహింస. దేవుడి పేరు చెప్పేవాళ్ళల్లో పరమహంసల్లా ఉండేవాళ్ళూ ఉన్నారు; పరమహింసగా జీవితాన్ని వ్యక్తం చేస్తూ, లోకాన్ని ఇబ్బందిపెడుతున్నవారూ ఉన్నారు" అంటూ గమ్యాన్ని మరచిన ఆస్తిక్యం ఎలా దెబ్బతింటుందో వివరించారు కృష్ణస్వామి ఒకసారి.

## సామగ్రి అదే, సంస్కారమే వేరు

"వివేకవంతుడు రాళ్ళతో ఏం చేస్తాడు ? తనకు నచ్చే విధంగా గృహనిర్మాణం చేసుకుంటాడు. అ

విద్వేషాన్ని పొందినవాడు! ఆ రాళ్ళనే గిట్టనివాళ్ళపై విసిరి కొట్టడానికి వినియోగిస్తాడు. రాళ్ళల్లో తేడా ఏముంది? కాని, వ్యక్తుల సంస్కారాన్నిబట్టి వినియోగం మారుతోంది. పవిత్రగ్రంథాలు కూడా ఈ రాళ్ళలాంటివే. వివేకవంతుడు ఈ గ్రంథాల ద్వారా ఆత్మదర్శనాన్ని పొంది, 'ఐక్యత'ను అనుభవిస్తూ జాతిశ్రేయస్సుకై పనిచేస్తున్నాడు. రాగద్వేషాలు కలవాడు, ఈ గ్రంథాలను పట్టుకొనే, మతభేదాలు సిద్ధాంతభేదాలు గమనించుకొంటూ, కల్పించుకొంటూ, తాను క్షోభిస్తూ, ఇతరులను క్షోభింపజేస్తున్నాడు.

"వివేకవంతుడు వేదాలతో జీవిస్తే, రాగద్వేషాలు కలవాడు వాదాలతో జీవిస్తున్నాడు. వాడికి వేదాల్లో కూడా వాదాలే కనిపిస్తాయి. చూశారా, సంస్కారం ఎంత పని చేస్తోందో! రాగద్వేషాల కతీతులైన మహాత్ముల సన్నిధిలో ఈ కుసంస్కారాలనుండి క్షాళన పొందితే తప్ప, మానవుడికి ఆత్మదర్శనం లభించదు; 'ఐక్యత' సిద్ధించదు. ఈ క్షాళనాన్ని అనుగ్రహించడం కోసమే కాలకాలాల్లో సిద్ధపురుషులు దేహధారులై వర్తిస్తూ ఉంటారు. వాళ్ళు ఋణశేషం వల్ల పుట్టినవాళ్ళుకాదు. ఋణాల కతీతంగా జీవించే మార్గాన్ని మనకి అందించేటందుకు పుట్టినవాళ్ళు. అలాంటి వాళ్ళు పుట్టవలసిన కాలం వర్తించి, దేహాన్ని విడిచినప్పుడు వాళ్ళు మనని ఉద్ధరించడానికి వ్యక్తమై, వర్తించి వెళ్ళారని తెలియక వారికేదో పూర్తికావలసిన కర్మశేషం ఉండి

ఉంటుందని కొందరూ, క్రిందటి జన్మలో పైవరకూ వచ్చి యోగభ్రష్టత చెంది ఇలా పుట్టి ఉంటారని కొందరూ, భూమిమీద మిగిలిన కొద్దిఋణాన్ని తీర్చుకుపోయారని కొందరూ భావిస్తూ వారి కర్మలకు లెక్కలుగట్టి బేరీజు వేస్తుంటారు. వాళ్ళు తమను కర్మబంధాలనుండి సడలించడానికి వచ్చినవాళ్ళని మర్చిపోతుంటారు. మనలెక్కలు తుడిచేయడానికి వాళ్ళొస్తే, మనవాళ్ళు వాళ్ళకి లేనిపోని లెక్కలు కట్టేస్తుంటారు. ఇదొక చిత్రం" అన్నారు కృష్ణస్వామి మానవ స్వభావాన్ని, అతని సంస్కార ప్రభావాన్ని వివరిస్తూ ఒక ప్రసంగంలో.

## నాదాన్ని వినకపోతే నినాదాన్ని వినవలసివస్తుంది

"ఏమిటోనండీ, ఎక్కడ చూసినా ఉద్యమాలు, ఊరేగింపులు, నినాదాలు, సమ్మెలు, లాఠీఛార్జీలూను. అంతా గందరగోళంగా ఉంటోంది" అన్నారొకరు కృష్ణస్వామితో.

కృష్ణస్వామి, "ఏం చేద్దాం మరి, నాదాన్ని వినకపోతే నినాదాన్ని వినవలసీ వస్తుంది" అన్నారు.

ఆ వ్యక్తి దాని అర్థం ఏమిటా అన్నట్టు చూశాడు.

కృష్ణస్వామి ఇలా వివరించారు :

"అందరిలోనూ, అందరిగానూ, ఉన్నదీ, ఉంటున్నదీ ఒకే వెలుగని తెలిసి, ఆ వెలుగుగా నిలబడగలిగినప్పుడు

సమప్రవర్తన, సత్ప్రవర్తన అలవడతాయి గనుక, సంఘర్షణాలు, సమస్యలు, ఉత్పన్నంకావు. అలా నిలబడలేనప్పుడు భిన్నత్వం గోచరిస్తుంది కనుక, ఆచరణలో అపచారాలు, తత్ఫలితంగా కలవరాలు, కష్టాలు తప్పవు.

"శ్వాసను గమనించి, ఆ శ్వాసగా వ్యక్తమవుతున్న తనను ప్రణవనాదంగా వినగలిగినవాడికి ఆ వెలుగుగా జీవించడం చేతనవుతుంది. సమస్త జీవరాసులుగా వ్యక్తమవుతున్నదీ, సృష్టిగా రూపుకట్టుకొంటున్నదీ ఆ నాదమేనని తెలుస్తుంది. ఈ సృష్టి ఆ నాదవినోదం. ఆ నాదవిలాసం. ఈ సత్యాన్ని ఎరిగినవాడు సర్వత్ర తననే చూసుకొంటాడు. కనుక సమప్రవర్తన, సత్ప్రవర్తన అతనినుండి అప్రయత్నంగా వ్యక్తమవుతాయి. సర్వసమత్వాన్ని అనుభవించడమే అతని జీవిత వైఖరిగా రూపొంది, వైభవంగా వ్యక్తమవుతుంది. ఆ స్థితిలో ఉన్నవాడు తోడివాణ్ణి కులాన్నిబట్టీ, మతాన్నిబట్టీ, ఆస్తిపాస్తులనుబట్టీ, స్త్రీ పురుష భేదాన్నిబట్టీ చూడడు. కేవలం ధర్మదృష్టితో మాత్రమే చూస్తాడు. తననెలా చూసుకొంటాడో ఎదుటివాణ్ణీ అలాగే చూసుకొంటాడు. తనఎడల తాను ఎలా ప్రవర్తిస్తున్నాడో ఎదుటివానిఎడలా అలాగే ప్రవర్తిస్తాడు. ఈ విధమైన సమత్వాన్ని అనుభవించమని సనాతనధర్మం నొక్కిచెబుతోంది. అలా అనుభవిస్తే సంతోషమే. లేనప్పుడు, అనుభవించలేనప్పుడు, అనుభవించడానికి సిద్ధంగా లేనపుడు, అనుభవించడానికి అభ్యంతరాలు

ఉన్నప్పుడు, నాదాన్ని వినని ఆ మనిషి నినాదాన్ని వినవలసి వస్తుంది. లోపల వినబడుతున్న నాదాన్ని విని, సమత్వాన్ని అనుభవించనివాడు బయటనుండి వినబడుతున్న నినాదానికి జడిసి సమత్వాన్ని ప్రయత్నపూర్వకంగా అభ్యసించవలసి వస్తుంది. నాదంగా తనను తాను తెలుసుకోనివాడికి నినాదం తన్ని తెలియజెప్తుంది. నాదం ద్వారానో, నినాదం ద్వారానో, ఎలా బాగుంటే అలా మొత్తంమీద సమత్వాన్ని అభ్యసించక తప్పదు. తాముగా అభ్యసిస్తే ఆధ్యాత్మికత అంటారు. తన్నబడి అభ్యసిస్తే విప్లవం అంటారు. వివేకం ఉన్నచోట విప్లవానికి ఆవశ్యకం ఉండదు. అందుకని కొందరు వివేకాన్ని పెంచే ప్రయత్నం దీక్షగా చేస్తూ ఉంటారు. వీరినే మనం మహనీయులు అంటాం. ప్రవక్తలు అని పిలుస్తాం. ఇంకొందరు వివేకాన్ని పెంచడానికి కాలం చాలా పడుతుందనీ, కనుక విప్లవమే మార్గమనీ భావించి, తగిన ఉద్యమాలు నిర్వహిస్తూ ఉంటారు. భూగోళంలో ఈ రెండురకాల ప్రయత్నాలూ ఎప్పుడూ జరుగుతూనే ఉంటాయి. ఎవరెలా దారికి రావాలో, వారలా దారికి వస్తూ ఉంటారు. ఇవి రెండు మార్గాలు కావు. ఒకేమార్గానికి మనుష్యుల్ని జేర్చడానికి జరుగుతున్న రెండు రకాల ప్రయత్నాలు. మంచిగా వింటే ముద్దుపెట్టి చెప్పే తల్లే, పద్ధతి తప్పితే, కళ్ళెర్రజేసి, మొట్టికాయ పిడికిలి బిగిస్తుంది. ఒకేతల్లినుండి ఈ రెండు స్వభావాలు బిడ్డఎడల వ్యక్తం అయినట్టు ఒకే దైవంనుండి ఆత్మబోధ, విప్లవఘోష

అనే రెండు ప్రయత్నాలు మానవుల్ని మార్గాన నడిపించే టందుకు వ్యక్తమవుతూ ఉంటాయి."

అవతలి వ్యక్తి ఆశ్చర్యంతో కూడిన అనుభూతిని పొంది, "మీ వాక్కు చాలా శక్తిమంతమైనది. పరస్పర విరుద్ధంగా కనిపిస్తున్న అంశాలమధ్య ఏకత్వాన్ని చిత్రంగా దర్శింపచేయగల్గడం, సున్నితంగా వివరించగలగడం, మీ ప్రత్యేకత" అంటూ అనందించాడు.

---

# మాటలు - మంత్రాలు

## 2వ భాగం



కర్త :

డాక్టరు మోపిదేవి కృష్ణస్వామి

ఎం.ఎ.పిహెచ్.డి.



ప్రచురణ

ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్

ఎడ్యుకేషన్ ట్రస్ట్

విశాఖపట్నం - 17

# ఇందులో

# మాటలు కావు, ముత్యాల మూటలు

మంత్రాలు మాటలలోనే వుంటాయి. అయితే, మంత్రాలనేవి సంస్కృతం మాటలలోనే ఎక్కువగా కనిపిస్తాయి. మన మంత్రా లన్నీ సాధారణంగా సంస్కృతంలోనే వుంటాయి. అందువల్లనే, మంత్రాలు సంస్కృతం రానివారికి, సామాన్యులకు, ఏవో తంత్రా లుగానే కనిపిస్తాయి. ఇప్పుడిప్పుడు ఆ మంత్రాల అర్థం తెలియని వారు వాటిని కుతంత్రాలని కూడా అంటున్నారనుకోండి !

కాళిదాసు నోటి వెంట ఏ మాటవస్తే, అదే కవిత అయ్యే దంటారు. అలాగే "వికటకవీంద్రుడు" తెనాలి రామకృష్ణుడు కాళీవర ప్రసాదుడు కాబట్టి, తాను ఏ మాట అంటే ఆ మాటనే కవితగా చెల్లించుకున్నాడు.

అయితే, తెలుగులో మాటలు మంత్రాలు కాలేవు. వాటిని సంస్కృతం మూసలో పోస్తేనే మంత్రాలవుతాయి.

తెలుగులో మంత్రాలవంటి మాటలు సృష్టించే ఒక రామ కృష్ణుడున్నాడు. ఆయన తెనాలి రామకృష్ణుడుకాదు – మోపిదేవి కృష్ణుడు ! అయితే వికటకవి కారు.

అయినా, అలవోకగా ఆయన ఏ మాట అన్నా, అది కవిత గానే వినిపిస్తుంది; భాసిస్తుంది. మనిషినుంచి మనిషి పుట్టినట్టే మాటనుంచే మాటను పుట్టిస్తారు. ఆయన ఏ మాటఅన్నా అందులో కవితార్థం వుంటుంది. అందులోనే పరమార్థం వుంటుంది.

మాటనుంచి కొత్తమాటను- కొత్తఅర్థంతో కూడిన మాటను- పరమార్థంతో కూడిన మాటను - ఆయన ఎంత మాత్రం శ్రమ పడకుండా, ఆలోచించుకోకుండానే, అరక్షణమైనా ఆలస్యం చేయకుండానే పుట్టిస్తారు.

ఆ శక్తి ఆయనకు దైవదత్తం. అది అనుకరిస్తే వచ్చేది కాదు; కుస్తీ పడితే వచ్చేదికాదు. ఇందులో ఆయనకు సాటి ఎవ్వరూ లేరు; పోటీని ఆయన కోరుకున్నా, ఎవ్వరూ రాలేరు కూడా. ఆయనకు ఆయనే సాటి !

ఈ మాటలు అతిశయోక్తులు కావు. ఆత్మనుంచి వచ్చినవి. ఆయనతో అయిదు నిమిషాలు మాట్లాడితే, ఎన్నో మామూలు మాటల నుంచి ఆయన మంత్రాలను సృష్టిస్తారు. అదొక అద్భుతమైన ఆనందానుభూతి. ఏమాటనుంచి ఏ పరమార్థాన్ని సృష్టిస్తారో మనం పూహించలేము.

ఉదాహరణకు, చూడండి—

— "మనకు కావలసింది నినాదం కాదు — నాదం"

— "హరి ఓమ్ అనగానే ఈ శరీరం హరికి హోమ్‌గా మారిపోతుంది"

— "మాత్రల పైద్యమే చాలదు, మాటల పైద్యం కూడా కావాలి"

— "రోగ్‌లు లేరు, వున్నది రోగులే !"

— "నాన్న బ్రహ్మన్ (మనందరి సృష్టి కర్త బ్రహ్మదేవుడు) అయితే నాన్ బ్రాహ్మిన్ ఎక్కడ ?"

— "వృత్తివిద్యలు — వుత్తివిద్యలు"

— "మీరు వెనుక బడిన జాతులుకారు, వెన్నెముక జాతులు"

— "నినాదం చాలదు, నిర్మాణం కావాలి"

— "తిరుగుబాటు కాదు, తిరిగిబాట కెక్కించడం కావాలి"

— "ఆ పరిస్థితికి మనం తట్టుకోవాలి అంటే మనల్ని మనం "తట్టు"కోవాలి. కాని తిట్టుకుంటూ కూర్చుంటే లాభంలేదు"

— "వీలు చూసుకుని కాదు, వీలు చేసుకునిరండి"

— మార్చడంకాదు, మలచడం జరగాలి"

— "స్పర్ధయా వర్ధతే విద్యా కాదు, శ్రద్ధయా వర్ధతే విద్యా".

డాక్టర్ మోపిదేవి కృష్ణస్వామిగారి నోటవెలువడే మంత్రాల వంటి ఇలాంటి మాటలు ఎన్నెన్నో !

మంత్రాలవంటి వారి మాటలతో కూర్చిన ఈ పుస్తకం ఆ శీర్షికతో వెలువడిన రెండవభాగం.

ఎంతో పరమార్థ ద్యోతకాలైన ఆయన మాటల మూటలను విప్పితే కాని వాటి సుగంధాలు పరిమళించవు. ఈ పుస్తకం విప్పి చదవండి - అలాంటి మాటల ముత్యాల మూటలు ఎన్నో కని పిస్తాయి !

విజయవాడ
20-3-91

తుర్లపాటి కుటుంబరావు

# ఈ మంత్రాలు అపౌరుషేయాలు

ఈ మాటలు - మంత్రాలు ముందు చదువుతానాన్నా! నాకు ఇవంటే చాలా ఇష్టం. అంటూ ముచ్చటపడ్డారు జిల్లెళ్ళ మూడి అమ్మ. 19-2-1985 న సాయం వేళలో, స్వామి జిల్లెళ్ళ మూడిలో అమ్మతో గడుపుతున్న ఆ మధురక్షణాలలో మాటలు మంత్రాలు మొదటి భాగాన్ని తిరగేస్తూ. అక్కడక్కడా చవి చూస్తూ, చదివిచూస్తూ మురిసిపోతున్నది అమ్మ. ఆమె నోటి నుండి వెలువడేవి మాటలు- మంత్రాలే కదా మరి! ఆ సమాన ధర్మాన్ని గమనిస్తూ, తల పంకిస్తున్నదామె.

క్షణాలు అనుభూతి ప్రదంగా నడుస్తున్నాయి. అమ్మ వీక్షణాలు మాటలు-మంత్రాలనే గమనిస్తున్నాయి. అలా గమని స్తూనే, తలనుపంకిస్తూనే ఇలా అన్నది అమ్మ: దాదాపుగా ఇక్కడ ఉన్న విద్యార్థులంతా నీ పుస్తకాలన్నింటినీ శ్రద్ధగా చదువుతున్న వాళ్ళేనాన్నా! వీళ్ళందరికీ నీ వన్నా, నీ పుస్త కాలన్నా వల్లమాలిన అభిమానం. ఇప్పుడు నీ విచ్చిన ఈ గ్రంథాలను కూడా నేనొకసారి చదువుకొని వీళ్ళ గ్రంథాలయంలోనికే పంపిస్తాను. ఈ మాటలు-మంత్రాలు మాత్రం నాతోనే ఉంచుకుంటాను. సరేనా! జాతి పునర్ని ర్మాణం గురించి, దేశమంతటా నీ ప్రవచనాలు జరుగుతున్నా యట! ఇక్కడ వీళ్ళంతా చాలా ఇదిగా చెబుతున్నారు. ఆ జాతి పునర్నిర్మాణానికి కావలసిన మంత్రాలు ఇవే కదా నాన్నా! అందుకే నాకు ఇవంటే ఇష్టం.

అమ్మ స్వామివైపు చూస్తున్నది : ఇలాంటి మాటలు-మంత్రాలు ఇంకా ఇంకా కావాలినాన్నా ! ఈ జాతికి జీవనం పోయడానికి ! అన్నట్లుగా చూస్తున్నది. ఆ చూపునకు ప్రతిఫలమా అన్నట్లుగా ఇప్పుడు మాటలు-మంత్రాలు రెండవభాగం రూపుదిద్దుకొని మీ కందుతూ ఉన్నది.

ఆబాలగోపాలాన్ని ఇంతగా ఆనందింపచేస్తున్న ఈ మాటలు - మంత్రాలు అనే రచనా ప్రక్రియకు రూపకల్పన జరగడానికి వెనుక ఒక చిత్రమయినగాథ ఉన్నది. మాస్టర్ ఇ.కె నుండి శ్రీమద్భాగవతానికి రహస్య ప్రకాశరచన దీక్షగా సాగుతున్న రోజులవి. స్వామి నిత్యకృత్యాలకు పోనూ మిగిలిన సమయమంతా మాస్టర్ ఇ.కె. తోనే గడుపుతున్నారు. ఒక రోజు మధ్యాహ్నం ఇ.కె. మాస్టరుగారు తప్పనిసరై పనిమీద ఎక్కడికో వెళ్ళారు. స్వామి రాధా మాధవంలోని లైబ్రరీలో పనిచేసుకుంటున్నారు. ఇంతలో నడివయస్కుడొకాయన స్వామి ఎదుట నిలబడి నమస్కరించాడు. తమది పిఠాపురపట్టణమే అయినా వృత్తిరీత్యా భిలాయ్ నగరంలో ఉంటున్నాననీ, ఇప్పుడక్కడినుండే వచ్చాననీ పరిచయంచేసుకున్నాడు.

ఒక్క క్షణం ఆగి ఇలా అన్నాడాయన: 'మీ మాటలు మా మనస్సులలో నిరంతరం మెదులుతూనే ఉంటాయి. మమ్మల్ని నడుపుతూనే ఉంటాయి. నిజానికి అవి మా పాలిటి మంత్రాలే ! మొన్నటికి మొన్న గురుపూజలలో ప్రవచనం చేస్తూ మీరొక మాట చెప్పారు. మంచిపని చేయడంలో భారతీయుడికీ, పాశ్చాత్యునికీ తేడా ఉంది. భారతీయుడు 'వీలును' బట్టి చేస్తున్నాడు. పాశ్చాత్యుడు 'జీలు'ను బట్టి చేస్తున్నాడు. అని

గురుపూజలయిపోయినాయి. మరునాడు ఇక్కడే, మా ఇంటిదగ్గర ఒక సన్నివేశం. మోటారుచెడిపోయింది. నూతిలో కొంచెం లోతుగానే ఉన్నాయి నీళ్ళు. తోడటానికి బొక్కెనలేదు. ఒక కాగులాంటి దానికి తాడుకట్టి తోడటం మొదలుపెట్టాడు తమ్ముడు. 'అన్నయ్యా బొక్కెన ఉంటే బాగుండేది' అన్నాడు ఒకటికి రెండుసార్లు. నేనన్నాను: అన్నీ కుదిరితే అందరూ చేస్తారురా, కుదరనప్పుడు కూడా చేయగలగాలి. కృష్ణస్వామిగారు ఏమన్నారూ. 'భారతీయుడు వీలును బట్టి చేస్తాడు. పాశ్చాత్యుడు 'జీలు'ను బట్టి చేస్తాడు' అన్నారుకదా అని. అంతే! మా వాడిక నీళ్ళు తోడాడంటే, ఆ కాగుతో. ఆ వేగం, ఆ ఉత్సాహం వాణ్ణి అలా చూస్తుంటే నాకు చాలా ముచ్చటేసింది. మంత్రం అంటే ఇదిరా అనిపించింది. ఇలాంటి ప్రవచనాలు విన్నప్పుడల్లా ఆ ప్రవచనాలలో వచ్చే మంత్రాలను వ్రాసుకుంటూ ఉంటాను. వాటిని నా విషయంలోనూ, నా చుట్టూ ఉన్నవారి విషయంలోనూ సద్వినియోగంచేస్తూ ఉంటాను. ఖిలాఫ్‌లో నేను పని చేసే చోటకూడా సందర్భాన్ని బట్టి మిత్రకూటమిపైన ఈ మంత్రాలను ప్రయోగిస్తూ ఉంటాను. అవి మంచి ఫలితాలనిస్తూ ఉంటాయి. ఈ నా అనుభూతిని ఎప్పటినుండో మీకు చెప్పాలని ప్రయత్నం. ఇప్పటికి అవకాశం కుదిరింది.

'అయ్యా! మీ మాటలు – మంత్రాలయి దశదిశలా వ్యాపిస్తూ. జాతిని జాగృతం చేస్తున్నాయి. చిరకాలం వర్ధిల్లాలి. ఇలాంటి మంత్రాలను వందలూ, వేలుగా మా బోటివారికి అందిస్తూ ఉండాలి. మంత్రాల రూపంలో ఎప్పుడూ మీరు మా వెంట ఉండాలి' అంటూ పాదాలకు నమస్కరించి మాటలే మంత్రా

లుగా వెలువరిస్తున్న ఆ గొంతుతో, ఈ సామాన్యుణ్ణి ఒక్కసారి ఆశీర్వదించండి. అన్నాడు.

'మీరు సహృదయులు. మీ జీవితం తప్పక సార్థకమవుతుంది.' అంటూ స్వామి అతణ్ణి లేవనెత్తి అక్కున చేర్చుకున్నారు అతడొక పసిపాపలా స్వామి కౌగిట వదిగిపోయాడు. జాతి ఇలా కోరి పరివేదించుకుంటున్న మంత్రాలను ఒక ప్రత్యేకమయిన ప్రక్రియారూపంలో వెలువడేటట్లుగా చూస్తే బాగుంటుందని, అతడు తమ కౌగిట వదిగిన క్షణంలో స్వామికి అనిపించింది. ఆ సంకల్పమే అటుపైన చక్రపాణిగారి మీదుగా మాటలు-మంత్రాలు మొదటి భాగంగా రూపుధరించింది.

మాటలు-మంత్రాలు మొదటి భాగానికి మాస్టర్ ఇ.కె తమ ఆశీః పూర్వకమయిన అభినందనలందచేశారు. స్వామి నుండి వెలువడుతున్న ఈ మాటలు మంత్రాలు అపౌరుషేయాలన్నారు. స్వామి శరీరం అందుకొక దివ్యమయిన వాహికగా పని చేస్తున్నదన్నారు. ఈ వాహికను భద్రంగా చూసుకోవడంలో స్వామి పరివారం శ్రద్ధవహించాలన్నారు. స్వామిలోని ప్రవక్తను మొదటిసారిగా దర్శింపచేసిన ఆ దివ్యగ్రంథాన్ని 13-1-84 న విశాఖలో గురుపూజా వేదికపైన తాముగా ఆవిష్కరించారు.

ఇలా ఎందరెందరి హృదయాలనో చూరగొన్న మాటలు-మంత్రాలు ఇప్పుడు రెండవ భాగంగా కూడా రూపుదిద్దుకొని మీ ముందుకు రావడమన్నది ఎనలేని ఆనందాన్ని కలిగిస్తూ ఉన్నది.

మాటలు మంత్రాలు రెండవ భాగంలో అయిదు అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయం 'మాస్టర్ ఇ.కె.- మనం.' ఈ అధ్యాయం కొంచెం బరువుగా సాగుతుంది. అయితే మహనీయుల జీవితాల యెడల మనకన్ను ఎలా విచ్చుకోవాలో, మన మనస్సు ఎలా విప్పారాలో, మన హృదయం ఎలా ప్రతిఫలించాలో ఈ అధ్యాయం ఆర్ద్రంగా తెలియచెబుతుంది. మన గుండెలలో మనకు తెలియని లోతులను కూడా ఈ అధ్యాయం స్పృశిస్తుంది.

రెండవ అధ్యాయం 'సహచరులు- సరిదారి.' తనతో నడుస్తున్న వారిని దగ్గరగా తీసుకొని, వారిలోపలకుచూస్తూ, వారిలో జరగవలసిన సర్దుబాట్లకుగాను స్వామి ఉపదేశించిన మంత్రాలు ఇందులో ఉన్నాయి. స్వామి తనను దగ్గరగా తీసుకొని, తన జీవితాన్ని తడిమిచూస్తూ, అందులో జరగవలసిన మార్పులు, చేర్పులకుగాను తగిన మంత్రాలను ఉపదేశిస్తున్నట్లుగా చదువరికి అనుభూతి కలుగుతుంది ఈ అధ్యాయాన్ని అధ్యయనం చేస్తున్న వేళలో.

మాటల వైద్యం, మాత్రల వైద్యం అనే మూడవ అధ్యాయం సమాజానికి స్వస్థతను చేకూర్చడంలో స్వామి మాత్రలతో పాటు మాటలనుకూడా ఎలా వినియోగిస్తారన్నది తెలియచెబుతోంది. ఆహ్లాదకరమయిన అధ్యాయమిది. ఆ ఆహ్లాదంతో పాటుగా, ఒక అవగాహన, ఒక సందేశం, ఒక సంస్కరణ నడచిపోతూ ఉంటాయి. 'మేం వస్తున్నదికేవలం మీ మాత్రల కోసం అనుకుంటున్నారా, ఇదిగో మీ నుండి వెలువడుతూ ఉండే ఈ మాటలకోసమే ఈ మంత్రాలకోసమే ! అంటూ మురిసిపోతూ

ఉంటారు రోగార్తులు గా వచ్చేవాళ్లెందరో, ఎందరెందరో ! వైద్య సేవ జరిగే వేళ, స్వామి సన్నిధిలో మూలుగులుండవు. ఛురి పాలుంటాయి. నిట్టూర్పులుండవు. నిండయిన నవ్వులుంటాయి. అలా వ్యాధి గ్రస్తులలోని వ్యాధులను కూడా నవ్వించి, పంపించి వేస్తూ ఉంటారాయన. ఆ పంపిస్తున్న క్షణాలలో, ఆ పంపించడానికిగాను, ఆయననుండి వెలువడే సరసమయిన మంత్రాలున్నాయే, వాటిని రుచి చూపించడానికే ఈ అధ్యాయం రూపు దిద్దుకున్నది. చదువుతున్నామని మీ కనిపించేలోపునే అయిపోయే అధ్యాయమిది. అరే ! అప్పుడే అయిపోయిందా మరీకాసిసే మంత్రాలిస్తారు. మరి కాసిని మంత్రాలిస్తే వీళ్ళ సొమ్మేం పోయింది. అని మీ కనిపిస్తుంది.

నాల్గవది అయిన సమాజము- సంస్కరణ అనే అధ్యాయం. నేడు మనజాతిలో జరగవలసి ఉన్న నిజమయిన సంస్కరణ ఏమిటి అన్నది సూటిగా, సూక్ష్మంగా తెలియచేస్తున్నది. సరళంగా స్పష్టంగా వివరిస్తున్నది. అనుష్ఠాన పరులయిన సంస్కరణాభిలాషులకు ఈ అధ్యాయం నిజంగా ఒకకల్పవృక్షమే ! వారికి ఏకోణంలో పరిష్కారంకావలసివచ్చినా, ఈకల్పవృక్షాన్ని వెంటనే సమీపించవచ్చు. సంప్రదించవచ్చు.

అయిదవ అధ్యాయం. ఆత్మవిద్య- అసలురూపం. ఆత్మవిద్యయొక్క అసలురూపాన్ని ఈ అధ్యాయం లలితంగా తెలియచెబుతుంది. పరిభాషలూ, పడికట్టు రాళ్ళతో నిమిత్తం లేకుండా సత్యదర్శనాన్ని సూటిగా అందిస్తుంది. ఆత్మవిద్యను నిత్య జీవితంలో మెదిపి అందిస్తుంది. ఇంతవరకూ ఆధ్యాత్మికత

పేరులో మనం వింటూ వస్తున్న అంశాలు ఎన్నో మనకు ఇందులో అర్థమవుతాయి. అనుభవానికి వస్తాయి. పర్వతానికి శిఖరం ఎలాంటిదో, ఈ గ్రంథానికి ఈ అధ్యాయం అలాంటిది. నదికి సంగమస్థానం ఎలాంటిదో, ఈ గ్రంథానికి ఈ అధ్యాయం అలాంటిది.

ఇలా అయిదు అధ్యాయాలుగా కూర్పుచేయబడిన ఈ మాటలు- మంత్రాలు నిత్యజీవిత నిర్వాహణలో ఎల్లరకూ అక్కరకు వస్తాయని, పరిపూర్ణత వైపునకు అందరినీ నడిపిస్తాయని విశ్వసిస్తున్నాను.

మంత్రి

# 1. మాస్టర్ ఇ. కె - మనం

1. స్వర్ణపేటిక కాదది-గురుపేటిక
2. వారి తర్వాతనాదు-వారితో బాటుగా
3. తట్టుకోవాలి అంటే-మనని మనం తట్టుకోవాలి
4. పరిసమాప్తం కాదిది-పని ప్రారంభం
5. ఇది మన నిర్లక్ష్యానికి ప్రతిశిక్ష
6. చెట్లుగా కాక-తోటగా
7. మౌనం పాటించడం కాదు-ధ్యానం చేద్దాం
8. దేహానికి దేహం బదులు
9. ఆక్రమణ ఉండదు-ఆ క్రమమే ఉంటుంది
10. కాలాలే కులపతికి-కాలమే రూపుదిద్దుతుంది

# స్వరపేటిక కాదిది–గురుపేటిక

'మీ మాటలువింటుంటే అచ్చం ఇ.కె. మాస్టరుగారుమాట్లాడుతున్నట్లే ఉంటుంది. ఆ ఉచ్చారణ, ఆ మాడ్యులేషన్, ఆ వొంపులు.సొంపులు అంతా ఇ.కె. మాస్టరుగారే. ఏ మాత్రం తేడా లేదు' అన్నారొక మిత్రులు.

ప్రేమగా చూస్తూ స్వామి ఇలా అన్నారు: తేడా ఎందుకు ఉంటుంది. గొంతు ఆయనదే అయినప్పుడు. నా దృష్టిలో ఈ గొంతుగా ఇక్కడ ఉన్నదే ఇది స్వరపేటికకాదు గురుపేటిక. ఈ గురుపేటికకు వినియోగపడటానికే ఉన్నది మిగిలిన ఈ శరీరమంతా. ఈ అంశాన్ని మాటలు–మంత్రాలు రెండవభాగానికి ముందుమాట వ్రాస్తూ అందులో మాస్టరుగారే సూచించారు. ఇది వారి అనుగ్రహం. వారి దివ్యసంకల్పం.

మీరన్నది అక్షరాలానిజం. ఇది ఎక్కిరాలగళం. మానవులందరూ చైతన్యవంతులై ఎక్కి వచ్చేటట్లుగా పిలుపునిచ్చేటందుకై ఆయన తానుగా తీర్చిదిద్దుకున్న రథం ఈ శరీరం.

ఆ మిత్రులు పారవశ్యంలో మునిగిపోతూనే ఇలా అన్నారు ఇది ఈ భూమి చేసుకున్న అదృష్టంఅని నాకనిపిస్తున్నది. ఎక్కిరాలవారు తాము తలపెట్టిన లోకహితార్థమైనకృషి నిరాటంకంగా కొనసాగడానికై తాముగా చేసుకున్న ఏర్పాటే ఇది అని నా మనస్సునకు భాసిస్తున్నది. మీరు ధన్యులు. మీ నుండి ఆ గొంతును వినగలుగుతున్న మేము ధన్యులం. పది కాలాలపాటు మీరు వర్థిల్లాలి అని పదే పదే ఆ దైవాన్ని కోరు

మాస్టరు ఇ. కె - మనం

ఉంటున్నాను. ఈ గురుపేటిక నుంచి వెలువడే మాటలు - మంత్రాలకోసం మానవజాతి ఎప్పుడూ ఎదురుచూస్తూ ఉంటుంది.

అంటూ స్వామి పదములకు నమస్కరించివారు సెలవు తీసుకున్నారు.

## వారి తరువాత కాదు-వారితో బాటుగా

'కృష్ణస్వామిగారూ ! మిమ్మల్నెప్పటినుండో ఒక మాట అడగాలనుకుంటున్నాను. ఇ. కె మాస్టరుగారు ఇంత కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారుకదా! మరి వారి తరువాత ఈ కార్యక్రమం మాటేమిటి ? అన్నారొకాయన.

సూటిగా చూస్తూ స్వామిఇలా అన్నారు: మాస్టరుగారి విషయంలో తరువాత అన్న ప్రసక్తే లేదు. ఎందుకనంటే వారితో పాటుగా పనిచేయగలిగిన వారిని లెక్కకు మిక్కిలిగా తయారు చేసుకుని ఉన్నవారు వారు. వారిలా పనిచేసేవారు వారితోబాటుగ ఇప్పుడే పనిచేస్తున్నప్పుడు వారి తర్వాత ఏమిటి అన్న ప్రసక్తి ఎందుకు వస్తుంది ?

'మనీ పవర్‌కన్న మ్యాన్ పవర్ నాకు ముఖ్యం' అన్నారాయన. 'ఒక గ్రంథాన్ని రచించడంలోకన్న ఒకవ్యక్తిని తీర్చిదిద్దడంలో ఎక్కువ సంతృప్తి దొరుకుతుంది నాకు అన్నారాయన. చందాలను తీసుకుని, మనుషులను వదిలివేయడం ఆయనకు నచ్చని పద్ధతి. దగ్గరయిన మనుషులను చక్కబరచడంకోసం, తనను తాను నిశ్శేషంగా సమర్పించుకుంటారాయన. మరి అలా

తీర్చిదిద్దబడిన వ్యక్తులు ఆయన చేసిన 'సజీవమైన' రచనలవుతారు కదా ! కనుక వారి కార్యక్రమానికి కాలం గడుస్తున్న కొద్దీ వేగం పెరుగుతుంది. అది చిరంజీవమైన కార్యక్రమం.

అవతల వ్యక్తి తృప్తిగా చూశారు: మీరు మాట్లాడిన ఆ కాసిని మాటలలోనే వారి కార్యక్రమపై భవం కొల్లగా వెల్లడి అవుతోంది. మీరన్నట్లు అది నిజంగానే తిరుగులేని కార్యక్రమం' అంటూ మురిసిపోయారాయన.

## తట్టుకోవాలి అంటే - మనని మనం తట్టుకోవాలి

ఈ కష్టాలు ఇలా జరుగుతూ ఉండగా 1984 మార్చి 16 వ తేదీ రాత్రి మాస్టరు ఇ.కె తమ భౌతిక కాయాన్ని విడిచి పెట్టడం జరిగింది. వారికది లీలాప్రాయమే కావచ్చు. సోదర బృందానికి ఆ వార్త పిడుగుపాటుకన్న మించినది. పదిహేనవ తేదీ అంతా స్వామి, ఇ.కె మాస్టరుగారి భౌతికకాయం దగ్గర, ఆ పాదాల చెంత అలా నిలబడి ఉన్నారు. అంతిమయాత్ర వేళకు స్వామి దేహానికి ఇక ఏ మాత్రం శక్తి ఉన్నట్లులేదు. మిత్రు లొకరు వచ్చి తమ కారులో కూర్చొబెట్టుకోవడంతో ఆయన ఆ అంతిమ యాత్రను అనుసరించగలిగారు.

మరుభూమిలో మరిక మామూలుగా కనబడని స్థితికి మళ్ళి పోతున్నది మాస్టరు ఇ.కె దేహం. అలా ఒక ప్రక్కగా విలవిల లాడుతున్న దేహంతో నిలబడి ఉన్నారు స్వామి. దేహం కాలి

పోతున్నప్పటికంటె మించినబాధ అది కన్నీళ్ళకు కనబడనిది మాటలకుఅందనిది.

ఇంతలో అక్కడి బృందంలోనుంచి సోదరులు మల్లిపూడి వీరయ్యగారుస్వామిని సమీపించి ఆత్మీయతను కురిపిస్తున్న కళ్ళతోచూస్తూ 'మీరుకూడా ఇలా అయిపోతే ఎలా చెప్పండి? అన్నీ తెలిసినవారు మీరు తట్టుకోవాలి. మాకొరకైనా మీరు తట్టుకోవాలి' అన్నారు

పెగలలేకపోతున్న గొంతుతో కన్నీళ్ళ మధ్యలోనుంచి చూస్తూ 'అవును తట్టుకోవాలి. తట్టుకోవాలీ అంటే మనలో ఒకళ్ళ కొకళ్ళు ఇలా తట్టుకోవాలి. అప్పుడే మనంతట్టుకోవడం సాధ్యం.' అంటూ ఆయన్ని కౌగిలించుకున్నారు స్వామి.

'చూశారా మనం మాట్లాడుకొనే మామూలు మాటలకే వీ నోటినుంచి వెలువడేటప్పటికి ఎలాంటి శక్తి వస్తున్నదో [illegible]స్తున్నదో !' అన్నారాయన.

'అవును అది మాస్టరుగారి దివ్యశక్తి. మనం తట్టుకొనే శక్తి చేయగలిగిందదే' అన్నారుస్వామి.

# పరిసమాప్తం కాదిది-పని ప్రారంభం

అక్కడ జరుగవలసిన కార్యక్రమం పూర్తికాగానే బరు వెక్కిన గుండెలతో, సాగలేకపోతున్న పాదాలతో తప్పదుకదా ! అని ఇంటి ముఖం పట్టారు సోదరబృందం. ఆ మరుభూమినుండి ఇవతలకువస్తూఉండగా సోదరులలో ఒకరన్నారు స్వామితో: 'ఇవాళ్టితో కథపూర్తయిపోయింది' అని.

స్వామి వారినివారిస్తూ ఇలా అన్నారు: 'పరిసమాప్తంకాదు ఇది పని ప్రారంభం. పని పూర్తికాకుండా కథ ఎలా అవుతుంది ? సృష్టికథ మలుపుతిరగవలసి వచ్చినప్పుడల్లా పురాణపురుషుడు దేహధారియైదిగివస్తాడు, సృష్టికథ మలుపుతిరిగి ఒక స్థాయికి రాగానే ఇక ఇలాసాగుతుందనిసరిచూసుకొని, అప్పటికాదేహాన్ని త్యజిస్తాడు, మలుపుతిరిగిన సృష్టికథకు అది ఒక ప్రారంభం లాంటిదే అది సమాప్తమెలా అవుతుంది ? సృష్టికథకు అయి పోవటమంటూ ఉండదు. ఇలా కొంతకాలం సాగుతుంది. మళ్ళీ మలుపుతిరగవలసి ఉంటుంది. అప్పుడు మళ్ళీ ఆయన దిగి వస్తాడు. ఈ లోపల ఆయన దగ్గరశిక్షణ పొందినవారు డీలా పడి పోకుండా ఆ అడుగుజాడలవెంట సృష్టికథను సాగేటట్లుగ చూడాలి. అలా చూడటంకోసమే ఆయన దగ్గరకు చేరే అపురూపమైన అదృష్టం వారికి లభించిందని వారు గ్రహించాలి. ఆయన దగ్గర పొందిన శిక్షణను సద్వినియోగం చేయాలి. ఏమంటారు. పరి సమాప్తంకాదిది, ప్రారంభం, పని ప్రారంభం.

ఆ సోదరులు అవునన్నట్లు తలపంకించారు. 'చాలా బాగా గుర్తుచేశారు, ఏమరుపాటు చెందుతున్న మనస్సుకు ఎరుకను కలిగించారు.' అంటూ చేతులు జోడించారు.

# ఇది మన నిర్లక్ష్యానికి పడిన శిక్ష

అది మాస్టరు ఇ.కె దేహం విడిచిపెట్టిన తర్వాత పదమూడవరోజు. చిన్నముషిడివాడలోని మాస్టరు గారి ఇంటి ప్రాంగణం. ఎక్కడెక్కడి వారు వచ్చి చేరుతున్నారు. జరగవలసిన క్రతువు జరుగుతూ ఉన్నది. సోదర బృందంవారు బృందాలు బృందాలుగా రూపొంది మాస్టరుగారిని గూర్చిన విశేషాంశాలను మననం చేసుకుంటున్నారు. ఒక బృందం మధ్యలో స్వామికూర్చుని ఉన్నారు. వాళ్ళందరూ చెబుతూ వస్తున్నమాటలు విని విని స్వామి ఇలా అన్నారు: నేనొక్కమాట చెప్పనా? ఆయన దేహంతో ఉన్నప్పుడు మన ప్రవర్తనలను గూర్చి ఒక్కసారి గుర్తుచేసుకోండి. ఆయనదేహన్ని గురించి గాని, దేహస్థితిని గురించిగాని, ఆ దేహానికి కావలసిన విశ్రాంతిని గురించిగాని, అది పని చేయటానికి కావలసిన సౌకర్యాలను గురించిగాని మనలో పట్టించుకున్నవారెందరు? ఎవరికి వాళ్ళు మనపని పూర్తయిపోతేచాలనుకున్నాం. ఆయన నుండి మనము విడిపించుకొని బయటపడేది ఎలాగ? అను మాత్రమే చూసుకొన్నాం. ఆయనకూడా అన్నం తినాలి అనుకోవటంకన్న, మన పనికాక చూసి అప్పుడు అన్నంతింటే బాగుండును అని అనుకున్నవాళ్ళమే ఎక్కువమందిమి. మాస్టరుగారు భోజనానికి లేస్తున్నట్లున్నారే! అంటూనే గంటల తరబడి మనం ఆయన్ను తినేసేవాళ్ళం. మాస్టరుగారూ మీకు నిద్రవస్తున్నట్లుగా ఉంది. అంటూనే వస్తున్ననిద్రకు అడ్డంపడి మన సమస్యలన్నీ ఆయన ముందు పెట్టి ఆయనకు నిద్రలేకుండా, అప్పుడే అటు ఆ ఛాయలకు

రాకుండా చూసేవాళ్ళం. రైల్లో ఆయన ఏదైనా ఊరువెళుతూ ఉంటే ప్రతిస్టేషన్ దగ్గరాఆయన్ని ఆపి మందులు వ్రాయించు కోవడంతోనే సరిపెట్టకుండా మరదళ్ళపెళ్ళిసంగతి, మనవళ్ళ వడుగుసంగతి ఆయన్నే నిర్ణయించమనిచెప్పి ఆయన ఓపిక నంతా పిండుకుని, మిగిలినభాగాన్ని పిప్పిలా ఇప్పటికిలా వదలు తున్నామన్నట్లుగా రైలుకువదలిపెట్టేవాళ్ళం. చివరకు అయనబాత్ రూంకువెళుతున్నా అడ్డుపడి మా బాధలు విని మరీవెళ్ళండి అన్న వారు ఉన్నారు మనలో ఏమంటారు ? నేను చెబుతున్న ఈ అంశాల్లో అతిశయోక్తులేమయినా ఉ న్నా య ం టా రా ? నేను చెప్పిన విషయాలు చాలా చిన్నవేసుమా ! చివరకు ఆ య న ఆరోగ్యం ప్రమాదస్థితిపై పునకు ఒకప్రక్క పయనిస్తూ ఉండగా అలాంటిస్థితిలో విశాఖచేరుదామని ఆయన బయలుదేరితే మధ్యన ఒక ఊళ్ళోఆపి, కూర్చోవటానికికూడా శరీరం సహకరించని స్థితిలోఉన్న ఆయన్ని బలవంతాన కుర్చీలో కూర్చోబెట్టి, మన కున్న బలమంతా ఆయనకు పాదనమస్కారాలు చేయడంలోచూపిన వాళ్ళం. ఒకప్రక్క దేహానికి దారుణస్థితి ప్రాప్తిస్తోంది. కను లెత్తిచూడలేకపోతున్నారాయన. మగత ఆయన కనురెప్పల్ని నొక్కేస్తుంటే మాస్టరుగారూ ! వీడూ మా అబ్బాయి. ఇది మా కోడలు. ఇటుచూడండి. వీడే మా మనవడు అని మూసుకుపోతున్న ఆ కనురెప్పలను పైకెత్తి మరీ చూపించినవాళ్ళం మనం. సోదరు లారా ఏమిచెప్పను మనచర్యలను గురించి ? ఆయనదృష్టిలో మినంపడాలి అనుకున్నాంతప్ప మనదృష్టి కనీసం ఆయనదేహం మీదనైనా పడలేదు. ఆయనను వినియోగించుకోవాలన్న ఆత్రుతలోపడి మనమాయనదేహాన్ని పట్టించుకోనేలేదు. అయినా అది కొన్నాళ్లుమనమధ్య పెనుగులాడింది ఆయనమీదున్న అను

రాగంతో. మన నిర్లక్ష్యానికి తట్టుకోలేక మనవైపు చూసి చూసి, మనలో ఇక ఎదుగుదల రాదని గమనించి 'మీకు కావల్సిందాయనే కదా! నేను మీకు అక్కరలేదు కదా! అందుకే నేనిక తప్పుకుంటున్నాను. మీరిక ఆయనను చూసుకోండి అని తప్పనిసరై తానుతప్పుకుంది. తప్పుకుంటేనే గాని మనకు దాని విలువ తెలియలేదు. ఇప్పుడు విలువ తెలిసింది ఏం లాభం? ఏదైనా ఇంతేనేమో! ఉన్నప్పుడు విలువ తెలియడం కష్టం. ఉన్ననాడు, విలువ తెలిసి వర్తించ గలిగితే, మానవుడు ఇక ధన్యుడే! ఏంచేద్దాం ఇప్పుడు చెప్పండి! ఇది మన నిర్లక్ష్యానికి పడిన శిక్ష. ఇప్పటికైనా మనతో అన్నాళ్ళు చేసినందుకు ఆదేవునికి కృతజ్ఞతలు చెప్పుకుందాం. అంతకన్నా చేయగలిగిందిలేదు.

ఆ బృందమంతా అశ్రునయనాలతో ఆత్మపరిశీలన చేసికొంటూ కూర్చుండిపోయింది అలా.

## చెట్టుగా గాక - తోటగా

ఆ పదమూడవ రోజునే సాయంత్రం 6 గంటలకు విశాఖలోని ప్రేమసమాజం హాల్లో సోదరబృందం సమావేశమయింది. సోదరబృందంలోని ప్రముఖులు ఒక్కొక్కరే వేదికపైకి వచ్చి తగు మాత్రంగా జరిగిన, జరుగవలసిన అంశాలను గురించి తమ కనిపించిన విధంగా మాట్లాడి దిగిపోతున్నారు. ఇంతలో స్వామి వంతు వచ్చింది.

సోదరబృందమందరినీ ఒక్కసారిగా కలియజూచి స్వామి ఇలా అన్నారు: మాస్టరుగారు మనకందించినవి అప్పగించినవి రెండు. ఒకటిసేవ. రెండు సందేశం. ఆ రెండింటి విషయంలోను మనం మరింత శ్రద్ధపెట్టవలసి ఉందిప్పుడు. ఎందువల్లనంటే వాటిలోనే మనం మాస్టరుగారిని చూడగలం కనుక. నిజంకూడా అంతే. వాటినిచూసే మనం మాస్టరుగారికి దగ్గరయ్యాం. వాటిని చూచే మనం వారు మాస్టరుగారని మోకరిల్లాం. మళ్ళీ ఇప్పుడు వాటి నిర్వహణలోనే మనం వారిని సాక్షాత్కరింపచేసుకోవలసి ఉంది. అయితే ఇక్కడో చిత్రముంది. వారిసేవాసందేశాల సంగతి లోకానికంతటికీ తెలిసిందే. వారి స్వరూపాలే అవి! అనికూడా ప్రజలెందరికో తెలుసు, అయితే వాటిమీదుగా, వారికి దగ్గరైన మనం ఎటువంటి దివ్యప్రేమను అనుభవించామో మనకు మాత్రమేతెలుసు. నిజానికా దివ్యప్రేమవల్లే ఈ సేవా,సందేశాలకు ఇంతటి విస్తృతి, ఇంతటి ప్రయోజనాలు ఏర్పడ్డాయి. కనుక సేవా, సందేశాలను కొనసాగించడం అంటే మామూలుగా కొనసాగించటంకాదు. మామూలుగ కొనసాగిస్తే అవి ఎంతోకాలం సాగవు. అలాంటి దివ్యప్రేమతో మనం కొనసాగించగలిగినపుడే ఈ సేవా సందేశాలు నేలనాలుగు చెఱగులావ్యాపించి, ఈ విశ్వరూపాన్ని మాస్టరుగారి నిజస్వరూపంగా మనకు చూపించగలుగుతాయి. కనుక ఇప్పుడుమనం ఆయన మనయెడలచూపిన ప్రేమను నిరంతరం స్మరించుకుంటూ మనమే ప్రేమగా రూపొందవలసి ఉన్నది. నిజానికి మన నిజస్వరూపమదే ! మాస్టరుగారు మనకు రుచి చూపిందీ, తెలియజెప్పింది, అనుభవింపజేసిందికూడా అదే. ఆయన నడిపిన శిక్షణ తరగతులు, చేసిన శాస్త్రబోధలు అన్నీ ఆ ప్రేమమహాసముద్రంనుండిపైకిలేచినకెరటాలే! ఆయనమనసుంచి

ఏమీ కోరలేదు. మనసు తనకున్న ఎన్నడూ వేరుగా చూడలేదు. మనలో తనను చూసుకుంటూ, మననితానుగా తీర్చిదిద్దుకుంటూ వచ్చారాయన. ఈ సత్యాన్ని ఎందుకు గుర్తుచేస్తున్నానంటే మన తోటివారితో మనం అలాంటిఆత్మీయతతో మెలగగలగాలని తెలియ చెప్పటానికి, అప్పుడు మాత్రమే ఆయననుండి వ్యక్తమైన సేవా సందేశాలు మనద్వారా విస్తృతిచెంది మనజీవితాలను పునీతం చేస్తాయని నేను మరల మరల మనవి చేస్తున్నాను. సోదరులారా ! మళ్ళీ మళ్ళీ గుర్తు చేసుకోవలసిన మాటలివి. మళ్ళీ మళ్ళీ గుర్తుచేసుకోవలసిన దివ్యస్థితిఇది. దీనిపట్ల మనలో ఏ మాత్రం ఏమరుపాటు చెందకుందుముగాక !

నాకుముందు మాట్లాడిన మిత్రులలో కొందరు వారుచెప్పిన అంశాల్లో భాగంగా 'మాస్టరుగారికి ప్రత్యేకించి వారసులులేరు. అంతా వారే నడుపుకుంటారు అని చెబుతూ వచ్చారు. ఈ విషయమై నేనొక చిన్నమాటచెబుతాను. వారు చెప్పింది వినటానికి బాగానేఉందిగాని, క్రియారూపంలో అలా జరగడానికి అవకాశంలేదు. మాస్టరుగారు తమ ప్రణాళికను నిర్వహించడానికి కొన్ని ఉపాధులను తప్పక ఎంచుకుంటారు. కొన్నింటిని ఇప్పటికే ఎంచుకుని ఉన్నారు. ఇంకొన్నిటిని కాలక్రమంలో ఎంచుకుంటారు. మాస్టరు సి.వి.వి అలాగే చేశారుకదా ! చేస్తున్నారుకదా! మాస్టరుగారికథా అంతే ! అలాగే మాస్టరుగారిని దేహంతో చూడటానికి అలవాటుపడిన సోదరబృందం ఆ దేహం తప్పుకున్న కారణాన ఇప్పుడు తీవ్రమైన విరహవేదనను అనుభవిస్తున్నారు. వారు తప్పకుండా మనలో కొందరిలో మాస్టరుగారిని చూసుకునే ప్రయత్నం చేస్తారు. ఇప్పటికే చేస్తున్నారు దానికి మనం అర్హు

పెట్టకూడదు. అడ్డుపెట్టడానికి మనమెవరం? పితృశ్రీమందే తమ ప్రణాళికను వ్యక్తంచేయుటానికి మాస్టరుగారు స్వీకరించిన ఉపాధులూ ప్రజలు ఆయనను చూచుకోవడానికి ఎంచుకునే ఉపాధులూ ఒకటే అవుతాయి. కధ అలా జరుగుతుంది.

మరోమాట. మనిషికి ఒక వయసు వచ్చినతరువాత వివాహమవుతుంది. పిల్లలు కలుగుతారు. ఆ కలిగిన బిడ్డలు అమ్మా, నాన్నా అని పిలుస్తూ చుట్టూతిరుగుతారు. అది సహజం. అలా జరుగుతున్నందుకు ఆశ్చర్యపడవలసిందిగాని, గర్వించవలసింది గాని ఏమీ లేదు. అలాగే మననుండి లోకహితార్థమైనకార్యక్రమం వ్యక్తమవుతున్న కొద్దీ దానిఎడల అభిరుచి కలిగిన కొందరు మనకు దగ్గరకావడం, మనలో తమకు కావలసిన గురుస్వరూపాన్ని చూసుకోవడం, దానికి శరణాగతిచెంది తాముశిష్యులై శిక్షణపొందడం జరుగుతూ ఉంటుంది. తల్లిదండ్రుల బిడ్డలకధ ఎలాంటిదో ఇదీ అలాంటిదే. ఈవిషయంలోకూడఆశ్చర్యపడవలసిందిగాని,గర్వించవలసింది గాని ఏమీలేదు. ఈ సత్యాన్ని తెలుసుకుంటే మనం సాఫీగా ముందుకు సాగిపోగలుతాం. అలాకాక ఆశ్చర్యపడినా, గర్వించినా, అలా పడడంకోసం మనం మన ప్రయాణాన్ని ఆపి వేయవలసివస్తుంది. కనుక భవిష్యత్తులో ఈ అంశాలను సోదర బృందంలోని ప్రముఖులు నిరంతరం గుర్తుపెట్టుకోవడం ఎంతైనా అవసరం.

చివరిగా ఇంకొక్కమాట. మనలో ఎవరి స్వభావం వారి కుంటుంది. ఒకరిలా ఇంకొకరు పని చేయుడంగాని, ప్రవర్తించడం గాని సాధ్యంకాదు. అలాజరుగవలసిన అవసరమూలేదు. ఎవరి స్వభావానికి అనుగుణంగా వారు మాస్టరుగారి ప్రణాళికలో పని

చేయవచ్చు. పనిచేస్తాంకూడా. అలాపనిచేస్తున్నప్పుడు మనమధ్య ఉన్నతారతమ్యాన్ని వైరుధ్యంగా గాక వైవిధ్యంగా మాస్టరు గారి దివ్యవైభవంగా మనం దర్శించవలసి ఉంటది. ఈ సృష్టిలోని చిత్రమొకటి చెబుతాను చూడండి. ఒక తోట ఉన్నది. ఆ తోటలో రకరకాల మొక్కలున్నాయి. ఆ మొక్కలు పెరిగి చెట్లవుతాయి. ఆ రకరకాలచెట్లు తమకు తగినట్లుగానే ప్రవర్తిస్తాయికదా ! ఒక్కొక్క రకంఒక్కొక్క విధంగా పూస్తాయి. ఒక్కొక్క కాలంలో కాస్తాయి, ఫలిస్తాయి. అలా జరగడం వల్ల ఆ తోటకు అందచందాలు పెరుగుతున్నాయే తప్ప ఇబ్బంది ఏం రావడంలేదు కదా ! ఇన్నిరకాలచెట్లు, ఇన్ని రకాలుగా పూయటం, కాయటం, జరుగుతుండడంవల్ల అన్నికాలాల్లోనూ ఆ తోట వైభవం పెరుగుతూనే ఉన్నది. సోదరులారా ! మనమిప్పుడు అలాంటి తోటగా రూపొందాలి. మనలో ఎవరి స్వభావాలు వారికుండవచ్చు. ఎవరి అభిరుచులు వారికుండవచ్చు. ఎవరి కార్యక్రమాలు వారికుండవచ్చు. కాని మనమందరం ఒకటే అని మనకు గుర్తుండాలి. వ్యక్తమవుతున్న వైవిధ్యమంతా మాస్టరుగారిదేనని మాస్టరుగారి ప్రణాళికలోనిదేనని మనం గ్రహించగలగాలి. తోటలో ఉన్నవి నిజానికిచెట్లే కాని చెట్లక్కడ ఉన్నాయి అనడంలేదు మనం, ఇక్కడతోటఉన్నది అంటున్నాం. ఏకవచనాన్ని ప్రయోగిస్తున్నాం అలాగే దైవయోగాన మనం బహుధా ప్రవర్తించినప్పటికీ, ఏకత్వమనేది మనచేత నిరంతరం అనుభవింపబడాలి. చెట్లు అనబడే స్థితిలో కాకుండా తోట అనబడే స్థితిలో మనం ఎప్పుడూ ఉండాలి. 'యస్! ఇట్ ఈజ్ మాస్టర్స్ గార్డెన్' మాస్టరుగారితోట. మాస్టరుగారి ఈ తోట. మనం చెట్లవంటివాళ్ళం. మనద్వారా వ్యక్తమవుతున్న ఆయన తోటవంటివారు. ఈ సత్యం మనకు గుర్తున్నంత వరకు

మనలో ఎవరెవరం ఎక్కడున్నా ఏంచేస్తున్నా ఒకానొక దివ్యానుభూతి అనుభవానికొస్తుంది. ఆ అనుభూతే మన మాస్టరుగారు.

సభ మాస్టరుగారి స్వరూపమై ధ్యానసముద్రంలో నిలబడి నట్లున్నది.

## మౌనం పాటించడం కాదు - ధ్యానం చేద్దాం

మాష్టరు ఇ. కె. దేహాన్ని విడిచిపెట్టిన కొద్దిరోజులకే శ్రీరామ నవమి వచ్చింది. ఆ సందర్భంగా విశాఖ ఇండస్ట్రియల్ కాలనీ లోని రామాలయంలో స్వామి ప్రసంగించవలసివచ్చింది. ఏటా శ్రీరామనవమి రోజుల్లో ఏదో ఒకరోజున మాస్టరు ఇ. కె. స్వామిని కలుపుకొని ఆ రామాలయంలో ప్రసంగించడం అనేది ఒక ఆచారంగా వస్తోంది. ఈ సంవత్సరం బరువెక్కిన గుండెతో అలానే స్వామి ఆ ఆచారాన్ని ఒక్కరుగా కొనసాగించవలసి వచ్చింది.

ఇ. కె. మాష్టరుగారికి ఆ రామాలయమన్నా ఆ రామాలయ నిర్వాహకులన్నా ఒక ప్రత్యేకమైన అనురాగం. దానికి కారణం కార్మికులు, శ్రమజీవులు కలసి మెలసి స్వయంగా ఆ రామాలయాన్ని నిర్మించుకోవడమే ! నిర్మించుకోవడమే కాకుండా, చక్కగా దాన్ని నిర్వహించుకోవడం. నిర్మాణం ప్రారంభమైనప్పటినుండి ఆ దేవాలయంతో ఇ. కె. మాష్టరుగారికి విడదీయరాని అనుబంధమున్నది. నిర్మాణ సందర్భంలో ఆ శ్రామికులను ఆశీర్వదిస్తూ ఆయన ఇలా అన్నారట ! ఈ పని మీ వల్ల అవు

ఉందా అని. మీరు భయపడవలసిన పనిలేదు. ఆనాడు వారధి కట్టిన వానరులు ఎలాంటివారో ఇప్పుడు మీరూ అలాంటివారే, ఆనాటి నుండి రాముడు తన ఆలయాలను ఇలా సామాన్యులను బృందాలుగ తీర్చిదిద్దే నిర్మింపజేసుకుంటున్నాడు. రావాలంటే మీరు పరిశీలించ వచ్చు. మిగిలిన దేవతామూర్తుల గుడులు ఎవరైనా నిర్మించి ఉండవచ్చు కాని రామమందిరాలు మాత్రం వాడావాడా అన్ని శ్రమజీవులు, సామాన్యులు బృందాలుగా ఏర్పడి ఏర్పాటు చేసుకున్నవే. కనుక ముందుకు సాగండి. మీ మీ వృత్తి విద్యలను రామాలయ నిర్మాణంలో వినియోగించి ధన్యులుకండి ! మీ వెంట నేనెప్పుడూ ఉంటాను.

అలా ఆయన వెన్ను తట్టడంతో రామాలయ నిర్మాణం చకచకా సాగిపోయింది. అప్పటినుండి ఆ శ్రమజీవులకు రామాలయాన్ని చూచినపుడల్లా మాష్టరుగారి మాటలే గుర్తుకొస్తుంటాయట. వారు తరచు చెబుతుంటారు.

అలాంటిచోట స్వామి ప్రవచనం ప్రారంభం కాబోతున్న వేళ అది. ఆ కార్యక్రమ నిర్వాహకులలో ప్రధానుడైన వ్యక్తి లేచి మాష్టరు ఇ. కె. దివ్యవైభవాన్ని స్మరించుకొని 'అంతటి వారు శరీరాన్ని విడిచిపెట్టారు కనుక మన మందరమిప్పుడు రెండు నిముషాలు మౌనాన్ని పాటిద్దాం' అన్నాడు. వెంటనే స్వామి మైకు అందుకుని ఇలా అన్నారు. సోదరీ సోదరులారా ! చిన్న సవరణ, రెండు నిముషాలపాటు మనం మౌనం పాటించ వలసిన సందర్భంకాదిది. ఆ మహనీయమూర్తిని స్మరించి ధ్యానం చేసుకోవలసిన సమయం. మామూలుగా జీవించిన వ్యక్తులు

మరణించినప్పుడు కొద్దిసేపు మౌనం పాటిస్తాం. వారికి శాంతి కలగాలని దైవాన్ని ప్రార్థిస్తాం. కాని భూమిపైన దైవస్వరూపులుగా వెలుగొందిన మహితాత్ములు తమ శరీరాన్ని విడచిన వేళ వారిని స్మరించుకుంటాం. ధ్యానంచేస్తాం. వారిస్పర్శననుభవిస్తాం.మనం చిత్తశాంతిని పొందుతాం ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయం. కనుక మౌనం స్థానంలో ధ్యానం చేసుకుందాం వారి అనుగ్రహానికి పాత్రులమౌదాం. అంటూ స్వామి ధ్యాన నిమగ్నులైనారు. సభ మొత్తం ధ్యానంలోనికి ప్రవేశించింది. ఇ. కె. మాష్టరుగారి దివ్యతేజం ప్రాంగణ మంతటా పరుచుకొన్నట్లుగా గోచరించింది.

## దేహానికి దేహమే బదులు

కృష్ణాజిల్లా అవనిగడ్డలో మాష్టరు ఇ. కె. దివ్య సంస్మరణ సభ ఏర్పాటు చేయబడింది. ప్రముఖులు ఎందరో తరలి వచ్చారు అంజలి ఘటించడానికి. మాష్టరు ఇ. కె. నుండి వ్యక్తమైన దివ్యవైభవాన్ని నోరార కీర్తిస్తూ, అలాంటి మహనీయులు శరీరాన్ని విడిచిపెట్టడం తమని తీరని వేదనకు గురిచేస్తున్నదని చెప్పారు. సభఅంతా గాఢమైన విషాదానుభూతిని పొందుతోంది.

ఇక స్వామి లేచారు లేచి ఇలా అన్నారు పెద్దలెందరో ఇ. కె. మాష్టరుగారిని గూర్చి, వారి కృషిని గూర్చి ప్రస్తుతించారు. అకాలంగా వారు దేహాన్ని విడిచిపెట్టడం తమను తీవ్రమైన వేదనకు గురిచేసిందని చెప్పారు. నిజమే ! అనుకోకుండా

భూకంపమొస్తే ఎలా ఉంటుంది. జల ప్రళయం వస్తే ఎలా ఉంటుంది ? ఇదీ అలాంటిదే. తట్టుకోవడం చాలా కష్టంగానే ఉంది, కాని ఈ సందర్భంలో నాదొక్కమాట. ఇప్పుడు ఇక్కడ చేరిన మనందరం ఎందుకు బాధపడుతున్నాం. వారులేరని కాదు కదా ! వారున్నారు, శాశ్వతస్వరూపులై ఎప్పుడూ ఉంటారు అని మనకు తెలుసు. అయితే మరెందుకు ఈ బాధంతా ? వారికి దేహం లేదని, దేహంతో వారు మనకు కనబడటం లేదని! అంతేనా ? అదే మన బాధయినప్పుడు మనమొకపనిచేద్దామా? నాదృష్టిలో ఆయన ఎడల మనకు గల విశ్వాసానికి, ప్రేమకు, భక్తికి మనం చేయ దగినది, చేయగల్గినది, చేయవలసినది కూడ అదే. నా కనిపిస్తుంది కదా ! అసలాయన అందుకే మనలనుచేరదీశారని. దేహం అన్న తరువాత ఎప్పటికైనా విడిచిపెట్టక తప్పదు. ఆ విడిచిపెట్టే లోపున మరిన్ని దేహాలను ఆ పనికి సిద్ధం చేయడం జరిగినప్పుడు ఇక ఆ కార్యక్రమం ఆగదు. గురువునకు శిష్యులుగాని, తల్లిదండ్రులకు బిడ్డలుగాని అందుకే ఏర్పడుతున్నారు. ప్రకృతి ఆ ఏర్పాటు అందుకే చేస్తున్నది. కొందరు తల్లిదండ్రులు ఈ సత్యాన్ని దర్శించలేక ఈ పిల్లలు పెరిగి పెద్దవాళ్లై వృద్ధాప్యంలో మనని చూడటానికి పనికివస్తారు అనుకుంటారు. అలా చూడాలని కోరుకుంటున్నారు కోరిక బాగానే ఉందికాని కొంత స్వార్థంతో కూడుకుని ఉంది. అసలు ప్రకృతి మనకు పిల్లల్నిచ్చింది మనం సమాజానికి ఏ పని చేసిపెడుతున్నామో, ఆ పనిని వాళ్ళు మన తర్వాత కూడా కొనసాగించాలని. చూశారా ! ఈ సత్యాన్ని గమనించి బిడ్డల్ని తీర్చిదిద్దితే ఎంత బాగుంటుంది. అలాంటిదే గురుశిష్యసంబంధంకూడా. గురువు తన కృషిని కొనసాగించడానికే

శిష్యులను రూపుదిద్దుతున్నాడు. కనుక సోదరులారా ! ఈ దీక్షలను ఆయనకు మరొక్కసారి మనస్ఫూర్తిగా అప్పగించుకుందాం. ఇన్ని దేహాలనూ తనవిగా స్వీకరించి లోకహితార్థమై జరుగుతున్న కృషిని కొనసాగించమని వారిని వేడుకుందాము. ఆ సమర్పణకు కావలసిన ప్రేరణ నందుకొనడానికే ఇప్పుడు ఈ దివ్య సంస్మరణ.

సభలోని విషాదచ్ఛాయలు స్వామిలేచి నిల్చున్నప్పటి నుండే కరగి పోవడం మొదలు పెట్టాయి. సందేశం పూర్తయ్యే టప్పటికి సభ స్ఫూర్తిని పొంది, కర్తవ్యోన్ముఖమై ఇ. కె. మాస్టరుగారివైపు సమర్పణ భావంతో చూస్తున్నట్లుగా భాసించింది.

## ఆక్రమణా ఉండదు - ఆ క్రమమే ఉంటుంది

విశాఖలోని లాసన్స్బేలో వైద్యసేవలో ఉన్నారు స్వామి. మధ్యలో ఒక పెద్దాయన వచ్చారు. ఇ. కె. మాస్టరుగారి కార్యక్రమాలంటే ఆయనకు వల్లమాలిన అభిమానం.

మాటల మధ్యలో ఆయన అడిగారు స్వామిని "కృష్ణమాచార్యులవారు శరీరం విడిచిపెట్టారుకదా ! మరి ఇపుడు ఆ స్థానాన్ని ఎవరు ఆక్రమిస్తారు ?" అని.

సూటిగా చూస్తూ స్వామి ఇలా అన్నారు : ఇ. కె మాస్టరుగారు ఒక క్రమంలో తమ అంతేవాసుల్లో కొందరిని ఎప్పటినుండో

తీర్చి దిద్దుకుంటూ వస్తున్నారు. ఇప్పుడు కూడ ఆ క్రమమే ఉంటుంది. ఇక ఆక్రమణకు అవకాశమెక్కడిది ? ఆ అవసరం మాత్రమెక్కడుంటుంది ?

అవతలి వ్యక్తి బోధపడినట్లు తృప్తిగా చూశారు.

## కాబోయే కులపతికి కాలమే రూపుదిద్దుతుంది

మరొక రోజున వైద్యసేవలో ఉన్న స్వామి దగ్గరకు కొందరు పరామర్శించడానికని వచ్చారు. పరిస్థితులను గూర్చి ప్రస్తావించుకుంటూ ఉండగా అందులో ఒకాయన మధ్యలో అడిగాడు. ఇ. కె. మాస్టరుగారు శరీరాన్ని వదలిపెట్టారు కదా ! మరి ఇప్పుడు కాబోయే కులపతి ఎవరు ? అని.

వారివైపు సూటిగా చూస్తూ స్వామి ఇలా అన్నారు : ఇ.కె. మాస్టరుగారిని కులపతిగా రూపొందించింది ఎవరు? కాలం. కాలమే ఆయనకు ఆ రూపమిచ్చింది. ఆయనలా రూపుదాల్చి పనిచేసి పెట్టాలని కోరుకున్నది. ఆయన అలా పనిచేసిపెట్టారు. ఇక ముందు కూడా కాలమే తనకు తగిన వారిని ఎంచుకొని కులపతిగా రూపు దిద్దుకుంటుంది. కనుక ఎవరూ కలవరపడనక్కరలేదు. కాలం వరించకుండా ఎవరైనా తాము కులపతులమని భావించినా, భావించి ఊరుకోవడమెందుకని తమపేర్లముందు అలా తగిలించుకున్నా జరిగేదిగాని, జరిగేదిగాని ఏమీ ఉండదు. ఆ పదం

కూడా వారి పేరులో భాగంగా మిగిలిపోతుంది. సోమయాజులని పేరు పెట్టుకునే వాళ్ళులేరూ ? శాస్త్రి అని పేరు పెట్టుకునేవాడు లేరూ ? అలాంటిదే ఇది కూడా అవుతుంది. కనుక కాలం వరించ వలసిన విషయంలో పరొకరు వివరించవలసిందేముంటుంది ?

మాష్టరు సి.వి.వి. గారి సంప్రదాయానికి చెందినవారిలో ఎక్కువమంది మొదట్లో ఇ. కె. మాష్టరుగారిని సి.వి.విగారి పరం పరలో ఒకరిగా గుర్తించడానికే ఇష్టపడలేదు. తరువాత ఆయన విజృంభించి ఉద్యమ రూపం ధరిస్తున్న వేళల్లో కూడా అందరూ ఆయన్ని మాష్టరుగారని పిలుస్తున్నా వాళ్ళు మాత్రం మీడి యంల్లో ఒకరిగా అంగీకరించలేక పోయారు. అయినా కాలం వీరెవరిని లక్ష్యపెట్టలేదు. మాష్టరు సి.వి.వి.గారు కూడా వీరెవరి మాటా వినిపించుకోలేదు. ఇ. కె. మాష్టరు గారి ద్వారా మాష్టరు సి.వి.విగారి సంప్రదాయం విశ్వవ్యాప్తమైంది. సనాతన ధర్మం యొక్క నిజస్వరూపం నేల నాలుగు చెరగులా ఆయన నుండి వెదజల్లబడింది. కాలం ఆయనను వరించింది. కు ల ప తి గా ఆ య న ను అ భి షే కిం చిం ది. సర్వసంప్రదాయాలవారికి కావలసిన సమన్వయాన్ని ఆయన ద్వారా వ్యక్తం చేసింది. కనుక ఇకముందు కూడా జరుగవలసిన కథను ఆ కాలమే నిర్ణ యిస్తుంది.

ఆ వింటున్నవారు ఔనౌను అంటూ తలవూపుతున్నారు. అవును, కాలపురుషుడు చేసే నిర్ణయానికి ఎవరైనా తలవూప వల సిందే కదా !

# 2. సహచరులు - సరిదారి

1. గంటల కొలది
2. గుండెగల వాళ్ళిప్పుడు కావాలి
3. లైట్‌గా తీసుకోవడంకాదు-లైటుగా తీసుకో
4. ఆర్ట్ - కిల్
5. వర్రీ కాదది పెర్రీ
6. ఖాళీ లేదు అంటే-మన పనే ఖాళీ అవుతుంది
7. వీలు చూసుకొనిగాదు-వీలు చేసుకొని రండి
8. తీరిక లేదు అంటే - తీరు ఇక లేదు అని
9. ఆకర్షించడం కాదు-ఆరాధించడం జరగాలి
10. విల్లును ఎక్కుపెట్టండి
11. మార్చడం కాదిది మలచడం
12. అడుగు పెడితే అడుగు తగలాలి
13. శ్రద్ధయా వర్ధతే విద్యా

# గంటల కొలది

మేడ మెట్లు దిగుతున్నారు స్వామి. అప్పుడే అక్కడొక సభ జరిగింది. చేరిన వారందరూ ఇంకా ఆ అనుభూతిలోనే మునిగి తేలుతున్నారని వాళ్ళను చూస్తేనే తెలుస్తోంది. స్వామితో పాటుగా దిగుతున్నారొక పెద్దాయన, పొంగుకొస్తున్న అనుభూతిని తనలో ఇముడ్చుకొనలేక పోతున్నారు కాబోలు స్వామి చేతులు పట్టుకొని, 'మాష్టరుగారూ' మీరివాళ మరీ కాసేపే మాట్లాడారు మరీ అంత లోనే ముగించేస్తే ఎలా ? ఇది నా మాటగాదు ఇక్కడ చేరిన వారందరి మాట, మనలో మాట. అసలు అందరూ వచ్చేది మీ మాటలు విందామనే కదా! ఈ సారికి ఏదో ఇలా అయిపోయింది వచ్చేసారైనా మీరెక్కువసేపు మాట్లాడాలి. గంటల కొలది మాట్లాడాలి' అన్నారు.

చిరునవ్వుతో ఇలా అన్నారు స్వామి : ఏమిటీ ! గంటల కొలది మాట్లాడాలా ? మనకున్న గంటలే కొలది కదా ! ఈ కొలది గంటలు మాట్లాడటానికే అయిపోతే ఇంక మనం పనిచేసే దెప్పుడు ?'

'అదిగో చెణుకు వేశారు మీరు ! అసలా చెణుకుల కోసమే కదా మిమ్మల్ని వదలలేని స్థితిలో మీ వెంట మేమంతా పోయేది, అయితే నాదొక చిన్న విన్నపం ! మాటలాడటానికే సమయాన్ని కేటాయిస్తే ఇంక పని ఎప్పుడు ? అన్నారు మీరు ! మామూలు అర్థంలో మీరన్నమాట కరక్టే. మీ విషయంలో మాత్రం చెప్పవలసింది వేరేఉంది. మీరు మాటలాడటం కూడా పని చేయడమే అవుతుంది. చూడండి మీ మాటలు మా మీదెంతగా

పనిచేస్తుంటాయో ! వందలవేలమందిని కర్తవ్యోన్ముఖులను చేసే మాటలు కదా మీవి, మరి ఆ మాటలాడటం కన్నపని ఇంకే ముంటుంది చెప్పండి, అసలు మాటలాడటమే నిజమైన పని. ఎందుకనంటే ఈ మాటలు శతాబ్దాల తరబడి మానవాళిమీద పని చేస్తూనే ఉంటాయి కనుక. మానవాళిచేత పనిచేయిస్తూనే ఉంటాయి కనుక.

'బాగా చెప్పారే !' అంటూ ఆయన భుజాన్ని చిన్నగా తట్టి ఇలా అన్నారు స్వామి 'చిన్నమాట ! ఆ మాటలకా శక్తి ఎక్కడనుండి వొచ్చిందంటారు. పని చేస్తూ చెబుతున్నాము కనుక ! అందుకే అంత శ్రద్ధగా వింటున్నారు. అంత శ్రద్ధగా వింటున్న పుడు ఏం మాట్లాడాము అన్నది ముఖ్యం తప్ప ఎంతసేపు మాట్లాడామన్నది ముఖ్యంకాదు కదా ! ఇది ఊకదంపుడుంకాదు విత్తనాలను చల్లడం. ఏముంటాది ? విత్తనాలు ఎంతబాగున్నా క్షేత్రానికి సరిపడే చల్లుతుంటాము కదా !

'మాస్టరుగారూ ! మిమల్ని మాటలలో జయించగలవారెవరు ? మిమల్ని జయించటం మాటలా ? చెప్పండి. ఇదిగో ఈ మాటలు, మీ మాటలు నాడైరీలోకి వెళ్ళిపోతున్నాయి అన్నారాయన ఆనందంగా, డైరీని జేబులోనుండి పైకితీస్తూ.

'డైరీలోకేకాదు డైలీ లైఫ్ (Daily life) లోకి కూడా వెళ్ళిపోతాయవి' అన్నారు స్వామి.

'అందుకేగా మాస్టరుగారూ చెవులు పెట్టిపేసుకొని మేమంతా మీ వెంట నిలిచేది' అంటూ ఆ పెద్దాయన పారవశ్యంతో చేతులు జోడించి, శిరస్సువంచి, నమస్కరించి శెలవుతీసుకున్నారు.

# గుండెగల వాళ్ళిప్పుడు కావాలి

'మీరిక్కడే ఉండిపోతున్నారు. అన్నివైపులకు కదలి రావలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ మాట మీకు మేము వేరుగా చెప్పనక్కరలేదనుకోండి, కానీమనవి చేసుకుంటున్నాము. ఎప్పుడిగానైనా మీరాలోచించాలి. మమ్మల్ని కూడా అనుగ్రహించాలి. ఈ విజయవాడ ఇంత అదృష్టానికి నోచుకున్నందుకు మాకెంతో ఆనందంగా ఉంది. మా ప్రాంతాలకు కూడా ఈ అదృష్టంపట్టాలని మా కోరిక.

నాదేముంది 'అది మీ చేతులలోనే ఉంది' అన్నారు స్వామి చిరునవ్వు నవ్వుతూ.

అంతవరకూ అభ్యర్థిస్తూ వస్తున్న అవతలి వ్యక్తి కొంచెం ఆశ్చర్యంగా ముఖంపెట్టి స్వామి వైపు అలా అలా చూస్తున్నారు.

కొద్ది క్షణాల మౌనం తర్వాత ఇలా అన్నారు స్వామి: అది మీ చేతులలోనే ఉంది. మీరు గట్టిగా నిలబడితే తప్పకుండా జరుగుతుంది. అనబడినపుడు, మనస్సు పులకించినపుడు మాత్రం ఇలా జరగాలని కోరుకుంటూ, ఆ తర్వాత మరచి పోకూడదు. ఇలా జరగడానికి కావలసిన విధంగా మిమ్మల్ని మీరు మలచుకుంటూ ఉండాలి. ఆ మలచుకోవడం నిరంతరంగా సాగాలి.

ఇక్కడ కొంతమంది గట్టివాళ్ళు నిలబడ్డారు. ఇక్కడ పని జరుగుతున్నది. ఎక్కడ నిలబడితే అక్కడ పని జరుగుతుంది. మీరు గుండెగలతో ఎసరు పెట్టండి. ఎసరు తెర్లేనాటికి బియ్యం

చేయడానికి తప్పక వస్తాను. మీరు గుండిగలనే పెట్టలేకపోతే నేనేలాగాగలను ? కాబట్టి మీ కోరికను కృషిగా మార్చండి. ఆ కృషి తప్పక ఫలిస్తుంది. గుండిగల వాళ్ళిపుడు కావాలి. గుండె గల వాళ్ళిపుడుకావాలి, ఏమంటారు ?

స్వామి వదనం సరస గంభీరంగా ఉంది.

అవతలి వ్యక్తి కొద్ది క్షణాలపాటు అలాగే ఉండిపోయాడు. కొంత సేపటికి తేరుకుని 'అలాగే మీరన్నట్లుగా గుండిగలవాళ్ళుగా, గుండెగలవాళ్ళుగా రూపొందే ప్రయత్నంలో ఉంటాము మమ్మల్ని ఆశీర్వదించండి' అన్నాడు.

మంచి పనికి ఆశీస్సులు ఎప్పుడూ ఉంటాయి. అని వెన్ను తట్టారు స్వామి.

స్వామి నుండి శెలవునందుకొని బయలు దేరాడాయన. ముందుకు అడుగులు వేస్తూ తనను సాగనంపుతున్న సోదరునితో అంటున్నాడు 'అదిగో ఆ మాటల కోసమేనండీ ఇంతదూరం వచ్చేది, చూశారా ! ఒక్కమాటను మలుపు తిప్పుతూ మన జీవితాలనే మలుపు తిప్పుతున్నారాయన. అందుకే అన్నారు ఈ మాటలను మంత్రాలని.

# లైట్‌గా తీసుకోవడం కాదు లైటుగా తీసుకో

'ఏం అలా చూస్తున్నావు? ఇంతఘాటుగా మాట్లాడుతున్నా నేమిటీనా? తల్లిదండ్రులు కూడా ఎప్పుడూ ఇలా అనలేదే. మరి ఈయనిలా అంటున్నాడేమిటా అనా?' అంటూ స్వామి ఎదురుగా తలవంచుకుని చూస్తున్న యువకునివైపు చూస్తున్నారు.

కొంతసేపు నిశ్శబ్దంగా నడిచింది. ఆ నడచినకాలం చాలా భారమనిపించింది. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ 'ఏం? మాట్లాడవేం?' అన్నారు స్వామి.

'లేదండీ నేనేమి అనుకోవడంలేదు. మీరు ఎప్పుడు ఏమన్నా నేను లైట్‌గానే తీసుకుంటాను. అంతలోనే మరచిపోతానండి' అన్నాడాయువకుడు తానేదో మంచిపని చేస్తున్నట్లు.

చురుక్కుమన్నట్లు చూస్తూ ఇలా అన్నారు స్వామి 'అదే నీతో వచ్చిన ఇబ్బంది. లైట్‌గా తీసుకుంటావు తప్ప 'లైటుగా ఎందుకు తీసుకోలేవు? అంతలోనే మరచి పోతావు తప్ప అన్నవి గుర్తుంచుకొని నిన్ను నీవెందుకు మలచుకోలేవు?'

కొంతసేపు మళ్ళీ నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దంలో కొంత ప్రశాంతత. స్వామి మళ్ళీ ఇలా అన్నారు: అర్థమైందా? నీవెక్కడ తప్పులో కాలువేస్తున్నావో! మాస్టరుగారు తిడుతున్నా నేను పడుతున్నాను, అందరిలా నేను పట్టించుకోవడంలేదు అనుకుంటున్నావు తప్ప, ఎందుకు తిడుతున్నారని ఎప్పుడైనా ఆలోచించావా? ఒక్కసారి మందలించినపుడు కారణాన్ని గమనించి సరిదిద్దుకుంటే

మళ్ళీ మళ్ళీ మందలించవలసిన అవసరం ఎందుకొస్తుంది ?
అందుకే అన్నది లైట్‌గా అంటే తేలికగా తీసుకోవద్దు లైట్‌గా
అంటే వెలుగుగా తీసుకోమని నేనన్నమాటలు. నీకలాంటి వెలుగై
నీకు దారి గోచరించినవేళ ఇక మరచి పోవడముండదు. మరచు
కోవడమే ఉంటుంది ఏమంటావ్ ?

'నిజమే మాస్టారూ !' అన్నాడతడు చెప్పబడిన నిజంలోనికి
మేల్కొంటున్నట్లుగా కనబడ్డాడు.

వీపు మీద చిన్నగా తట్టి చిరునవ్వుతో అన్నారు స్వామి:
అమ్మయ్య ! గ్రహించావుకద. ఈ సత్యాన్ని నీవెప్పటికి గ్రహి
స్తావా ? అని చూస్తున్నాను. ఇక నా మాట నీ బాట కావాలి. ఇలా
నానోటి వెంట మాటవస్తే అది అలా నీ కనులముందు బాటై నీవు
ముందుకు సాగాలి. అందుకు ఇంతా చెప్పింది.

ఆ యువకుడు స్వామి పాదాలపై వ్రాలిపోయాడు. అతని
కనులు అనుభూతి బాష్పాలతో ఆ పాదాలను కడుగుతున్నాయి.

# ఆర్టికిల్

'ఇన్నాళ్టికా మీరు కనబడేది. ఇంతకీ మీ ఆర్టికల్ తెచ్చారా? సావనీర్ పని పూర్తయిపోతోంది. మీరేమో కనబడరు. వెతికినా దొరకరు' అన్నారు స్వామి ఎదుటనున్న మిత్రుణ్ణి మందలింపులో ప్రేమను మేళవించి.

'క్షమించాలి మాస్టారూ! నా సంగతి మీకు తెలియందేముంది? ఈ సంస్థలు, సంస్థల సభలు, సభలకు వక్తలు, ఆ వక్తలకోసం తిరగడాలు ఇలా తిరగడానికే టైమంతా ఖర్చై పోతోంది. ఈ హడావిడుల్లోపడి మీకిచ్చిన మాట నిలుపుకోలేక పోయాను. నిలుపుకోలేక పోయాను కదా అన్న సిగ్గుతో మధ్య మధ్యలో కొద్దిపాటి అవకాశాలు దొరికినా మీ ముందుకు రాలేకపోయాను. ఒక వారం గడువివ్వండి. అన్న ప్రకారం ఆర్టికల్ తీసుకురావడానికి ప్రయత్నిస్తాను!' అన్నాడాయన ప్రతిమాలుతున్నట్లుగా పలుకుతున్న గొంతుతో.

సరస గంభీరంగా అతని వైపు చూస్తూ స్వామి ఇలా అన్నారు: "ఆర్టికల్ సంగతి సరే, ఈ ఏటికి కాకపోతే వచ్చే ఏటికి వ్రాస్తారు. నా బాధంతా ఏమిటంటే అర్థంలేని ఈ తిరుగుళ్ళలో పడి మీలోని ఆర్ట్ అంతా కిల్ అయిపోతుందే అని! భగవంతుడు మీకిచ్చిన ఆర్ట్‌ను ఇలా సంస్థలని, పదవులని తిరుగుళ్ళని అంటూ కిల్ చేయవచ్చునా? చివరికి మిగిలిపోయేది అదేనండి ఆ ఆర్టే! ఈ సంస్థలు, పదవులు అన్నీ కాలగర్భంలో కలిసిపోతాయి ఏమంటారు?"

"నిజమే మాస్టారు, మీరన్నది. అక్షరాలా నిజం. ఇటీవల ఇవన్నీ తగ్గించుకోవడానికే ప్రయత్నిస్తున్నాను. మీకు దగ్గరైనప్పటినుండీ ఏది నిలిచేదో, ఏది నిలువనిదో తెలుస్తూనే ఉంది మనస్సుకి, కాని అభ్యాసదోషం కొంత, చుట్టూ ఉన్న వాతావరణం కొంత, పనిచేయుటంలో నాకింకా లంగరు అందడం లేదు. ఇదిగో ఇవాళ మీరు నాపైన సంధించిన బాణాలతో నా మనస్సుకు మరింతస్థాయి చిక్కి ఇక లంగరు అందుతుంది అనిపిస్తోంది. అందుకు మీ ఆశీస్సులు కావాలి." అన్నారాయన చేతులు జోడిస్తూ.

'ఇప్పటిదాకా అందింపబడినవేమిటి ?' అన్నారు స్వామి తృప్తిగా చూస్తూ.

"అర్థమైంది ఇంతకంటె ఆశీస్సులు ఇంకేముంటాయి. నేనదృష్టవంతుణ్ణి. మీ మనస్సులో నాకామాత్రం చోటు దొరికినందుకు. నేను దగ్గరకారేక పోతున్నా మీరు మాత్రం నా గురించి ఆలోచిస్తూనే ఉన్నారు. అది నా అదృష్టం" అన్నాడాయన విన్రముడై.

"అవును ఆలోచిస్తూనే ఉంటాను. ఆ ఆలోచన మీరెంత దూరాన ఉన్నా మిమ్మల్ని చుట్టుకొని, గట్టిగా పట్టుకొని మిమ్మల్ని నా దగ్గరకు తీసుకువచ్చి పడవేస్తుంది. ఇది తప్పదు. ఏమంటారు ?"

స్వామి విచ్చిన కన్నులతో చూస్తున్నారు. ఆత్మవంతులై భాసిస్తున్నారు. 'అవునవును. 'ఇది మాకు స్వానుభవమేకదా ! అన్నాడామిత్రుడు. అదో విధమైన అనుభూతి చెందుతూ, లోలోన గిలిగింతలు పొందుతూ.

# వ్యక్తి కాదది వెర్రి

'ఏమిటో ఈ మధ్య కనబడటం తగ్గించావ్ ?' అన్నారు స్వామి తమను సమీపిస్తున్న ఒకామెను చూస్తూ

"ఏముంది మాస్టారూ మనసంతా వ్యక్తిగా ఉంది. ఎటూ కదలబుద్ధికాక అల్లాగే ఉండిపోయాను." ఇంట్లో అన్నదామె.

'బాగుంది ఎందుకంత వ్యక్తిపాపం.' అన్నారుస్వామి

మీకు తెలియనట్లడుగుతారేమిటి మాస్టరుగారు. నేను మళ్ళీ మళ్ళీ చెప్పాలా ? ఏమిచెబితేమాత్రం ఏం లాభం ? ఆయనలో లేశమాత్రమైనా మార్పురావడంలేదు. పైకపోగా ఇది వరకటికన్నా ఇంకా దిగజారుతున్నారనిపిస్తోంది. ఇక మనసంతా వ్యక్తిగాక ఏమవుతుంది ? చెప్పండి. అన్నదామె.

సూటిగా ఆమె కనులలోనికి చూస్తూఇలా అన్నారుస్వామి: దీనిని వ్యక్తి అనరు. వెర్రి అంటారు'

ఆమె అవేదనతోకూడిన ఆశ్చర్యంతో స్వామివైపు చూస్తున్నది. కొంచెంసేపు ఆమెనలాచూడనిచ్చి, స్వామి ఇలా అన్నారు: అతను నిన్ను అర్థం చేసుకునేపరిస్థితుల్లోలేడు. నీవు అతనిస్థాయికి దిగలేవు. నీ స్థాయికి అతన్ని పెంచలేవు. పట్టించుకోకుండా ఉండమంటే ఉండలేవు. దానితో ప్రతిదానికీ ఘర్షణ. దాని ఫలితం ఈ వ్యక్తి. వెర్రి'.

'అయితే ఏం చేయమంటారు' అన్నట్లుగాచూసిందామె ఆ చూపునందుకొని స్వామి ఇలా అన్నారు: ముందుపట్టించుకోవడం తగ్గించు. దానితో ఘర్షణతగ్గుతుంది. నువ్వుపట్టించుకుంటున్నావు కాబట్టి ఆతను మరీ మరీ నస పెడుతున్నాడు. పట్టించుకోవడం తగ్గించావనుకో ఎన్నాళ్ళని నసపెడతాడు ? ఎవరైనా ఉడికే వాళ్ళనే ఉడికిస్తారు. మనమప్పులిక్కడ ఉడకవు అని తెలిసిన

తర్వాత వాళ్ళే సర్దుకుంటారు. అతడికి కావల్సింది చేసిపెట్టు. అతడంటున్నది మాత్రం వినబోకు. అప్పుడు ఘర్షణలుండవు. ఈ వర్రీలుండవు.

వినిపించుకోకుండా ఉండటం ఎలా సాధ్యం ? అని నీవడుగ వచ్చు. మనస్సును 'హయ్యర్ పర్పస్' వైపుకు మళ్ళించు. ఒక ఉన్నతమైన ఆశయానికీ, ఉత్తమమైన సేవాకార్యక్రమానికి నివంకితమైననాడు ఇక అవన్నీ నీవు పట్టించుకోమన్నా పట్టించు కోవు. కనుక, అవి సర్దుకున్న తర్వాత ఈ మంచి పనులు చేద్దా మనుకోకాక. మంచిపనులుచేయడం మొదలుపెట్టు. శ్రద్ధతో చేస్తూఉండు. పరిస్థితులిక అవే దారిలోకివస్తాయి.

ఎలా వస్తాయి ? అని చూస్తున్నావుకదూ ? ఎప్పుడైతేనీవు సత్కర్మాచరణకు అంకితమయ్యావో అప్పుడు క్రమంగా నీచూప్పు రేఖలు మారిపోవడం మొదలుపెడతాయి. వాళ్ళిక సతాయిద్దా మనుకున్నా సతాయించలేరు. అలా వారిని వారించగలిగినట్టి దివ్య తేజస్సు నీనుండి వ్యక్తమవుతుంది. అప్పుడిక వాళ్ళు అందాలని ఉన్నా అనలేరు. మరీ కుసంస్కారులైతే ఎదురుగా అనలేని స్థితిలో ఉన్నారు గనుక చాటుగా గింజుకుంటారు. పోనీ, గింజు కోనీ, మనకేమీ ఇబ్బందిలేదుకదా ! ఘర్షణలకు అవకాశంలేదు కదా ! అందుకే నీవుపడుతున్న వర్రీని నేను 'వెర్రి' అన్నాను. ఇంత చక్కటి మార్గముండగా వర్రీపడుతున్నావంటే వెర్రిగాక మరి ఏమిటి ?

ఆ మాటలకు ఆమె తేరుకున్నది. ఆమె ముఖంలో తిరిగి ప్రశాంతత నెలకొన్నది. చెప్పినట్లు చేద్దామనే నిర్ణయం ఆమెలో కనబడుతున్నది.

## ఖాళీలేదు అంటే మన పనే ఖాళీ !

డిస్పెన్సరీకి ఆ మధ్య రెగ్యులర్‌గా వచ్చేదానివి. ఈ మధ్య కనబడటం మానేశావేమిటి ? నీలో కూడా మన జాతి లక్షణం పైకుబికినట్లుంది. "ఆంధ్రులు ఆరంభశూరులు" అని పెద్దలు మనకొక సర్టిఫికేట్ ఇచ్చారు. పెద్దలమాటను వమ్ముచేస్తే ఎలా ? అన్నట్లుగా ఉంటుంది మనవాళ్ళ ప్రవర్తన. నీవూ ఆ జాబితా లోనికి జారుకున్నట్లున్నావు ! అన్నారు స్వామి.

'ఎక్కడ మాస్టారూ ! ఎంత ప్రయత్నించినా అసలు ఖాళీనే దొరకడం లేదండీ' అన్నదామె.

'నువ్వు చెప్పిందితప్పు. ప్రయత్నిస్తే నీకు ఖాళీ దొరికేదే. నీవు ప్రయత్నించటంలేదు. అయ్యో ! వెళ్ళలేకపోతున్నానే ! అని మాత్రం అనుకుంటున్నావు. అదైనా అప్పుడప్పుడు. ఆ అనుకోవడాన్నే నీవు ప్రయత్నమనుకుంటున్నావు. ధృఢసంకల్పంతో మనం ప్రయత్నించాలే గాని, ఆ మాత్రం ఖాళీ దొరక్కపోతుందా ?

'చూడు మనం చేయనంత మాత్రం చేత ఏ పనీ ఆగదు. చేయగలిగితే ఆ తృప్తి మనకు దొరుకుతుంది. ఖాళీలేదు అంటే మన పనే ఖాళీ అవుతుంది.' అన్నారు స్వామి.

ఆమె సిగ్గుతో తలవంచుకుంది.

# వీలు చూసుకుని కాదు-వీలు చేసుకుని రండి

వైద్యశిక్షణ తరగతులు జరుగుతున్నాయి. ఒక రోజున క్లాసు పూర్తి కాగానే స్వామి ఇలా అన్నారు విద్యార్థులనుద్దేశించి: కేస్‌షీట్ ఎలా తయారుచేయాలి అన్నది మీకు చెప్పబడింది. రేపటినుండి కార్యాలయంలోని వైద్యాలయంలో మీరు కేస్‌షీట్లు తయారుచేయవచ్చు. ఈ సందర్భంలో నేనొక మాట చెబుతాను. ఈ శిక్షణ తరగతులలో మీరెలా పాల్గొంటున్నారో, వైద్యాలయాలలోకూడా మీరు అలాంటిసేవ చేయవలసి ఉంటుంది. వీలు దొరికినప్పుడు వద్దామనుకోకండి. అలా అనుకున్నవారికది కనబడదు. వీలుచేసుకొని రండి. వీలు చేసుకోవడం అలవాటుచేసుకోండి. అప్పుడు మాత్రమే మీరు రాగలుగుతారు, లేకపోతే ఈ కాలచక్రమున్నదే అదే టైమ్ అనే వీల్. అది గిర్రున తిరిగిపోతుంది. మనకు మాత్రం వీలు దొరకదు. కనుక వీలుచూసుకుని కాక వీలుచేసుకొనిరమ్మని సోదరులకు నేను సవివరంగా చెబుతున్నాను.

ఆ మాటలు వారికి నచ్చాయి. ఎందువల్లనంటే మానవ జీవితాలలోని సూక్ష్మాంశాలనుపట్టిచూపి, ఆచరణకు కావలసిన వెలుగును అందిస్తున్నాయి కనుక:

# తీరిక లేదు అంటే తీరు ఇక లేదు అని

'పదిమందికి పనికివచ్చే మంచిపనిని పదిమందీకలసి చేస్తుకుందాం రండి !' అని పెద్దలయినవారు దిగివచ్చినప్పుడల్లా ప్రజలకు పిలుపునిస్తూనే ఉన్నారు, విన్నవాళ్ళల్లో చాలామందికి ఆ మాటలు నచ్చుతూనే ఉన్నాయి. కాని, ఆ బాటలో మాత్రం ఎక్కువమంది నడవలేకపోతున్నారు. కారణం, మాటలు నచ్చడానికి కాస్తంత సహృదయం ఉంటేచాలు. ఆ బాటలో నడవడానికి మాత్రం బోలెడంత తయారీకావాలి. దృఢసంకల్పం ఉండాలి. గాఢవిశ్వాసం కలగాలి. నిరంతరం అభ్యాసం జరగాలి. ఇవన్నీ ఎక్కడినుండి తెచ్చుకుంటాం. ఇలాంటివి ఎన్నని అలవరచుకుంటాం !' అని ఒద్దికించి, మనిషి, "మంచిపనికి రావయ్యా." అన్నప్పుడల్లా 'ఎక్కడండీ, తీరికలేదు.' అంటాడు.

చూడండీ ! తీరికలేదు అంటే, తీరు ఇకలేదు. ఇక ఇప్పట్లో రాదు. దానినంతత్వరగా మేముురానివ్వం. అని అర్థం. చూశారా! అతడంటున్న మాటలలోనే అతడుంటున్నస్థితికూడా ఉన్నది. అది అలా అతడినుండి అప్రయత్నంగా పలుకబడుతున్నది. సరస్వతి ఉన్నదే, ఆమెచాలా చిత్రమైనది సుమా !

కనుక, ఈ మాటలు వింటున్న మీరు పిలుపు వినబడినప్పుడు తీరికలేదని ఇంకెప్పుడూ అనరని నేను అనుకుంటున్నాను. తీరికదొరకాలీ అంటే, మన తీరు ఇక మారాలి. పైన చెప్పిన అన్ని లక్షణాలనూ కోరి మనం అలవాటుచేసికోగలగాలి! అంటూ సోదరబృందాన్ని మృదువుగా మందలించారు. సున్నితంగా హెచ్చరించారు. నాజూకుగా నచ్చచెప్పారుస్వామి ఒకానొక శుభ సందర్భంలో.

# ఆకర్షించడం కాదు ఆరాధించడం జరగాలి

సాయం సమయం. కార్యకర్తల మధ్య స్వామి కూర్చొని ఉన్నారు. కార్యక్రమాల విస్తృతిపై తీసుకొనవలసిన మెలుకువలను గూర్చి ప్రస్తావన జరుగుతోంది.

ఒకరిలా అన్నారు ! మన కార్యక్రమాలలోనికి యువకులను పెద్దసంఖ్యలో ఆకర్షించాలి. దానికి కావలసిన చర్యలను మనం వేగంగా చేపట్టాలి.

స్వామి ఇలా అన్నారు: ఆకర్షించాలి అన్న పదం అంత మంచిది కాదు. ఆకర్షించే ప్రయత్నమూ అంత మంచిదికాదు. జరగవలసింది. ఆకర్షించడంకాదు ఆరాధించడం.

మాట్లాడుతున్న వానితోపాటు మిగిలినవారుకూడా తాము అనుకుంటున్నది తప్పు అని తెలుసుకుంటూ నాలుక కరుచుకున్నారు.

కొద్దిక్షణాల తర్వాత స్వామి ఇంకా ఇలా అన్నారు : ఆకర్షించడం అన్నది మనిషిలో దాగి ఉన్న స్వార్థాన్ని సూచిస్తుంది. ఆరాధించడం అన్నది మనిషిలో వెలుగుతున్న పరమార్థాన్ని సూచిస్తుంది. అవతలివ్యక్తినుండి ఏదయినా ఆశించి చేరదీసినప్పుడు అది ఆకర్షించడం అవుతుంది. అవతలి వ్యక్తి కూడా ఈ యజ్ఞార్థ కర్మలో పాలుపంచుకొని ధన్యత పొందాలని చేరదీసినప్పుడు అది ఆరాధన అవుతుంది. అందాకా ఎందుకు ? మీరందరూ ఇక్కడకు ఎలా చేరారు ? మిమ్మల్ని వీరంతా

ఆకర్షింపబడ్డారు అనవచ్చునా ? అలా అనబడడానికి మీరు అంగీకరించగలరా ? మరి మిగిలినవారిని ఆకర్షించాలని మీరెలా అప్పగలుగుతున్నారు ?

నాకు తెలుసు, మీ మనస్సులోని ఉద్దేశం అది కాదని. తెలియకనే ఆ పదం అనేశారని. కాని తెలియకనే కూడా వాడవలసిన పదంకాదది, అందుకనే ఇంతగా తెలియచెప్పవలసి వచ్చింది.

'ఇక యువకులు పెద్ద సంఖ్యలో చేరరావాలి అన్నది మీ కోరిక. అదెలా జరుగుతుందో వివరిస్తాను వినండి. ఇప్పటికి చేర వచ్చిన యువకులున్నారు కదా !వారి విషయంలో మనం బాధ్యతపడి, వారిని తీర్చిదిద్దడమనేది జరిగినపుడు చేరవచ్చే యువకుల సంఖ్య ఆటోమేటిక్‌గా పెరుగుతుంది. అంటే మనం చేస్తున్న కృషికి ప్రకృతిమాత మెచ్చి మరింతమంది యువకులను మనకు అప్పచెబుతుంది. ఏమంటారు !

కనుక ఇప్పుడు మన కర్తవ్యం మన ఎదురుగానే ఉన్నది. ఎప్పుడైనా అంతే! ఎవరి కర్తవ్యం వారి ఎదురుగా ఉంటుంది. దానిని శ్రద్ధతో నిర్వహించినకొద్దీ మరిన్ని బాధ్యతలను అనగా లోకహిత కార్యక్రమాలను ప్రకృతిమాత వారికి అప్పగిస్తుంది. చేయవలసినదేమిటో అని ఎదురు చూడవలసినపనిలేదు. ఎదురుగా చూస్తేచాలు మనం చేయవలసినది మన ఎదుటనే ఉంచబడుతున్నదనీ, అది చేసినపుడే మరొకటి మనకు అప్పగించబడుతుందని మనం గుర్తించవలసి ఉంది.

కాబట్టి మనతో ఉంటున్న యువకులపైపు దృష్టిని పెట్టండి. వారిశక్తియుక్తులకు పదును పెట్టండి. వారిని అన్ని విధాలా ప్రయోజకులనుచేయండి. ఆత్మవిశ్వాసం కలిగి వాళ్ళకాళ్ళమీద వాళ్ళు నిలబడి తమకు, తమకుటుంబానికీ, ఈ సమాజానికీ పనికి వచ్చేవాళ్ళుగావారిని తీర్చిదిద్దండి. ఈ కృషిలో మనముంటగా అలా తీర్చిదిద్దబడవలసిన యువకులను ప్రకృతిమాతే పెద్ద సంఖ్యలో మన చెంతకు ప్రవేశపెడుతుంది.

చుట్టూ ఉన్న సోదరులందరూ స్వామిపైపు తృప్తిగా చూస్తున్నారు.

'బండిని ఏ మాత్రం పట్టాలు తప్పనివ్వడు మన స్వామి' అన్నట్లుగా ఉన్నాయి వారి చూపులు

## విల్లునం ఎక్కు పెట్టండి

"ఈ మధ్య క్రొత్త బాధ్యతలు దిన చర్యను అతిక్రమించడంతో ఇక్కడకు అంతగా రాలేకపోతున్నాను. కాని మనసంతా ఇక్కడే ఉంటుంది. అవకాశం ఉన్నంతలో మీరు నాకప్పగించిన పనిని చేస్తూనే ఉన్నాను. కాని మునుపంతగా కార్యక్రమాల్లో పాలు పంచుకోలేకపోతున్నానే అన్న బాధ మనసుకు కలుగుతూనేఉంది, కాలమే మళ్ళీ వీలును కల్పించాలని ఎదురుచూస్తున్నాను." అంటూ సోదరబృందంలోని ఒకామె తమ పరిస్థితిని వివరించసాగారు.

కొద్దిక్షణాల నిశ్శబ్దం తర్వాత ఆ నిశ్శబ్దాన్ని శబ్దంగా రూపొందిస్తూ ఇలా అన్నారు స్వామి: 'నీకొక చిన్న సూక్ష్మం చెబుతాను. ఒకప్పుడు మన కార్యక్రమాలపై మనం ఎక్కువ సమయాన్ని వెచ్చించగలిగి ఉండవచ్చు. మరొకప్పుడు అనుకున్నంత సమయాన్ని వెచ్చించలేకపోవడం జరగవచ్చు. అయినప్పటికీ ఎల్లప్పుడూ ఒకే రకమయిన శ్రద్ధ మన ఉద్యమం ఎడల మనకుండాలి. శ్రద్ధ మానసికమైనది. అది వ్యక్తంకావడానికి ఏ అడ్డూ ఉండదు. భౌతికంగా అవకాశమున్న మేరకు వొళ్ళు దాచుకోకుండా పనిచేస్తూనే మానసికంగా నిరంతరమైన శ్రద్ధా, దీక్షలను మనం కలిగిఉండాలి. అలా మనం కలిగిఉన్నపుడు భౌతికంగా మనం కార్యక్రమంలో లేకపోయినా మన సంకల్పం ఆ కార్యక్రమానికి దోహదంచేస్తూనే ఉంటుంది. నీకు తెలుసునో తెలియదో! దినచర్యలో మనకిక్కడ పెద్దగా కనిపించకుండానే ఈ ఉద్యమం విశ్వవ్యాప్తం కావాలనీ, చిరకాలం వర్ధిల్లాలని దృఢంగా సంకల్పించి, కనబడకుండానే మనతో చేతులు కలుపుతున్నవారు ఎందరో ఉన్నారు. వారు గుర్తుకువచ్చినప్పుడల్లానాకనిపిస్తూ ఉంటుంది. 'వారందరిసంకల్ప బలమే ఈ సత్కార్యాచరణమనే యజ్ఞానికి తగిన వాతావరణాన్ని మనకు కల్పిస్తూ ఉన్నదని. కనుక సంకల్పం ముఖ్యం, సంకల్పమున్నపుడు పని చేసేటందుకు దారులుకూడా వాటికవిగా రూపుదిద్దుకుంటూనే ఉంటాయి.

ఇంకొకమాట చెప్పనా? మానసికంగా ఉద్యమం ఎడల భక్తిశ్రద్ధలు దృఢ సంకల్పం లేకుండా మొహమాటానికో లేక ఏదైనా ప్రయోజనాన్ని ఆశించో రోజువారీ కార్యక్రమాల్లో నలుగురికి కనపడేటట్లు పాల్గొనేవారికన్నా నేను పైనచెప్పిన కేటగిరి

ఉన్నారే వాళ్ళవల్లే ఉద్యమానికి ఎక్కువ ప్రయోజనం చేకూరుతూ ఉంటుంది.

ఏతా, వాతా తేలిందేమంటే మానసికమైన కమిట్‌మెంట్ ముఖ్యం. ధృడసంకల్పం అంటే ఇంగ్లీషులో మనమంటామే విల్ పవర్ అని. అది కలిగి ఉండడం ముఖ్యం. కనుక మనమెవరం ఎక్కడఉన్నా మనముద్దేశించిన ఉద్యమంకోసం మనలోని విల్లు (విల్)ను ఎక్కుపెట్టి ఉండటం ముఖ్యం. కనుక ఆ విల్లును ఎక్కుపెట్టండి.' అని ఆమెను ఆశీర్వదించిపంపారు స్వామి.

## మార్చడం కాదిది మలచడం

ఇక్కడకు ఒక్కరోజు రాకపోయినా నాకేమిటోగా ఉంటుంది ఇక్కడకు వచ్చి కొంతసేపయినా పనిచేసివెళితే ప్రాణానికి ఏమిటో హాయిగా ఉంటుంది. ఒక్కొక్కపుడు అనిపిస్తూంటుంది నన్ను మీరెంతగా మార్చేశారాని !

అలా అంటున్న ఆమెపైపు చూస్తూ స్వామి ఇలా అన్నారు! ఇక్కడ మార్చడం ఉండదు. మలచడముంటుంది. శిలను శిల్పంగా తీర్చిదిద్దే శిల్పి ఏంచేస్తున్నాడు ? ఆ శిలను శిల్పంగా మలుస్తున్నాడు. ఇదీ అలాంటిదే. శిల్పంలో ఉన్నది కూడా శిలే. శిల్పి క్రొత్తగా తెచ్చిపెట్టింది ఏమీలేదు. కాని తన పనితనం వల్ల, శిలను మలచిన శిల్పి ఆ శిల్పం నుండి ఎన్ని అందచందాలను ఒలికింపచేస్తున్నాడు. గురుశిష్య సంబంధం కూడా సరిగా అలాంటిదే !

ఒకప్పుడు నా విషయంలో అనుకున్న వారికి కూడా ఇదే జవాబు చెప్పాను. మాస్టరుగారి పరిచయం తర్వాత నన్ను చూసి 'మాస్టరుగారు మిమ్మల్నెంతగా మార్చేశారండి!' అనేవారు స్నేహితులు. ఇది మార్చబడటంకాదు. మలచబడటం అని జవాబు చెప్పేవాడిని ఎందువల్లనంటె మాస్టరుగారు ఏంచేస్తున్నారన్నది నాకు తెలుసును కనుక! ఆయన నా సిద్ధాంతాలను మార్చుకోమని నాకు చెప్పలేదు, తన సిద్ధాంతాలను ఏ మాత్రం నా మీద రుద్దలేదు. నా జీవితంలో నేనేం కావాలని కోరుకున్నానో అలారూపుధరించేటట్లుగా చేశారు. అది కూడా నా కోరిక మేరకు.

ఈ సందర్భాన్ని నాకిలా చెప్పాలనిపిస్తూ ఉంటుంది. దేశరక్షణ కోసం, తపనపడుతూ ముందుకుసాగుతున్న ఒక యువకుని చేరదీసి, అతన్ని సైనికుడిగా తీర్చిదిద్ది, దేశాన్ని రక్షించుకోవడానికి కావలసిన ఆయుధ సామగ్రిని కూడా అతనికి ఇచ్చి, వెన్ను తట్టి పంపించడం ఎలాంటిదో సరిగా నా గురువు నా విషయమై చేసిందలాంటిదే. నాలో పెల్లుబుకుతున్న తపనకు కావలసిన శిక్షణ నిస్తున్నారు. జాతి పునర్నిర్మాణానికి పనికి వచ్చే ఉపకరణాల నిస్తున్నారు. ఆశించినదానిని సాధించగలిగిన స్థితిలో నన్ను నిలబెడుతున్నారు. ఇప్పుడు చెప్పండి. దీన్ని మార్చడమంటారా? మలచడమంటారా?' అని నేను వాళ్ళకు చెప్పేవాడిని. అదే విషయం నీకు కూడా చెబుతున్నాను.

జరుగుతున్నది ఆమెకు బోధపడుతున్నది. ఆమె ఆ వెలుగునకు మరింత దగ్గరగా జరుగుతున్నట్లుగా కనబడుతున్నది.

## అడుగు పెడితే అడుగు తగలాలి

చేసేది ఏదో పూర్తిగా చేయండి. దిగేది ఏదో పూర్తిగా దిగండి. అడుగు పెడితే అడుగు తగలాలి. అడుగు తగలకుండా మధ్యలో ఆగితే తెలియని అశాంతి ఏర్పడుతుంది. ఏమిటా ఇలా ఉంది ? అనిపిస్తుంది. ఇప్పుడేం చేయాలి ? అనిపిస్తుంది. ఏమీ చేయనక్కరలేదు. ఆ అడుగు క్రిందకు దింపండి. అడుగు తగులుతుంది. మీ అశాంతి తొలిగిపోతుంది. జీవితంలో పట్టుకుదురు తుంది. సగమిటు, సగమటుగా వద్దు. అది మరీ దుర్భరస్థితి. అటో ఇటో తేల్చుకొని మరీ దిగండి. పూర్తిగా అటునా్న, పూర్తిగా ఇటునా్న ఫరవాలేదు. మధ్యలో నిలబడి అటూ ఇటూ చూస్తున్న ప్పుడే ఇబ్బంది.

మీకీ పద్ధతి నచ్చింది నూటికి నూరుపాళ్ళూ దీనికి తగినట్లు ప్రవర్తించండి. నచ్చలేదా ! నచ్చనట్టే ఉండిపోండి. అప్పుడు పెద్ద ఇబ్బంది ఏం ఉండదు. మధ్యలో మాత్రం నిలబడవద్దు. డైలమా అసలు వద్దు. కొంత నచ్చి కొంత నచ్చకపోయినా ఇబ్బందే. అంతా నచ్చికూడా నచ్చినట్లుగా బ్రతకడానికి సరైన ప్రయత్నం లేకపోయినా ఇబ్బందే. ఇది మనకు నచ్చింది అన్నప్పుడు దానికి తగిన ప్రయత్నం మననుండి జరగాలి నిరంతరం జరగాలి. మనం దాని వాళ్ళముగా బ్రతకాలి.

మనం ఈ ఉద్యమానికి సంబంధించిన వాళ్ళం అను కున్నప్పుడు ఏ పనులైనా ఉద్యమాన్ని దృష్టిలో పెట్టుకొని చేయాలి. అది చిన్న పని అవనీయండి. పెద్దపని అవనీయండి. ఉద్యమానికి చిన్నా పెద్దా తారతమ్యంలేదు. ఉద్యమం అను మతించడాన్నిబట్టిమన జీవిత సన్నివేశాలన్నీ దూపుదిద్దు కోవాలి. అప్పుడే మనం ఉద్యమకారులం కాగల్గుతాం. అలా జరుగనినాడు మనకు మంచి ఉద్దేశం ఉంటుంది తప్ప అది మంచి ఉద్యమంగా రూపుకట్టదు, కనుక సోదరులారా! ఉద్దేశం ఉద్యమ రూపం ధరించేవరకు మనం విశ్రమించకూడదు. అలా ఉద్యమరూపం ధరించేందుకుగాను మన జీవితాన్నే ఒక దీక్షగా స్వీకరించవలసి ఉంటుంది.' అంటూ స్వామి ప్రబోధించాడు సోదర బృందసమావేశంలో ఒకసారి.

# 'శ్రద్ధయా వర్ధతే విద్యా'

లోకంలో ఒక నానుడి ఉంది. 'స్పర్ధయా వర్ధతే విద్యా' అని. స్పర్ధ వలన విద్య వృద్ధిపొందుతుంది అని అర్థం. అంటే ఒకరి ఎడల ఒకరికి స్పర్ధ కలగడంతో పోటీపడి, కృషిచేసి జిజ్ఞాసువులైన వాళ్ళు ఆయా విద్యలలో రాటు తేలుతున్నారని దీని భావం. అంటే కాంపిటీషన్ అనేది ఏర్పడటం వృద్ధిలోనికి రావడానికి కారణమవుతోందని దీనిలోని భావన. మామూలుగా చూస్తే ఇది నిజమేననిపిస్తుంది. కొంచెం లోతులకు వెళ్ళి చూస్తే దాని కన్న మంచి దారి ఒకటి కనబడుతుంది.

పోటీపడే స్వభావం కలిగి ఉండటం వలన విద్యలలో రాటుదేలవచ్చుగాని అవతల వ్యక్తులపైన రాగ ద్వేషాలు కూడా అదే సమయంలో పెరుగుతున్నాయన్న సత్యం మనం మరిచిపోకూడదు. దీనితో ఇప్పటి కాలేజీలూ, విశ్వవిద్యాలయాల్లో కూడా ఒక విద్యార్థిని మరొక విద్యార్థి పరాయిగా చూడటం ఒకళ్ళ నోట్సులు ఒకరికి చూపించక పోవడంతోటీ విద్యార్థులు పడుకునేవరకు వాళ్ళకు కబుర్లు చెప్పి, అప్పుడు వచ్చి కూర్చొని తాను చదువుకోవడం ఇట్లాంటిలక్షణాలన్నీ వస్తున్నాయన్నమాట. లైబ్రరీ పుస్తకాలు ఇంకొకరికి దొరకనీయక పోవడం, ఆ పుస్తకాలలోని కొన్ని చాప్టర్స్‌ని చింపేసుకొని పోవడం మొదలైన

అవలక్షణాలు కూడ ఎన్నో వ్యక్తిత్వానికి ఒక రూపు దిద్దుకోవలసిన ఆ వయస్సులో ఏర్పడుతున్నాయి.

అలాకాక ఇంకొకదారి ఉన్నది అని చెప్పాను కదా! దాన్ని వివరిస్తాను చూడండి. ఈ విద్యను మనం శ్రద్ధతో అభ్యసించాలి. నేర్చిన విద్యతో ఈ లోకాన్ని మనం సేవించాలి. అన్న భావంతో విద్యను సమీపించడం జరగాలి. ఎప్పుడైతే లోకహితానికి ఉపయోగిస్తాము అన్న ప్రమాణం మనం మానసికంగా చేస్తున్నామో, అప్పుడు ఆ విద్య మనకు అరచేతి ఆమలకం అవుతుంది. అనగా మనలను అనుగ్రహిస్తుంది. మనను ఉపాధిగా స్వీకరించి, అది వెలుగై వెలుగుతుంది. కనుక సోదరులారా! విద్య ఎడల పవిత్రమైన భావనను కలిగి ఉండండి. నిరంతరమైన శ్రద్ధతో ఆ విద్యను అభ్యసించండి. అభ్యసించడంలో ఎంత శ్రద్ధ పెడుతున్నారో దానిని సద్వినియోగం చేయడంలోను అంతగానూ శ్రద్ధ పెట్టండి. స్పర్ధయా అన్న స్థానంలో శ్రద్ధయా అని వ్రాసుకోండి. అప్పుడు శ్రద్ధయా వర్ధతే విద్యా అన్నది మన మంత్రమవుతుంది. అంటూ సరిదారి చూపారు స్వామి సోదర బృందానికి ఒకానొక ప్రసంగంలో.

# 3. మాటల వైద్యం - మాత్రల వైద్యం

1. ఆవ- యావ
2. కంపెనీ సేక్-కంపెనీ షేక్
3. చుట్టపెడితే-చుట్టబెడుతుంది.
4. సరదా-జరదా.
5. జ్వరంకాదది వరం
6. కురుపులు కావవి తలుపులు
7. కలవరంగా ఉందా ! కల వరంగా ఉందా !
8. తరిగితే-తరుగుతుంది.
9. చెప్పమని చెప్పాడు.
10. బార్లీనీళ్ళు-బార్లోనీళ్ళు.
11. అవసరాన్ని గమనించగలం- అలసత్వాన్ని గ్రహించలేం.
12. ఆ పదం పనికిరాదు.

# ఆవ - యావ

తనకు మందు వ్రాసిన తరువాతకూడా ఒకామె వెళ్ళబోతూ మళ్ళీ ఆగింది.

'ఏమిటన్నట్లు చూశారు స్వామి

కొత్తిమీర తినవచ్చునాండి ? అన్నదామె

మితిమీరి తినకూడదు' అన్నారుస్వామి.

'ఆవ తగలవచ్చునాండి'? మళ్ళీ అడిగిందామె.

'ఆవపై యావ పనికిరాదు'. అని చెప్పారుస్వామి.

'మరి అల్లం ?' అన్నదామె క్వశ్చన్ మార్కు ముఖంపెట్టి

'బెల్లంతో కలుపుకుంటే పరవాలేదు' అన్నారుస్వామి.

'ములగకాడ' అన్నదామె అదేమార్కు ముఖంతో.

'మునిగిపోయిందిలేదు. ఇదివరకు నిన్ను ఇబ్బంది పెట్టక పోతే ఇప్పుడూ తీసుకోవచ్చు'

'ఇంకేమయినా కావాలా'? అన్నట్లు చూశారుస్వామి

'సరిపోయింది' అన్నట్లు నవ్వుతూ సాగిపోయిందామె.

# కంపెనీ సేక్ - కంపెనీ షేక్

పేషంటుగా కూర్చున్నాయన ఒక బ్యాంకు మేనేజరు శ్రద్ధగా మందుపుచ్చుకుందామనే ప్రయత్నంలో ఉన్నవాడు. మందు వ్రాయుటం పూర్తయింది.

'మాస్టరుగారూ ! ఎగ్ తీసుకోవచ్చునాండీ' ? అని అడిగాడాయన.

'ఎగ్, తీసుకోవచ్చు ఫరవాలేదు. కాని పెగ్ మాత్రం తీసుకోకూడదు ప్రమాదం ఉంది''. అన్నారుస్వామి.

ఆయన కొంచెం షాక్ తిన్నట్లయ్యాడు. ముఖం కొంచెం వివర్ణమయింది. తనకు పెగ్ అలవాటు ఉన్నదన్న విషయం మాస్టరుగారు ఇట్టే పట్టేశారే అనుకుని సిగ్గుతో తలదించుకున్నాడు.

'క్షమించండి మాస్టారూ ! చేసినపాపం చెబితే పోతుంది. నాకు విడిగా అలవాటులేదుకానీ ఎప్పుడైనా కంపెనీసేక్ పుచ్చుకుంటుండేవాడిని. మనమందు మొదలుపెట్టిన తరువాత మానేసే ప్రయత్నంలో ఉన్నాను. ఇప్పుడు మీ నోటినుండి వచ్చిన మాటతో ఇక మానేస్తున్నాను, ఎగ్ కూడా మీరు తీసుకోమండేనే తీసుకుంటాను. మరీ అంత ఇదేంలేదు'. అన్నాడాయన.

స్వామి ఇలా అన్నారు. 'చూడండీ మీరు తప్పదని కంపెనీ సేక్కని తీసుకున్నా ఈ కంపెనీ అంటే మనబాడీషేక్ అయిపోతుంది సుమా ! అందుకనే దానిని వదిలేయండి. ఇక గ్రుడ్డు అంటారా ఉడికిన గ్రుడ్లవరకూ శుభ్రంగాతినవచ్చు. మసాలాలు మాత్రం తగలనీయవద్దు'. అంటూ ఆయనను వెన్నుతట్టిసాగనంపారు.

## చుట్టబెడితే-చుట్టబెడుతుంది

అది విశాఖలోని డిస్పెన్సరీ, ఎదురుగా ఒక జాలరతను పేషెంట్‌గా కూర్చునిఉన్నాడు.

మందు వ్రాయడం పూర్తయింది.

'నీకు చుట్ట అలవాటుందా' ? అడిగారుస్వామి.

'ఉందండి' అన్నాడతను.

'చుట్టనీకు చుట్టమైనా, ఈ మందుకు అది శత్రువే మరి' ! అన్నారు స్వామి.

'చెప్పినారండి. ఏం చేస్తామండి'. చుట్టమానేస్తామండీ అన్నాడతను.

'ఏమంటున్నావ్ ? చుట్టమానేస్తామనా ? చుట్టమా'నేస్తమనా అడిగారు స్వామి.

కొద్దిక్షణాలకుగాని ఆ మాటలలోని విరుపు అతనికి బోధ పడలేదు. బోధపడగానే మాత్రం నవ్వునాపుకోలేకపోయాడు. 'బలేవారండి మీరన్నట్టు నేస్తమే అనుకోండి. మరేంచేస్తాం. మానేస్తాను. అయ్యా ; బాధ తగ్గాలిగదండీమరి. మాగురించే కదండీ మీరు చెప్తా. చెప్పింది చెప్పినట్లు ఇనుకోవాలి కదండీ. అంతే గదండిమరి, అన్నాడతను వినమ్రతతో.

కొన్నిక్షణాలు గడిచాయి. అతనికేదో అనిపించినట్లుంది. 'బాబయ్యా ! మధ్యలో ఏదన్నా పొరబాటున నోట చుట్టబెడితే

ఏమవుతుంది ? ఊరికే తెలుసుకుందామని అడుగుతున్నా అంతే'. అన్నాడతను.

ఏమిటి ? ఎప్పుడైనా చుట్టపెడితే ఏమవుతుందనా ? మళ్ళీ మధ్యలో ఎప్పుడన్నా చుట్టపెట్టావో వ్యాధిమొత్తం చుట్టపెట్టిందన్న మాటే ! నువ్వు చుట్టబెడితే అదీ చుట్టబెడుతుంది. ఇదిగో తాతా ! నీకసలే గంగమీద పెంగేమో ! చేపకూడా తగలకూడదు సుమా! మందు పుచ్చుకునే అలవాటుంటే అదీ మానేయాలి' అన్నారు స్వామి.

ఇయ్యనిన్ని ఇందాక సెప్పినారండి. అన్నింటికీ అచ్చేతునే మందుకొచ్చినానండి. ఏదో బాబయ్యా ! నీ సేతిసలువ. ఈ బాధ నుంచి బైటపడేయండి. అంతేశాన. మా దండాలందుకోండి. మరి నేనొప్పెచ్చిత్తాను' అంటూశలవు తీసుకున్నాడతను.

## సరదా - జరదా

ఒక నడివయస్కుడు మందు వ్రాయడం అయిపోయిన తర్వాతకూడా ఇంకా ఏదో సాన్చుతున్నట్లుగా ఉన్నాడు. అవతల ఇంకా చూడబడవలసినవాళ్ళు చాలామంది ఉన్నారు.

'ఏమిటి !' అన్నట్లు చూశారు స్వామి.

మందు వాడుతుండగా వక్కతగలవచ్చునాండి ? అన్నాడతను.

'వక్క ఒక్కటే అయితే వాడవచ్చు. బజారులో దొరికే వక్కపొడి అయితే మాత్రం ఆలోచించాల్సిందే !'

వివరణ కావాలన్నట్లు చూశాడతను.

'మరివాటిల్లో సుగంధద్రవ్యాలు తగులుతాయికదా !

ఘాటైన రుచులు, వాసనలు, ఈ మందుకు పనికిరావుకదా! అన్నారు స్వామి.

'మరి కిళ్ళీ సంగతేమిటండి' అన్నాడతను.

ఏం కిళ్ళీ ? సరదానా ? జరదానా ? సరదా అయితే వేసుకో వచ్చు. అదైనా ఎప్పుడన్నా జరదా మాత్రం పనికిరాదు. అన్నారు స్వామి.

తలఊపుతూ, నవ్వుకుంటూ సాగిపోయాడతను.

## జ్వరం కాదది వరం

పిల్లవాడికి ఉన్నట్టుండి జ్వరమొచ్చేసిందేమిటండీ. అన్నాడొక నడివయస్కుడు.

'జ్వరం కాదయ్యా అది వరం ! ఎన్నాళ్ళనుండి అణగ ద్రొక్కబడి ఉందో అది లోపల, ఇప్పుడు బయటకు వస్తోంది. అంటే పట్టిన గ్రహణం విడుస్తోందన్న మాట. ఇది సంతోషించ వలసిన విషయం. ఫీవర్ ఇట్ ఈజ్ ఫర్ అవర్ ఫేవర్. అన్నారు స్వామి.

'అమ్మయ్యా ! ఇప్పుడు ధైర్యమొచ్చిందండి. ఏమిటో అనుకున్నాను నేను. ఇచ్చినమందు వేస్తానుకోండి. మరి ఆహారమేమి పెట్టమన్నారు ? అన్నాడు అతడు.

'ఏమీలేదు జ్వరం తగ్గేంతవరకు బ్రెడ్ అండ్ బెడ్ అంతే'! అన్నారుస్వామి.

అతడు నవ్వుకుంటూ సాగిపోయాడు.

## కురుపులు కావవి-తలుపులు

'ఏమిటి మాస్టారూ ! ఈ కురుపులెంతటికీ తగ్గటంలేదు. ఒక ప్రక్క తగ్గాయనుకుంటే, ఇంకో ప్రక్క వచ్చేస్తున్నాయ్. ఈ రెండు రోజులు నిదానించాయి. అనుకుంటే వచ్చే రెండు రోజులు అవి విజృంభిస్తున్నాయి. వాటికిక అంతం లేదంటారా' తట్టుకోవడం కష్టంగా ఉంది. బయట తిరగడం కూడా కష్టంగా ఉంది వీటితో అంటూ దీనంగా చెప్పాడొక యువకుడు.

'కొంచెం ఓర్పు పట్టాలి తప్పదు. కొంతకాలంపాటు అవి అలా వస్తూ పోతూనే ఉంటాయి. నీకు ఎలాంటి దారుణమైన వ్యాధి తగ్గిందో గుర్తుందికదా ! అన్నారుస్వామి.

ఎంతమాట మాస్టారూ ! ప్రాణం పోసి మళ్ళీనన్ను నిలబెట్టారండి. అసలా ఆస్త్మా ఈ జన్మకు తగ్గుతుందనుకోలేదు. తగ్గుతుందని ఏ డాక్టరూ చెప్పలేదుకూడా. అట్లాంటిది మీ చేతి చలువవల్ల తగ్గిపోయింది. ఇక కురుపులొకటున్నాయంతే. ఇవి కూడాతగ్గిపోతే ఇక నేను బయటపడిపోయినట్లే అన్నాడతను.

స్వామి ఇలా అన్నారు: ఆస్త్మాలాంటి దారుణవేదనలు తగ్గినపుడు ఈ కురుపులులాంటి రూపంలో ఆ చెడంతా బహిష్కరింపబడకతప్పదు. అది అవసరం కూడాను. ఈ కురుపులు కురుపులుకావు. వ్యాధితాను వెళ్ళిపోయేటందుకుగాను తెరుచుకుంటున్న తలుపులు, వ్యాధివెళ్ళిపోంగానే ఈ తలుపులు వాటికవిగా మూసుకుపోతాయి. అప్పుడిక నీకు తిరుగుండదు.

ఇప్పుడు బరువంతా దిగిపోయింది మాస్టారూ ! మీతో ఇలా కాసేపు మాట్లాడే అవకాశం దొరికితేచాలు. నేనెంతో హాయిని ఫీల వుతూ ఉంటాను.' అంటూ నమస్కరించి శెలవు తీసుకున్నా డతను.

## కలవరంగా ఉందా ? - కల వరంగా ఉందా ?

'ఈ మధ్య రోజూ ఏదో ఒక కల వస్తోంది మాస్టారూ.' అన్నాడొక యువకుడు.

'అలాగా కలవరంగా ఉందా ? కల వరంగా ఉందా ?' అన్నారుస్వామి.

కొన్నిక్షణాలకుగాని యువకుడి పెదవులు విచ్చుకోలేదు. విచ్చుకున్న తర్వాత అవి ఇక ఆగలేదు. నవ్వుతూనే ఉన్నాయి. మరీనవ్వితే బాగుండదని మర్యాదకోసం ఆపు చేసుకుంటున్నా డతను.

'కల వరంగాలేదండీ ! కలవరంగానేఉంది. అందుకే మీకు చెప్పాల్సివచ్చింది' అన్నాడతడు నవ్వుకుంటూనే.

'అలాగా ! మరో వారం రోజుల్లో అన్నీ సర్దుకుంటాయిలే' అని ధైర్యం చెప్పి పంపించారు స్వామి.

# తరిగితే - తరుగుతుంది

పనిపూర్తయిపోయిన తర్వాతకూడా ఒకామె అలా నిలబడి ఉంది.

'ఏమిటి' ? అన్నట్లుచూశారు స్వామి.

''ఉల్లిపాయలసలు తగలకూడదాండి.'' అడిగిందామె

'మీకు తగలకూడదు. మీరుతరగకూడదుకూడాను. అన్నారు స్వామి.

'తరగకూడదు కూడానాండి ! తరిగితే ఏమవుతుందండి !

'తరిగితే మందు యాక్షన్‌కూడా తరిగిపోతుంది.'

'మరి మార్గమేమిటండి ?'

'తినడమే కాకుండా కొనడంకూడా మానెయ్యాలిమే !

'అంతేనంటారాండి'?

'ఏమిటమ్మా ఇంత మాత్రానికే అంత బాధపడి పడిపోతున్నావు. కొంపలు మునిగిపోతున్నట్లుగా మరి ఆ ఇంగ్లీషు మందుల వాళ్ళు పంచదార మానేయమంటారు. ఉప్పుమానేయ మంటారు. అన్నం మానేయమంటారు. క్రమంగా అన్నీ మానే యమంటారు. మరి అప్పుడేం చేస్తారు ? అందుకనే కంగారు పడకు, ఇక్కడ ప్రాణావసరాలేవి మానమనడంలేదు. సహజమైన రుచులను మేము కాదనడంలేదు. ఉల్లిలాంటి హావైనపదార్థలను మాత్రమే వదిలేయమంటున్నాము. ఇంత ఘాటుగా చెబితే గాని వదిలేట్టులేరు మీరు.

'ఎంతకాలం మానేయాలంటారండీ !'

బలేదానివమ్మా ! నీకు శివలింగాన్ని చూసినా ఉల్లిపాయే జ్ఞాపకమొచ్చేట్టుంది. ఎంతకాలమేమిటి ? ఈ మందు వాడుతున్నంతకాలం. మళ్ళీ నేను తినమని చెప్పేటంతవరకు మీరు తినగూడదు ముట్టకూడదు.

కొంతమంది ఉడికినదైతే తినొచ్చు.... అంటారు కదండీ.

అది ఆ కొంతమందికి సంబంధించిన విషయం. అప్పుడు నువ్వు మందు ఆ కొంతమంది దగ్గరే పుచ్చుకోవాల్సి ఉంటుంది. ఇక్కడాపప్పులేం ఉడకవు. అదిసరేగాని ఉల్లిపాయంటే నీకు అంత ప్రేమేమిటి ? మానమని చెప్పినందుకు చాలా విరహాన్ని అనుభవిస్తున్నట్లున్నావ్. నీకు ఉల్లివిరహం చాలా ఉన్నట్లుంది సుమా !' అంటూ నవ్వించి పంపించేశారు స్వామి.

## చెప్పమని చెప్పారు

'ఈ నెలలో మీరు మందుకొచ్చినట్లుగాలేరు' అడిగారు స్వామి

'నేను ఈ మధ్య ఊరువెళ్ళానండి. ఆ విషయం మీకు చెప్పమనికూడ ఇంట్లో చెప్పాను. వాళ్ళు చెప్పారనే అనుకున్నాను' అన్నాడాయన.

చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నారుస్వామి: 'బాగుంది. మీరు చెప్పమని చెప్పారు. వాళ్ళు చెప్పమని చెప్పారు. కాక పోతే సైలెంట్‌గా, ఆమాత్రం మీరు అర్థం చేసుకోబోతేఎలా ? మీరు చెప్పబోయేముందు ఎవరి శ్రద్ధ ఎంతవరకో చూసుకుని మరీ చెప్పాలి.' అని చిన్నగా మందలిస్తూ ముందుకాసాగారు స్వామి.

## బార్లీనీళ్లు - బార్లోనీళ్ళు

విశాఖలోని సంస్థ కార్యాలయంలో ఉదయంవేళ డిస్పె న్సరీ జరుగుతూఉంది. యూనివర్సిటీ విద్యార్థులిద్దరు మందుకని వచ్చారు. అందులో ఒకరు పేషెంట్. ఒకరు అతనికితోడు.

'ఎలా ఉంది' ? అని అడిగారుస్వామి.

'ఇవాళ్టికి నార్మల్‌కి వచ్చిందండి. మొత్తంమ్మీద నాల్గు రోజులుపట్టింది' అన్నాడతడు.

'ఈ నాల్గురోజులు ఆహారం ఏం తీసుకున్నావుమరి ?' అడి గారు స్వామి.

'హస్టల్‌లో ఉంటే సాగదని మా బంధువుల ఇంటికి వెళ్ళాను. మూడుపూటలా బార్లీ నీళ్ళు త్రాగుతూకాలం గడిపాను. అన్నాడతను వినమ్రంగ.

స్వామి చిరునవ్వు నవ్వుతూ, 'నీలాంటి విద్యార్థులందరూ బార్‌లో నీళ్ళకు ఎగబడుతున్న రోజులివి, నువ్వుచాలా మంచి వాడవయ్యా బార్లీ నీళ్ళతో సరిపెట్టుకున్నావు.' అన్నారు.

ఆ యువకులిద్దరూ నవ్వుకున్నారు.

'ఈపూట సత్యం తినమంటారాండి ?'' అడిగాడతను

'ఏం వేసుకు తింటావ్ ? అడిగారు స్వామి.

బీరకాయతో తినవచ్చాండి ? అన్నాడతను. తినమంటారో లేదో అన్నట్లుగా.

బాగుందయ్యా ! నీలాంటి కుర్రాళ్ళందరు నిస్సందేహంగా బీరకాయలు పట్టుకుని బజార్లలో షికార్లు చేస్తున్నరోజులలో నువ్వు బీరకాయతో తినొచ్చాండి ? అని భయపడుతూ, భయపడుతూ అడుగుతున్నావు. బాగుంది నీలాంటి కుర్రవాళ్ళ సంఖ్య పెరిగితే ఇంకా బాగుంటుంది.

అందరూ ఒకలాగే ఉండరు కాదండీ ! మాస్టరుగారూ ! అన్నాడు అ కుర్రవాడితో వచ్చిన మిత్రుడు,

'నిజమే నీవన్నది. ఎప్పుడూ అన్ని రకాల వాళ్ళూ ఉంటారు. ఏ రకం వాళ్ళు ఎక్కువ సంఖ్యలో ఉంటారో వారి పేరిట మిగిలిన వాళ్ళుకూడా చెలామణీ కావలసి వస్తోంది. ఏమంటారు ! యువకులంతా చెడిపోయారని ఎవరైనా అన్నారనుకో నిజంగా అంతా చెడిపోయారనా ? వాళ్ళ ఉద్దేశం. ఎక్కువమంది చెడిపోయారని. మెజారిటీ వాళ్ళదని. ఇప్పుడు నేను కోరేదేమిటంటే మీలాంటి వాళ్ళది మెజారిటీ కావాలని.' అన్నారు స్వామి.

'మీలాంటివాళ్ళు పూనుకున్న తర్వాత అది ఎలాగూ జరుగుతుందండీ !' అంటూ నమస్కరించారు ఆ ఇద్దరూ.

# అవసరాన్ని గమనించగలం - అలసత్వాన్ని గౌరవించలేం

'మాస్టరుగారూ ! చిన్నమాట ఈ మధ్య మా వాళ్ళు రెండు మూడుసార్లు లేటుగా వచ్చారు. అలా వచ్చినందుకు ఇక్కడి వాళ్ళు మందలించారట. ఒక సందర్భంలో మీరుకూడ గట్టిగా మందలించారని చెప్పారు. ఇలా అంటున్నానని మీరేమీ అనుకోకండి. ఇది వైద్యాలయంకదా ! ఇక్కడ కూడా ఆలశ్యమైదంటే ఎలా ? వేళలు ఇంకెవరికైనా పెట్టవచ్చుగాని పేషెంట్లనుకూడా పాటించమంటే ఎలా ? కొంచెం ముందు వెనకా అయినా సర్దుకుపోవడం మంచిదేమోఅనుకుంటాను. ఏమంటారు? అన్నాడొకాయన.

సూటిగా చూస్తూ స్వామి ఇలా అన్నారు: నిజమైన కారణముండి ఆలశ్యంగా రావడం జరిగితే ఇక్కడివాళ్ళు తప్పక అర్థం చేసుకుంటారు. ప్రాణవిపత్కర పరిస్థితులు ఏర్పడినవేళ అసలు వేళలే పట్టించుకోరు. ఇక ఎటొచ్చీ తీరి ఆలశ్యంగా వస్తున్న వాళ్ళతోనే వస్తుంది ఇబ్బంది. నిజంగా వాళ్ళురావాలి అనుకుంటే రాగలరు. కాని అలా అనుకోవడానికి బద్ధకిస్తున్నారు, వాళ్ళు, బద్ధకించీ, ఇది వైద్యాలయంకదా ఇక్కడకూడా వేళలు పెడితే ఎలా ? అని లా పాయింటు తీస్తున్నారు. అలా పాయింట్ తీస్తే ఎలా చెప్పండి. అలాంటప్పుడు ఆ పాయింట్స్ పట్టించుకోకుండా మా అపాయింట్‌మెంట్స్ ప్రకారం మేం వెళ్ళిపోతుంటాం.

చూడండి ఏ పనికయినా ఓ పద్ధతి ఉండాలి. కొన్ని వేళ లుండాలి. అది తప్పదు. ఒక వేళంటూ పెట్టాము కాబట్టి ఈ వేళకు వెళితే మాస్టరుగారు దొరుకుతారని మీరొస్తున్నారు. ఇలా వేళలు లేవనుకోండి మీరెప్పుడని వస్తారు ? నేనెప్పుడని చూస్తాను ? ఇక అది లాటరీ వ్యవహారంలా ఉంటుంది. అలా అస్తవ్యస్తంగా నడిపేకన్నా వేళలను పాటించడమే సర్వదా శ్రేయస్కరం. నేను మొదటే చెప్పాను మీకు నిజమైనకారణముండి లేటయిన వారిని ఇక్కడివారు అర్థంచేసుకుంటారు. మీరేమీ అనుకోకండి. నేనిలా చెబుతున్నానని. నేను అవసరాన్ని గమనించగలను. కాని అలసత్వాన్ని గౌరవించలేను. అందుకనే ఎందరు ఈ పాయింట్ మీద స్ట్రెస్ ఇచ్చినా నేను రాజీపడటంలేదు. ఇది సేవాసంస్థ మాత్రమేకాదు. శిక్షణ సంస్థకూడా ! అది మీరు మరచిపోకూడదు మీ ఆరోగ్యాలు చక్కదిద్దబడటమేగాదు. మీ వ్యక్తిత్వాలు కూడా తీర్చిదిద్దబడాలి ఏమంటారు ?

అవతలివ్యక్తికి మాటలాడటానికి ఇంకేం మిగిలింది ? అతడు మెల్లగా అన్నివిధాలా సర్దుకున్నాడనివేరుగా చెప్పనక్కర లేదుకదా !

# ఆ మందం పనికిరాదు

స్వామికి ఎదురుగా ఒక తల్లీ కూతుళ్ళు కూర్చొని ఉన్నారు. ఆ కూతురివడిలో ఒకపాప ఉన్నది. ఆ కూతురికి కూతురన్న మాట తల్లీ బిడ్డల విషయంలో ఎలాంటి జాగరూకతలు తీసుకోవాలని అడిగి తెలుసుకుంటోంది ఆ పెద్దతల్లి.

'మాస్టరుగారూ ! ఈ బాబుకి గ్రైప్‌వాటర్ పట్టమంటారా ?' అడిగిందామె.

'అటువంటివేం అవసరం లేదు.' అన్నారు స్వామి. ఒక్క క్షణమాగి వాటివల్ల జీర్ణకోశం దెబ్బతినిపోయే ప్రమాదముంది' అన్నారాయన.

'మరి ఆముదం మాటేమిటి ? ఇప్పటి డాక్టర్లేమో ఆముదం పనికిరాదు అంటున్నారు.' అన్నదామె.

'ఆముదం పనికి రాదన్నారా ! వాళ్ళకు ఆ మందం పనికి రాదు, అని నేనన్నానని చెప్పు' అన్నారు స్వామి.

ఆమె నవ్వుకుంది. ఆ కూతురు నవ్వింది. కూతురు కూతురు కూడా నవ్వింది నాకూ నవ్వొస్తోందన్నట్లుగా.

స్వామి ఇలా వివరించారు : మీరు చెప్పండి. మీ తల్లిదండ్రులు మీకు ఆముదం పెట్టారాలేదా ? మీ అమ్మాయికి మీరు ఆముదం పెట్టారా లేదా ? మరి మీ తరం వరకూ నడచి వచ్చిన సంప్రదాయాన్ని దేనికెందుకు వదులుకోవాలి. వదులుకోవలసిన

అవసరమేమొచ్చింది ? వైద్యులు చెబుతున్నారు గనుక. అంతేనా ? ఆ వైద్యులది ఇంగ్లీషువాళ్ళ చదువు. ఆ ఇంగ్లీషు వాళ్ళకు ఆముదం సంగతి తెలియదు. తెలియనివాళ్ళు తెలియ నట్లూరుకోవాలి. తెలిసినట్లు ఏదో చెప్పడం ఎందుకు ! ఈ డాక్టర్లు గుర్తుకుతెచ్చుకోవాల్సిందేమంటే, వాళ్ళ తల్లులు కూడా వాళ్ళకు ఆముదం పెట్టారని.

సత్యం గమనించినపుడు తెలిసేదేమిటంటే ఆముదం పెద్దవాళ్ళల్లో విరేచనకారి మాత్రమే. అదే చిన్నపిల్లల్లో దాని కథ వేరు. పెద్దల సంప్రదాయం ప్రకారం ఆముదం పెట్టటంవల్ల పిల్లల్లో సకల అవయవాలు సమపాళ్ళల్లో ఎదుగుతాయి. అన్న మయ, ప్రాణమయ, మనోమయ కోశాలకు ఆ ఎదిగే వయ స్సులో ఆముదం వల్ల చక్కటి అనుసంధానం కుదురుతుంది. ఆ కోశాలన్నీ చక్కగా వికసించి శక్తిమంతమౌతాయి. ఈ సూక్ష్మాంశాలన్నీ తెలియక ఆముదాన్ని కనుక కేవలం విరోచన కారిగా భావించి, పెట్టడం మానేస్తే ఎదుగుదలలో ఎగుడు దిగుడు లొచ్చే అవకాశముంది. వివిధ ప్రజ్ఞల వికాసంలో ఒడిదుడుకులు వచ్చే అవకాశం కూడ ఉంది. కొందరు 'క్రాక్స్'గా రూపొంద వచ్చు. అందువల్ల అనాదిగా వస్తున్న ఆచారం ప్రకారం ఆము దాన్ని పట్టడమే మంచిది. ఇక మిగతాటానిక్కులవీ అంటారా ? అత్యవసర పరిస్థితులలో తప్ప అవి అనవసరం.

మీరు చెప్పినట్లుగానే నడుచుకుంటాము అన్నట్లుగా తలలు ఊపారువాళ్ళు.

అవునూ ! స్వామి వాక్కుకు తల ఊపనిదెవరు ?

# 4. సమాజము - సంస్కరణ

1. పాలన-పాలణా

2. పిండిపాలు-నీళ్ళపాలు

3. ఆర్థికంకాదు-పారమార్థికం.

4. పిడివాదం-దోపిడివాదం.

5. చెడిపోవడంకాదది- చెదిరిపోవడం.

6. భయపడకండి-బాటలోనడవండి.

7. శ్రమపడకండి-కృషిచేయండి.

8. ఎదురు చూడకండి-ఎదురుగా చూడండి.

9. ఊహించకండి-జీవించండి.

## పాలన - పాలణా

ఏమిటి అరాచక పరిస్థితి. అసలు పరిపాలన అనేది ఈ దేశంలో ఉన్నదంటారా ! అయినకాడికి గుంజుకోవడమే కన బడుతోంది. అన్నీ అమ్ముకోవడమే. ఉద్యోగాల దగ్గరనుండి లైసెన్స్‌ల వరకూ అన్నీ అమ్ముకోవడమే. ఎలక్షన్లలో వెదజల్లిన దానికి వేయింతలుగా సంపాదించడానికి. కానిమార్గాలను అదే పనిగా వెతకటమే ! ఇదేనా పాలన ?

చిరునవ్వుతో స్వామి ఇలా అన్నారు: మీరు సహృదయులు కనుక ఇంకా బాధపడుతున్నారు. ఈ స్వతంత్ర భారతదేశంలో కుతంత్రంపెరిగింది. పాలన అన్నది కనుమరుగై చాలాకాల మైంది. ఇప్పుడు ఈ దేశంలో ఎక్కువచోట్ల కనబడేది పాలనకాదు. పాలణా ! ఎవరికివారు తమ పాలుగాలభించవలసిన అణాకోసం తంటాలుపడుతూ ఉండటమే నేడు కనబడుతూ ఉన్నది.

చూడండీ ! ఇవాళ ఈ దేశంలో పాలనకూడా ఒక వ్యాపారం, గెలవడానికి కొంత ఖర్చుపెడుతున్నారు. అది ఈ వ్యాపారానికి పెట్టుబడి అన్నమాట. గెలచిన తర్వాత వేయింతలు సంపాదిస్తున్నారు. అది ఆ పెట్టుబడిమీద లాభాలు తీయడ మన్నమాట.

చూస్తుంటే అసలు ఈ దేశంలో వ్యాపారం కానిదంటూ ఏదయినా ఉన్నదా అనిపిస్తున్నది. చదువు వ్యాపారం. ఉద్యోగం వ్యాపారం. పెళ్ళి వ్యాపారం. పిల్లలు వ్యాపారం. దేశంలోని పాలనే వ్యాపారమయినప్పుడు పాలనలోనిభాగాలన్నీ వ్యాపారంకావడంలో ఆశ్చర్యమేముందీ ! సర్వం విష్ణుమయం

కాదిప్పుడు సర్వం వ్యాపారమయం ! ఒకప్పుడు వ్యాపారాన్ని కూడా ధర్మదృష్టితోచేసిన జాతిమనది. ఇప్పుడుధర్మాన్నికూడా వ్యాపారదృష్టితో నడిపించబూనిన ప్రగతిమనది.

ఇంతబాధలోనుండీ అవతలిసోదరులు కొంత నవ్వారు. మీరు ఎంత బాధలోనున్నవారినయినా, ఆ బాధలోనుండే నవ్వించ గలరు అన్నట్లుగా.

'అపును నవ్వుతూ చూసినప్పుడే ఎంతటి బాధకయినా పరి ష్కారందొరుకుతుంది ! అన్నట్లు చూస్తున్నారు స్వామి.

## పిండిపాలు - నీళ్ళపాలు

'బాబూ పాలండీ' ! అం టూ నిలబడలేక నిలబడ్డాడు గుమ్మంముందు పాలవాడు.

'పిండిపాలా, పిండినపాలా ! లోననుండి అడిగాడు ఇంటా యన కొంచెం కొంటెగా.

'అయ్యా ! పిండిఉన్నపాలండి ! మీరింకొక క్షణంలో ఇక్కడ ఉండకపోతేనండీ, నేను మరొక ఇంటిముందు ఉంటా నండీ అన్నాడాపాలవాడు మీ లెక్కెంతఅన్నట్లుగా.

ఇలా ఉంటున్నాయి నేటి మన సమాజంలో నిత్యం మన చెవుల్లో పడుతున్న సంభాషణలూ.వాటి సొగసులూ. ఇక మని షికి మనిషి ఎంత దగ్గరగా ఉన్నాడు. ఎంతగా దూరమయి పోతున్నాడు అన్నది మీరాలోచించండి.

ఒక పల్లెటూళ్ళో తెల్లవారు జామున పాలకేంద్రం దగ్గర రైతులందరూ చెంబులతో, బిందెలతో పాలుపట్టుకొని బుద్ధిగా నిలబడిఉన్నారు. ఆ కేంద్రంలోని కుర్రవాడు పరీక్షచేసి మరీ ఆ పాలను ఒంపుకుంటున్నాడు. వచ్చిన పాలకు వచ్చినట్లుగా మార్కులు వేసుకుంటున్నాడు. మరిన్నిమార్కులు మనపాలకు పడాలన్న కోరికతో, ఆ రైతు సోదరులు నికార్సయిన పాలను పట్టుకొచ్చి మరీ నిలబడుతున్నారు.

ఆ ఊళ్ళోనే రోజూ పాలు కావలసిన వాడొకడు తన ప్రక్కింటి వాడినడిగాడు. ఆ పాలకేంద్రానికి పోసేదేదో, నాకు పోయరాదా అని. కావాలంటే ఒక రూపాయి ఎగస్ట్రా తీసుకోమని ప్రతిమిలాడాడు. ఆ పాలు పోసేవాడునసిగాడు. చివరికి 'సరేలే' అన్నాడు! మర్నాటినుండీపాలు పోసాడు. సగానికి సగం నీళ్ళు కలిపిపోశాడు. రూపాయికి రూపాయి ఎగస్ట్రానూ తీసుకున్నాడు. దీనినేమనాలి చెప్పండి? పాలకేంద్రం పాటి చేయడాసాటివాడు! ఈ జాతిలో, ఈ మనజాతిలో మనుషులు ఒకరికొకరు కాకుండా పోతున్నారనీ, మన జాతీయత అంతా నీళ్ళపాలు అవుతోందని మనం గ్రహించుకోవడానికి ఈ నీళ్ళపాల నిదర్శనం ఒక్కటి చాలదూ !

పిండిపాలూ, నీళ్ళపాలు, ఇక మనజాతీయత నీళ్ళపాలు!

సభ ఆశ్చర్యపడుతూనే, ఆవేదనను అనుభవిస్తోంది. రోజూ చూస్తున్నదృశ్యాలే ఇవి. కానీ ఇప్పుడిలా చూస్తూఉంటే ఎంతదారుణంగా కనబడుతున్నాయి. దిగజారి పోతున్న మన బ్రతుకులకు అద్దం పడుతూ మనమెక్కడిదాకా పడిపోయామో చూపెడుతున్నాయి.

స్వామి సభను గమనిస్తున్నారు. తన చూపులతోనే సభలోనివారినిపైకి లేవనెత్తే ప్రయత్నం చేస్తున్నారు.

# ఆర్థికంకాదు - పారమార్థికం

నేటిసమాజంలోని సకలసమస్యలకూ మూలం ఆర్థికసమస్యలు. ఆర్థికమయిన అంతరాలే, ఆ అంతస్థులలోని తేడాలే ఈ సమాజాన్ని అస్తవ్యస్తం చేసేస్తున్నాయి. అని నమ్ముతున్న వాళ్ళున్నారు. వారినమ్మకాన్ని నేను కాదనను కాని, ఆ నమ్మకం కొంత వరకే నిజమని మనం గ్రహించవలసిఉంది అంటున్నాను.

ఆర్థికమయిన అంతరాలు ఉండకూడదు. నిజమే కాని అంతమాత్రాననే మన సమస్యలన్నీ తీరిపోవు. తండ్రి తన నలుగురు బిడ్డలకూ ఆస్థిని సమంగా పంచి ఇస్తున్నాడు. అంతమాత్రాన వారు కలసి ఉండగలుగుతున్నారా? కలసి ఉండగలరని మనం చెప్పగలమా! మనుషులు కలసిఉండటానికి అంతమాత్రమే చాలదు అని తేలిపోతోందికదా!

మనిషికి మనిషి దగ్గరకావడానికి సనాతనధర్మం కొన్ని సోపానాలను నిర్మించింది. అందులో మొదటిది ధనాన్నిబట్టికాదూ. గుణాన్నిబట్టి మనం మనిషికి విలువనివ్వాలి అన్నది. మనిషీ! తోటిమనిషివైపు చూస్తున్నప్పుడు అతని చుట్టూ ఉన్న స్థితిగతుల వైపుకన్నా, అతడినుండి వ్యక్తమవుతున్న గుణగణాలవైపు తేరి పారజూడు! అని ఉపదేశించింది. ఈ ఉపదేశాన్ని మనం చిత్తశుద్ధితో అమలుపరుస్తే ఏమవుతుంది. కులమత భేదాలు ఇక మన పైన పనిచేయవు, వయస్సులూ, హోదాలూ ఇక మనకు అడ్డురావు. మీరన్న అంతరాలన్నీ అంతటితోనే జారిపోతున్నాయి. ఏమంటారు.

ఒకనిజం చెప్పనా. ఇవాళ మనిషి బాధపడుతున్నది తనకు స్థితిగతులు లేనందుకుకాదు. తనకు సరయినస్థితిగతులులేవని తోటిమనిషి తనవెక్కడ చిన్నచూపు చూస్తాడోనని. మనిషి తోటి మనిషిని చిన్నచూపుచూడకుండా ఎప్పుడు ఉండగలుగుతాడు ! అతడు పారమార్థికంగా ఎదిగినప్పుడు ! కనుక అసలు సమస్య ఆర్థికంకాదు, పారమార్థికం.

సనాతనధర్మం మనిషిని ఇంకొక మెట్టుపైకి ఎక్క మన్నది. తోటి మనిషితో ప్రవర్తించేటప్పుడు గుణగణాలనుబట్టి కూడాకాక ఆ లోని వెలుగును పట్టించుకోవడం నేర్చుకోమన్నది. నేర్చుకుంటున్నకొద్దీ. అందరిలోనూ అండగానూ ఉన్నది అదే వెలుగని' అది ఒకే వెలుగని తెలుస్తుందిచూడు. నిండుగా ఈ సత్యం నీకు అనుభవానికొస్తుందిచూడు. అని ఉపదేశించింది.

ఎక్కవలసిన మెట్లను చూపటమేకాదు. ఆ మెట్లను ఎక్కే టందుకుగాను. మనిషి నిరంతరం చేయువలసినసాధన ఏమిటి అన్నదికూడా సనాతనధర్మం వివరంగా ఉపదేశించింది. అదే యోగసాధన విధానం, అష్టాంగయోగమార్గం. మనుషులను ఈ సాధన పైపునకు మళ్ళించగలిగినప్పుడు ఇక సమస్యల బెడద అన్నది తలఎత్తదు. సకల సమస్యలకూ పరిష్కారం దివ్య మయిన ఈ సాధవలోనికి మానవజాతి ప్రవేశించడమే ! కాల కాలాలలో దేశదేశాలలో ప్రవక్తలూ, మహర్షులూదిగివచ్చేది ఇందుకే ! మానవజాతిని పెద్దఎత్తున ఈ సాధనపథాన ప్రవేశింప చేసేటందుకే ! అందుకే భూమి తన బరువనిపించినప్పుడల్లా అటు వంటి పెద్దలకొరకు ఎదురు చూస్తూఉంటుంది.

సభ తాను మొత్తంగా సాధన పథాన ప్రవేశించా నంటున్నది. స్వామి ఉపదేశం దానిపై అంతగా పనిచేస్తున్నది.

# పిడివాదం - దోపిడీవాదం

అనాదిగా నరజాతిని పట్టి పీడిస్తూ వస్తున్నది రెండే రెండు వాదాలు. మొదటిది పిడివాదం రెండవది దోపిడీవాదం. పిడివాదంలో పడినప్పుడు మనిషికి మనిషి ఎడమైపోతున్నాడు. దోపిడీవాదానికి గురియైనప్పుడు మనిషికి మనిషి మిగలకుండా పోతున్నాడు.

పిడివాదమంటే చాదస్తం. తోటిమనిషిని కులంపేరిటో, మతం పేరిటో, పార్టీపేరిటో వర్గం పేరిటో ఎడంగా ఉంచడం. మనుషుల మధ్యలేనిపోని అంతరాలు సృష్టించడం. అస్పృశ్యుడవని దూరంగా ఉంచితేనేం, ఆడదానివని దూరంగా ఉంచితేనేం ఏరాయి అయితేనేం పళ్లూడగొట్టుకోవడానికి. చదువులేదని దూరంగా పెడితేనేం స్థితి పరుడు కాడని దూరంగా ఉంచితేనేం, ఏ తేడా అయితేనేం మనుషులను విడదీయడానికి. పిడివాదమంటే ఒకానొక చాదస్తం. మనిషిని సూటిగా చూడనివ్వదది. తోటిమనిషిని మనిషిగా గుర్తించనివ్వదది. క్రమంగా మనుషులను విడదీసి ఒంటరి వాళ్ళను చేసేస్తుంది అది. మనిషిని మనిషికి కాకుండా చేస్తుందది. సహజీవనానికి స్వస్తి పలుకుతుందది.

దోపిడీవాదమంటే మనిషిని మనిషి దోచుకుతినడం దోచుకు తినకుండా ఉండలేక పోవడం. కార్మికుల్ని చేస్తేనేం. కొనుగోలు దారుల్ని చేస్తేనేం దోపిడి దోపిడేకదా! మూగవాళ్ళని గుంజితేనేం లంచాలుగా పడితేనేం దోపిడి దోపిడే కదా! రిక్షావాడిగా చేస్తేనేం పెట్టుబడిదారుగా చేస్తేనేం దోపిడి దోపిడే కదా! తోటి మనిషిని సేవిస్తూ బ్రతకడం, తోటిమనిషిని మోసగిస్తూ

బ్రతుకు అని పురికొల్పుతుంది ఈ దోపిడీవాదం. 'తోటి మనిషిని మననీయకు, అతడినిక మిగలనీయకు !' అన్న ప్రేరేపణ ఇస్తుంది ఈ దోపిడీవాదం. చాలు. నరజాతి నశించిపోవటానికి ఈ రెండు వాదాలూ చాలు. మనిషికి మనిషి కాకుండా పోవడానికి మనిషికి మనిషి మిగలకుండా పోవడానికి ఈ రెండు వాదాలూ చాలు. ఏ దేశాలలో నయినా, ఏ పేర్లతో కనబడుతున్నా వినాశనానికి దారితీస్తున్నవి ఈ రెండు వాదాలే.

సనాతన ధర్మం ఈ రెండు వాదాలకూ పరిష్కారంగా రెండు ఉపదేశాలను చేసింది. మనిషీ ! ఎన్నడూ తోటిమనిషిని నీకన్నా వేరుగా చూడకు.' అన్నది మొదటి ఉపదేశం. 'మనిషీ ! తోటిమనిషిని సేవిస్తూ బ్రతుకుతానని ప్రతినచేయి' అన్నది రెండవ ఉపదేశం. ఈ రెండు ఉపదేశాలనూ ఒంటపట్టించుకున్నప్పుడు నరజాతి అన్నివిధాలా సుఖశాంతులను అనుభవించు గలదు.

స్వామి గొంతు ఆర్ద్రమైంది. స్వామి వదనం గంభీరంగా ఉంది. స్వామి మధనం అమృతాన్ని అందిస్తున్నది. స్వామి సందేశం సనాతన ధర్మ స్వరూపాన్ని స్పష్టంచేస్తున్నది.

సభలోని శ్రోతలు ముగ్ధులవుతున్నారు. మంత్ర ముగ్ధులవుతున్నారు.

# చెడిపోవడం కాదిది - చెదిరి పోవడం

చాలా మంది అంటున్నారు. 'ఈ జాతి చెడిపోయిందని'. చెడిపోలేదు ఈ జాతి చెదిరిపోయింది. ఆ చెదురుపాటు చెడిపోవడంగా కనిపిస్తోంది.

శతాబ్దాల తరబడి బానిసత్వం ఈ జాతిని చెందరవందర చేసింది. మహమ్మదీయుల దండయాత్రలు మన జాతి సంస్కృతీ చిహ్నాలను మట్టుపెట్టే ప్రయత్నం చేసాయి. పన్నెన్నో గుడులు గోపురాలు బ్రద్దలు కొట్టబడ్డాయి. దేవతా మూర్తుల ముక్కులు, చెవులు అనేకంగా కోసివేయబడ్డాయి. ఈ సంస్కృతి అంటే అంతకసి వాళ్ళకు! ఆ కసిని చూసి ఈ జాతి బెదిరి పోయింది. తనకు తెలియకుండానే తాను చెదిరిపోయింది.

ఆంగ్లేయుల పాలన మన జాతీయతకూ, మన సంప్రదాయానికీ మనం చెందకుండా పోవడానికి కావలసిన విష బీజాలన్నింటినీ నాటింది. మన పవిత్ర గ్రంథాలను మనమే శంకించేలా, మన అవతార మూర్తులను మనమే అపహాస్యం చేసేటట్లుగా తయారుచేసింది. ఈ దేశంలో ఉంటూనే విదేశాలకు మానస పుత్రులను కమ్మని మనను ఆశీర్వదించింది. అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసింది. అప్పుడేమయింది. జాతి ఛిన్నాభిన్నమయి పోయింది. మరింతగా చెదిరిపోయింది.

ఇంతలో దేశానికి స్వాతంత్ర్యమొచ్చింది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మొదటిసగం పరిపాలన మనను ధర్మం వైపు నుండి ధనం వైపునకు నడిపించింది. ఇప్పుడు రెండవ సగం పరి

పాలన నైతిక విలువలకు అన్నివిధాలా స్వస్తి చెప్పేటట్లు చేస్తున్నది యథారాజా తథాప్రజా అన్నట్లుగా పాలనతో పాటుగా జాతి కూడా దిగజారుతూవస్తున్నది.

ఇన్ని కారణాలచేత జాతి చెదిరిపోయింది, చిందరవందరయింది. మంచిగా బ్రతుకుదామని ఉన్నా అలా బ్రతుకలేనిస్థితిలో పడిపోయింది. అలా బ్రతకలేనేమో అని భయపడుతోంది. భయపడి పరిస్థితులతో ఎక్కడికక్కడ రాజీపడిపోతోంది. గాలి వాటానికి అనుగుణంగా కొట్టుకు పోతోంది. కాని ఎక్కడో అంతరాంతరాలలో నేను నేనుగా బ్రతకలేకపోతున్నానే, అన్న భావం ఇంకా ఈజాతిలో ఉంది. బ్రతికి ఉంది. కొడిగట్టి కుంచించుకు పోతున్న దీపారాధనలాఉంది. నాలోని ఈ భావాన్ని కాస్త ఎగసన ద్రోసే వారు లేరా అని వెతుకులాడుతోంది. బ్రతిమిలాడుతోంది. అందుకే అంటున్నాను. ఈ జాతి ఇంకా చెడిపోలేదని ఇదంతా చెదలు బాటేనని.

కాస్తంత ఉత్సాహపరిస్తే, కాస్తంత ధైర్యంపోస్తే కాస్తంత మేలుకొలిపితే, పూనుకొని కాస్తంత శిక్షణనిస్తే ఈ జాతిమళ్ళీ బాగుపడుతుంది. బట్టకడుతుంది. ఇన్నినాళ్ళ అనుభవం ఇదేమాట చెబుతున్నది. ఇదే బాట చూపుతున్నది.

సభలో ఉత్తేజం కనబడుతున్నది. ఆత్మవిశ్వాసం కావలసిన మేరకు ఎదిగి వస్తున్నది. జాతి తనను తాను తెలుసుకుంటున్నది. తనను తాను మలచుకుంటున్నది. అని అనిపిస్తున్నది.

## భయపడకండి - బాటలో [illegible]

మీకు నిజంగా ఇలా బ్రతకాలనిలేదు. మిమ్మల్ని [illegible] తున్న భయంవల్ల మీరిలాగ అయిపోతున్నారు. మీరు [illegible] చేత వేటాడబడుతున్నారు. ఆ భయం మిమ్మల్ని [illegible] కుక్కలా వేటాడుతున్నది.

ఎంతకాలం భయపడతారు. ఎంతకాలం [illegible].

ఎంతకని పరుగెడతారు. ఎక్కడికని [illegible].

రేపెలా జరుగుతుందోనని భయం. ఎల్లుండి అసలు [illegible] తుందో లేదోనని భయం. భవిష్యత్తు అసలెలా [illegible] భయం. మనస్థితిగతులు ఏమవుతాయోనని భయం. [illegible] కలిసి వస్తారా అని భయం. కన్నబిడ్డలు మనని [illegible] నని భయం. వ్యాధి బాధలు దాడికి వస్తాయా అని భయం. [illegible] ఆర్జన చాలుతుందా, మన మనుగడ సాగుతుందా, ఇలా [illegible] మాత్రంగా ఉంటూ మనం దాటిపోతామా లేదా అని భయం. భయం, భయం, భయం అంతా భయం. [illegible] భయం. జీవించడమే ఒక భయం !

కాని మన పెద్దలేం చెబుతున్నారు. [illegible] పడవద్దని చెబుతున్నారు. అసలు [illegible] చెబుతున్నారు. భయం మనని అన్నివిధాలా [illegible], భయపడుతున్నకొద్దీ మనం అన్ని విలువలకి [illegible] మనే, విలువలకు దూరమవుతున్నకొద్దీ, భయం [illegible] పెరుగుతుందని జీవితంలో భయమొక్కటే [illegible] చెబుతున్నారు.

సోదరులారా ! కొంచెం ఆలోచించండి. నేటి సమాజంలో ఇన్ని మోసాలు. ఇన్ని దగాలు ఎందుకని జరుగుతున్నాయి. భయం వల్లనే ! ఇన్ని దగాలు, ఇన్ని మోసాలు చేస్తేగాని నేనొక స్థాయిదాటి పైకిపోలేనని మనిషికి భయంకలగటంవల్లనే ! నేటి సమాజంలో ఇన్ని కొట్లాటలు, ఇన్ని హత్యలు ఎందుకు జరుగుతున్నాయి. నన్ను అవతలివాడు ఇలా బ్రతకనివ్వడేమోనన్న భయంవల్లనే ! చూశారా మనం చూస్తున్న ఈ దగాల వెనక, మోసాల వెనక, కక్షలవెనక, కార్పణ్యాల వెనుక, చివరకు హత్యలవెనక, కిరాతకాల వెనుక ఉన్నది భయమేనని ! భయమే ఇన్ని రూపాలు ధరించి, మనను అన్ని విధాలా హతమారుస్తోందని ! చూశారా గమనించారా భయమన్నది ఎంత భయంకరమైనదో !

భయపడవద్దు. భయపడి దిగజారవద్దు. దిగజారుతూ విలువలన్నింటినీ వదులుకోవద్దు. పరిస్థితులతో రాజీపడుతూ అనుక్షణం చస్తూ బ్రతకవద్దు.

మీరు అనుకున్నట్లుగా మీరు బ్రతకండి. పెద్దలు చూపిన బాటలో నడవాలని మీరనుకోండి. అలా నడిచేటందుకు దీక్ష బూనండి. కంకణధారులుకండి !

పెద్దలుచూపిన మార్గమేమిటన్నది మీకు తెలుసు. కానీ మీరా మార్గాన నడవలేక పోతున్నారు. ఎందువల్ల ? ఆ మార్గాన నడిస్తే బ్రతుకు ఇలా గడవదేమో అన్న భయంవల్ల ! మిత్రులారా ! మార్గం తెలియక మనం చెడిపోవడంలేదు. ఆ మార్గాన నడిచే ధైర్యంలేక, ధైర్యంచాలక మనమిలా అయిపోతున్నాం.

భగవద్గీతలో వ్యాసభగవానుడంటాడుకదా' 'ఈ బాటలో ఏ మేరకు నడిస్తే, ఆ మేరకు భయం తొలిగిపోతుంది' అని. అంటే అర్థమేమిటి. ఆబాటలో మనం నడవకపోబట్టే, నడవడానికి భయపడబట్టే, ఈభయం ఇంతగా మనల్ని గుంజగలుగుతోందన్నమాట. ఒక్కసారి దృఢంగా సంకల్పించి ఆ బాటను పడితే క్రమంగా ఆ భయం మనల్ని విడిచిపెట్టిపోతుంది. కనుక భయపడకండి బాటలో నడవండి.

గంభీర వదనులై ఉన్నారు స్వామి. స్ఫూర్తిమంతంగా చూస్తున్నారు. కనుచూపుమేరలో కనబడుతున్న వారదందరికీ ఆ స్ఫూర్తి అందేలా చూస్తున్నారు.

## శ్రమ పడకండి - కృషిచేయండి

మీరు కృషిచేస్తున్నారా, శ్రమపడుతున్నారా ? శ్రమ పడకండి కృషిచేయండి. శ్రమపడటానికీ, కృషిచేయడానికీ చాలా తేడా ఉంది గమనించండి.

శ్రామికులు అన్నపదం వినబడినప్పుడల్లా నాకు చాలా బాధకలుగుతుంది. శ్రామికులు అంటే శ్రమజీవులూ శ్రమపడే వాళ్ళు అని అర్థమొస్తుంది. ఆ జీవితాలలోని కళాకాంతులను ఆ పదమే లాగేస్తున్నదా అనిపిస్తుంది నాకు.

శ్రమ అనగానే అలసట అనిపిస్తుంది. కృషి అనగానే తృప్తి అనుభవానికి వస్తుంది. అలసట చెందుతూ పనిచేస్తే అది శ్రమ అవుతుంది. తృప్తిననుభవిస్తూ, పనిచేస్తే అది కృషి అవుతుంది. రెండుస్థితులకూ ఎంత తేడా ఉందో గమనించండి.

అలసట చెందుతూ పనిచేయవద్దన్నారు మన పెద్దలు. అసలు పని చేయడం చేతకాకపోవడం వల్లనే అలసట వస్తున్నది అన్నారు. పని చేయడమెలాగో నేర్చుకోమన్నారు. తృప్తిననుభవిస్తూపనిచేయమన్నారు. దానినే వారు కర్మయోగమన్నారు.

మనస్సు ఇంద్రియాలలోనికి చెదురుతూ, పరిస్థితులకు బెదురుతూ పనిచేస్తున్నప్పుడు అలసిపోతూ ఉంటుంది. అప్పుడా పని శ్రమ అవుతుంది. మనస్సు, బుద్ధిని కూడుకొని, హృదయం తోటి అనుసంధానాన్ని పెంచుకున్నప్పుడు ఇంద్రియాలను నడుప గలుగుతుంది. పరిస్థితులను మలచగలుగుతుంది. అప్పుడలా చేసిన పని కృషి అవుతుంది.

శ్రమ ఎక్కువకాలం పడలేం. కృషి ఎంతకాలమయినా చేయగలం. అలసట చెందుతూ శ్రమించటానికికాదు మనమీ భూమి మీదకు వచ్చింది. ఆత్మానుభూతిని పొందుతూ కృషి చేయు డానికి మన మీ భూమిమీదకు వచ్చాం. ఈ సత్యాన్ని మనస్సుకు తెలియచెప్పండి. ఈ రోజునుండీ శ్రమపడకండి. కృషిచేయండి.

స్వామి వాక్కులు జీవితాలను వెలిగిస్తున్నాయి. స్వామి చూపులు జాతి మనస్సును మళ్ళిస్తున్నాయి. సభ ఉత్తేజిత మవుతున్నది. కృషికి ఉన్ముఖమవుతున్నది.

# ఎదురు చూడకండి - ఎదురుగా చూడండి

ఎందుకలా ఎదురుచూస్తారు? ఒక్కసారి ఎదురుగా చూడండి. మీరేం చేయాలీ అన్నది మీముందే పెట్టబడి ఉంటుంది. చూడకపోతే చూడలేకపోతే అది మీ దోషమే అవుతుంది. ఎదురు చూడకండి ఎదురుగా చూడండి.

అవకాశాలకోసం ఎదురుచూస్తూ, జీవితాన్ని కాలక్షేపంగా గడిపేస్తున్నవారు ఎందరో కనబడుతున్నారు. వారిని చూస్తుంటే జాలివేస్తున్నది, 'ఎదురుగా ఉన్నదే అవకాశమని వారికెందుకు తెలియడం లేదా' అని.

ప్రకృతిమాత కరుణామయి. ఆమెఅందరికీ ఎప్పటికప్పుడు అవకాశాలను కలగచేస్తూనే ఉంటుంది. కానీ మనిషి చిత్రమయిన వాడు. తాననుకున్న అవకాశమేదో రావడంలేదనీ, వస్తున్న అవకాశాలన్నింటినీ వదులుకుంటూ ఉంటాడు. నీకేంకావాలో నాకు తెలియదా అన్నట్లుచూస్తుంది ప్రకృతి. ఆ తల్లి చూపునుగమనించుకునేస్థితిలో ఉండడు మనిషి. అతడెటో చూస్తున్నాడు. ఎందుకో చూస్తున్నాడు. ఏమో అయిపోతున్నాడు. ఎందుకిలా అయిపోతున్నావంటే 'అదేనండీ ఏ అవకాశమూ లభించడంలేదు' అంటున్నాడు. ఎదురుగా వస్తున్న అవకాశాలను పట్టించుకోనివాడికీ, నిర్లక్ష్యం చేస్తున్నవాడికీ, కావాలని పోగొట్టుకుంటున్నవాడికీ ఇంక ఏ అవకాశం లభిస్తుంది! ఏ అవకాశం లభించాలి!

ఇదీ ఇప్పటి నీ కర్తవ్యమని ప్రకృతిమాత మనముందు ఏ చిన్నపనిని పెట్టినా, దానిని మనం శ్రద్ధగా చేయగలగాలి.

చిన్నపని కదా అని దానిని నిర్లక్ష్యంచేస్తే, ఈ చిన్నపని పోతుంది. నీవనుకున్న పెద్దపని, పొరపాటున కూడా నీ చెంతకు రాదు. గుండీలే కుట్టడానికి బద్ధకిస్తున్నవాడికి బట్టల్ని కుట్టమని ఎవరిస్తారు.

ప్రకృతిమాత మనకప్పగించిన ప్రతిపనినీ శ్రద్ధగా మనం చేస్తూ పోవాలేగానీ. మనం అనుకున్న దానికన్నా మించిన పనులు మన దగ్గర కొస్తాయి. ఆమె మన కథను అలా నడిపిస్తుంది.

వర్తమానాన్ని నిర్లక్ష్యం చేస్తున్నవాడు భవిష్యత్తును సృజించుకోగలడంటారా ! 'వర్తమానంపైన శ్రద్ధపెట్టండి.' అనే వర్తమానాన్ని ప్రకృతి మాత నిరంతరం మన కందిస్తూ ఉంటుంది.

ఎదురుగా ఉన్నదే మన కర్తవ్యం అని మనం చేయడం మొదలుపెడితే మనకేంకావాలో, మనమేం కావాలో అందుకు తగిన అన్ని పనులూ అలా వచ్చి మన ముందు నిలబడుతూ ఉంటాయి. ఈ సత్యాన్ని గమనించండి.

ఎదురు చూడకండి, ఎదురుగా చూడండి.

## ఊహించకండి - జీవించండి

ఏమిటలా చూస్తూకూర్చుంటారు. ఎందుకలా ఊహల్లో తేలి ఆడతారు. ఊహిస్తున్న క్షణాలలో మీరు జీవించడం మానేస్తు న్నారని మీకు తెలుసునా, ఊహించకండి. జీవించండి.

వస్తున్న ఊహను వస్తున్నట్లుగానే జీవితంగా రూపొం దించండి. కొంతకాలం ఊహిద్దాం. ఆ తరువాత జీవిద్దాం అను కోకండి. ఊహించడానికి అలవాటు పడినవాడు ఇక జీవించడానికి సిద్ధపడలేడు. మీది ఊహాజీవితం కాకూడదు. మీ ఊహ జీవితం కావాలి. నిజంకావాలి. నిజంగా మీరు జీవించాలి !

కలలు కంటూ ఉండిపోకండి. ఆ కలలను అప్పుడే జీవిత సన్నివేశాలరూపంలో ఇలలో ప్రతిష్ఠించండి. కలతోపాటు మీరూ కరగిపోవద్దు. మీ తరువాత కూడా మీ జీవితం ఈ భూమిమీద మిగిలి ఉండేటట్లు చూసుకోండి.

ఊహను ఊహగాకాక, జీవితంగా రూపొందింపేస్తున్నా రనుకోండి. కొన్నాళ్ళకు మీ ఊహ సంకల్పరూపాన్ని ధరిస్తుంది అప్పుడు మీ కిక కలిగేది సంకల్పాలే. ఆ సంకల్పాలు జీవిత సన్నివేశాలుగా రూపొందుతూ ఉండగా మీరు ధన్యజీవులవు తారు. చరితార్థులవుతారు. కనుక ఊహిస్తూకాలాన్ని వెళ్ళబుచ్చ కండి. జీవిస్తూకాలానికి రూపుదిద్దండి !

సూటీగా చూస్తున్నారు స్వామి. చురుక్కుమంటున్నాయి ఆ చూపులు. మేలుకోరేచూపులవి. మేలుకొలిపే చూపులవి. వింటున్నవారు మేల్కొంటున్నారు. జీవించడానికి సిద్ధమవుతున్న మమ్మల్ని దీవించమంటున్నారు.

# 5. ఆత్మవిద్య - అసలు రూపం

1. హా హా హా
2. దేహనింద కాదది-దైవనింద
3. సమస్య కాదది సహజం
4. నలగడం కాదు-మెలగడం చేతకావాలి
5. అడిగిందల్లా ఈయడు-అవసరమైంది ఇస్తాడు
6. అవతార్ అపతార్ అంటారు మీరెప్పటికలా అవుతారు
7. కొలుస్తున్నారు
8. యాంత్రిక జీవనంకాదు-యాత్రిక జీవనం కావాలి
9. కలసి రావడం
10. పాత పుస్తకాలు కావు-అవి 'పాఠ' పుస్తకాలు
11. వద్దు అనలేదు-హద్దు అన్నారు
12. ఆశ్చర్యాలనుండి ఆచరణకు
13. మరల మరల స్మరించండి-'మర'లా మాత్రం స్మరించకండి
14. రాజయోగం గాదు-రాజీయోగం
15. ఊపరి ప్రశ్నలనుండి పరి ప్రశ్నానికి
16. భక్తి ఒక మార్గం కాదు-అది మన గమ్యం

## చా చా చా

చూడగా : మనిషి జీవితంలో మూడు 'చా' లు కనబడుతున్నాయి. అతని జీవితాన్ని ఈ మూడు 'చా' లే ఆక్రమిస్తున్నాయి. ఈ మూడు 'చా'లను అధిగమించలేక అలా బ్రతికేస్తున్నాడు మానవుడు. అవేమిటో తెలుసునా ? బాల్యాన చాపల్యం, యౌవ్వనాన చాంచల్యం, వార్ధక్యంలో చాదస్తం, మొత్తం మీద మూడు 'చా'లు, మన జీవితం వృధాగా గడిచిపోవడానికి ఇవి చాలు.

బాల్యంలో కూడని పనులు చేస్తే, ఇదిబాల్యం, చాపల్యం దానికి సహజం అంటారు. యౌవ్వనంలో పెర్రి పనులు చేస్తే యౌవ్వనం కదండీ ! ఆ మాత్రం చాంచల్యముంటుంది అంటారు. వృద్ధాప్యంలో అయిన దానికీ కాని దానికీ కలుగచేసుకుంటూ అయినవాళ్ళకు కూడా తలనొప్పి కలిగిస్తున్నవేళ వృద్ధాప్యం కదండీ ఈ మాత్రం చాదస్తం తప్పదు అని సరిపెడతారు.

అది సరే ! ఇంతకీ మనిషెప్పుడు మనిషిగా జీవించేది ? చాపల్యం, చాంచల్యం, చాదస్తం అంతలో తనువును చాలించడం. మనిషి జన్మ ఎత్తినందుకు మనమేదో చాలా చేస్తాం, చాలా ఇస్తాం, అని అనుకుంటుంది ప్రకృతి, కాని మనమేం చేస్తున్నాం ? ఈ 'చా'లలో పడికొట్టుకుంటూ తనువులు చాలిస్తున్నాం. అప్పుడు ప్రకృతి తనకు ప్రతినిధులుగా మహనీయులను నిలబెట్టి కాల కాలాలలో, దేశదేశాలలో, మానవ జాతికి ఉపదేశింప జేస్తున్నది. ఏమని, 'మానవుడా నీ కొరకు ఈ దేహమున్నది. ఈ దేహము కొరకు నీవు లేవు. ఈ సత్యాన్ని నీవు గమనించు.

అప్పుడు దేహం యొక్క ప్రభావం నీ మీద పడదు సరికదా, కర్తవ్య నిర్వహణకు దివ్యోపకరణంగా దేహాన్ని నీవు వినియోగించ గలుగుతావు. అలాగే వయసనేది కూడా దేహానికి సంబంధించినదే ! ఎప్పుడైతే నీవు దేహం యొక్క ప్రభావానికి అతీతంగా నిలిచి, దివ్యోపకరణంగా దేహాన్ని వినియోగించడం మొదలు పెట్టావో, అప్పుడిక వయస్సు యొక్క ప్రభావం కూడా నీ మీద పడదు సరికదా, ఆ వయస్సు కర్తవ్య నిర్వహణలో నీకెంతో వినియోగపడుతుంది.

నీ చిన్నతనం అన్నింటినీ నేర్చుకోవడానికి పనికి వస్తుంది. నీ యౌవ్వనం కర్తవ్య నిర్వహణకు కావలసిన శక్తియుక్తులను సమకూర్చి పెడుతుంది. నీ వృద్ధాప్యం అనుభవాన్ని పంచిపెట్టడానికి కావలసిన పెద్దరికాన్ని నీకు అందిస్తుంది. చూశావా ! ఈ చిత్రం ! దేహం ప్రభావం నీ మీదపడినప్పుడు 'వా' లతో గడిచిపోయే నీ జీవితం, దేహాన్ని నీవు వినియోగించడం నేర్చిన వేళ ఎంతగా సార్థకమౌతుందో చూశావా ! సోదరులారా ! మహనీయుల సందేశాల సారాంశమిది !

మానవధర్మ శిక్షణ సంస్థ నెలకొల్పబడిన తర్వాత నిర్వహింపబడిన తొలిగురుపూజలలో తొలిరోజున ఆ గురుపూజా వేదిక పై నుండి స్వామి ఇచ్చిన సందేశంలోని భాగమిది. అలాస్వామి సందేశమిస్తుంటే వేదిక మీద వేంచేసి ఉన్న మహనీయులందరూ 'ఔనౌను' అనాదిగా మేము ఇస్తూవస్తున్న సందేశమిదే', అంటూ తమ తమ దరహాసాలతో బదులు పలుకుతున్నారా ! అన్నట్లు ఉన్నది ఆ దృశ్యం. అది అపూర్వం.

# దేహనింద కాదది దైవనింద

ఇటీవల కాలంలో ఆధ్యాత్మికతను బోధించాలి. అనుకునే వారిలో కొందరికి ఒక చిత్రమైన ఊహకలుగుతోంది. అదేమిటి అంటే ఈ దేహాన్ని గురించి సాధ్యమైనంత తక్కువ చేసి చెప్పడం ఈ దేహం చీము నెత్తురులతో కూడుకున్నదనీ, నశించిపోయే దనీ, రకరకాలుగా వర్ణించిచెప్పి, కనుక ఈ దేహాభిమానాన్ని వదలి దైవం వైపుకు మళ్ళండి' అని నచ్చచెప్పే ప్రయత్నం చేస్తున్నారు పాపం ! దైవం వైపుకు మళ్ళడం మంచిదె నిజానికి కావలిసిందికూడా అదే అయితే అందుకు దేహాన్ని నిందించవలసిన అవసరం ఏముంది ? అన్నది పాయింట్.

పతంజలి ఒక చక్కటి మాట చెప్పాడు. భౌతికంగా, మానసికంగా శుచిగా ఉండటం అభ్యాసమైన కొద్దీ దేహం ఎడల వ్యామోహం తొలగిపోతుందని, అంటే దాని అర్ధం ఏమిటో తెలుసునా ? ఈ దేహంనాది అన్నభావం కరిగిపోయి, 'ఈ దేహం భగవంతుని విగ్రహం, కార్యసాధనకై అతనిచే రూపొందింపబడిన ఒక దివ్యోపకరణం.' అన్న దర్శనం కలుగుతుందని. ఆధ్యాత్మిక సాధనలో నిజంగా ప్రవేశించిన వానికి దేహంయొక్క దివ్యత్వం బోధపడుతుంది తప్ప దానిని నిందించాల్సిన అవసరం అతనికేమీ కనబడదు, సరికదా దివ్యత్వం బోధపడుతున్నకొద్దీ దేహాన్ని అతడు పవిత్రంగా నిలబెట్టుకుంటూ, నిరంతరం సద్వి నియోగం చేసే ప్రయత్నం చేస్తాడు. అలా చేస్తున్నకొద్దీ దేహానికి, ఇంద్రియాలకు, మనస్సుకు మరింతగా శక్తియుక్తులు లభిస్తూఉంటాయని కూడా ఆ పతంజలే వివరించాడు.

కాబట్టి ఈ దేహం మనది అన్న భావన కరగిపోయి 'దైవ దత్తమైన ఉపకరణమిది.' అన్న దర్శనం మనకు కలగాలితప్ప ఎన్నడూ ఎట్టి పరిస్థితులలోనూ దేహనిందను మనం చేయకూడదు అలాచేస్తే దేహనిందకాదది దైవనిందే అవుతుంది.

ఇంకో చిత్రమేమిటంటే దేహాన్ని అదేపనిగా నిందిస్తున్నాము అంటే ఆ దేహాన్ని దైవంకన్నా వేరుగానన్నా మనం చూస్తూ ఉండాలి. లేదా ఈ దేహం మనది అన్న భావం అన్నా మనలో ఏమూలో పనిచేస్తూ ఉండాలి. ఈ రెండు భావనలూ ఆరోగ్యానికంత మంచివికావు. కనుక దేహంలోకూడా దైవాన్ని చూస్తూ. దాన్ని ఆ దైవం అప్పగించిన కార్యక్రమానికి మాత్రమే వినియోగించగలిగిన వివేకం మనకు కలగాలి.' అంటూ సాదకునికి కావలసిన వెలుగును గుమ్మరించారు స్వామి ఒక ప్రసంగంలో.

## సమస్య కాదిది సహజం

మనిషి సంతోష స్వరూపుడై ఉండాలి. ఎదురవుతున్న సన్నివేశాలను వాటికి తగినట్లుగా నిర్వహిస్తూ తాను మాత్రం సంతోష స్వరూపుడై వెలుగొందగలగాలి. సన్నివేశాన్ని టాకిల్ చేసే వేళలో హడావిడిపడి తాను తన నిజస్వరూపాన్ని కోల్పో కూడదు. ప్రతి చిన్న సన్నివేశానికి మన స్వరూపాన్ని మనం కోల్పోతున్నాం అంటే ఇక అర్థమేముంది చెప్పండి.

అయితే అడుగడుగునా సమస్యలొస్తూ ఉంటే మీరన్నది అప్పుడెలా సాధ్యం? అని మీరు అనవచ్చు. మీకొక సత్యం చెబుతున్నాను గమనించండి. మనిషిముందు ఎప్పుడూ అతని శక్తికి మించిన సన్నివేశమే ఉంచబడుతుంది. అది ప్రకృతి లోని ఒక ఏర్పాటు. మన శక్తికన్నా చిన్న సన్నివేశాలు మన ముందుకు వస్తూ ఉంటే మనం ఎదగడానికి అవకాశమేది? ఉన్న స్థితికన్నా ఉన్నతస్థితిని పొందడానికి, ఇదివరకటికన్నా ఎదుగుదలను అనుభవించడానికి ఒక అవకాశమే ఈ మానవ జన్మ! అలాంటి అవకాశాన్ని మనం సద్వినియోగం చేసుకోవాలి అన్న సంకల్పంతో ప్రకృతి ఎప్పుడూ కూడా మనకు మించిన సన్నివేశాలనే మన ముందు పెడుతుంది. ఆ సన్నివేశాలను మనం నిర్వహించాలీ, అంటే మనం ఎదిగి తీరాలి. ఎదిగి తీరతాం కూడా! ప్రకృతికికూడా కావలసిందదేకదా! మన శక్తికిమించిన సన్నివేశం ఎదురైనప్పుడు మనం దానిని సమస్య అంటున్నాం. ప్రకృతి అది సహజం అంటున్నది. సమస్యకాదిది సహజం అన్నది ప్రకృతి యొక్క ఉపదేశం. ఈ వాస్తవం తెలియక మనిషి వెంబేలుపడిపోతూ ఉంటాడు. ఇలాంటి వాస్తవాలను గ్రహించడానికే మన పెద్దలు 'తత్త్వజ్ఞాన' మని పేరు పెట్టారు, 'తత్త్వం' అంటే ఏమిటి? స్వభావం. ఈ సృష్టియొక్క స్వభావాన్ని గ్రహిస్తూ తదనుగుణంగా జీవనయాత్రను నిర్వహించే వారే తత్త్వవిదులు అనబడతారు.

ఇటువంటి సత్యాలు తెలుస్తున్నకొద్దీ మనిషి మనస్సుకు నిమితం చిక్కుతుంది. నిమితం చిక్కినకొద్దీ అతడు సంతోష

మయమైన తనస్థితిలోనుండే సకల కార్యక్రమాలనూ నిర్వహించ గలుగుతాడు. ఇలా నిర్వహించడంలో అపారమైన నైపుణ్యాన్ని చూపినవాడే శ్రీ కృష్ణుడు, అందుకే అతడు 'కర్మాచరణలో నైపుణ్యాన్ని చూపగలగటమే యోగమని' ఉపదేశించాడు.

## నలగడంగాదు - మెలగడం చేతకావాలి

విభిన్న మనస్తత్త్వాలు కలిగిన మనుషుల మధ్యలో మన మున్నప్పుడు, మన జీవితం వారితో ముడిపడి ఉన్నప్పుడు, అడుగడుగునా వారితో కలసి సన్నివేశాలను నిర్వహించ వలసి వచ్చినప్పుడు 'ఏమిటోనండీ ! ఇన్ని రకాల మనస్తత్త్వాల మధ్యలో నేను నలిగి పోతున్నాను' అంటూ ఉంటాం. 'అలా నలగడం కాదు నాలా మెలగడం నేర్చుకోండి'. అంటున్నది రామాయణంలోని సుమిత్ర.

సుమిత్రకు ఒకవైపు కౌసల్య. మరొక వైపు కైక. 'పట్ట మహిషినైనప్పటికీ భర్త అంతగా నన్ను పట్టించుకోవడంలేదని కౌసల్య బాధ. 'కావాలని కట్టుకున్నాడు కదా ! అటువైన మరొ కరికి ఆయనని ఎందుకు చెందనిస్తాను ?' అన్నది కైక పంతం. ఈ ఇద్దరి మధ్యలో సుమిత్ర. పేరుకు తగినది. ఇద్దరితోనూ మైత్రి చేయగలిగినది. అంతేకాదు తాను, ఇద్దరు బిడ్డలను కని ఆమె బిడ్డకొకరిని, ఈమె బిడ్డకొకరిని సమ దృష్టితో అప్పగించగలిగింది. ఇది నిజంగా ఎంత విచిత్రం ! ఎంత లోకోత్తరం. కౌసల్యను

చూసి కైక ఈర్ష్యపడింది. కైకను చూసి కౌసల్య భయపడింది. వీరిద్దరి మధ్యా సుమిత్ర నిలబడింది. నిజానికి ఆమే నిలబడింది. ఇంకెవరన్నా ఆమె స్థానంలో ఉంటే వారిద్దరి మధ్యా పడి నలిగి పోయేవారు. నలిగిపోతున్నాం బాబోయ్ అని ఆక్రోశించేవారు. కాని ఆమె నలగడానికి బదులుగా మెలగడం ఎలాగో మనకు చూపిస్తున్నది. అది మెలగడమే కాదు. వారిద్దరి మధ్యా ఆమె వెలగడం కూడా ! ఇలాంటి వారిని చూస్తున్న కొద్దీ, ఆరాధిస్తున్న కొద్దీ నలగడం అనే స్థితి నుండి మెలగడం, మెలగడం అనే స్థితినుండి వెలగడం, మనకు కూడా చేతనవుతుంది అంటూ స్వామి ఒకానొక శ్రీరామనవమి సందర్భంలో ఉపన్యాసం చేశారు.

## అడిగిందల్లా ఈయడు అవసరమైంది ఇస్తాడు

నేనిన్నాళ్ళనుండీ ఫలానా మంత్రం చేస్తున్నాను. కాని నాకేం ఒరిగింది. నేననుకున్నది ఒక్కటీ కానప్పుడు నేనింక ఆ మంత్రం ఎందుకుచేయాలి ? అంటూ ఉంటారు ఒక్కొక్కళ్ళు.

ఒక చిన్న ప్రశ్న. ఒక మంత్రంచేసినా, ఒక ప్రార్థన చేసినా మనకుతోచిన జపతపాదులు ఆచరించినా, ఇవన్నీ దేని కోసం ? మనం చెప్పినట్లు దేవుడు నడచుకోవడానికా ? దేవుడు చెప్పినట్లు మనం నడచుకోవడానికా ? మనం చెప్పినట్లు దేవుడు నడచుకోవడానికయితే దానిని జపం, తపం అనరు. దేవుణ్ణి నస పెట్టడం అంటారు. తీరిగ్గా కూర్చుని, తాడపాశం పెడ్తూ దేవుణ్ణి సతాయించడమా ప్రార్థన అంటే ? చాల బాగుంది మన నిర్వచనం.

అలాకాక దేవుడు చెప్పినట్లుగా మనం నడచుకోవడానికే ఈ పూజలూ, జపాలు అని గ్రహించగలిగినపుడు మనం అనుకున్నవి కాలేదు అన్న ఆలోచనే ఉండదు. ఆయన అనుకున్నట్లుగా మనం ఉండటానికిగాను, మనం చేసే ప్రయత్నమే ప్రార్థన ! ఎప్పటికప్పుడు ఆయనతో మనకు గల ప్రకృతిని సరిచూచుకుంటూ, ఆయన ప్రతినిధిగా జీవించడానికి కావలసిన వెలుగును ఆయన నుండి స్వీకరించడానికే మన ప్రార్థన. ఈ సత్యాన్ని మనం ఎంతగా గమనించుకుంటే అంతగా దైవానికి దగ్గరవుతాం.

ఈ సందర్భంతో రవీంద్రుడు దైవాన్నుద్దేశించి ఒక మాట చెప్పాడు. 'ప్రభూ ! నీ వైపుచూసి, నా మానసిక చాపల్యాన్ని ఆపుకోలేక ఏవేవో అడుగుతూ ఉంటాను. అందులో కొన్నింటిని నిస్తావు. మరి కొన్నిటిని నీవివ్వవు. ఇచ్చినవాటి విషయంలో కన్నా ఇవ్వని వాటి విషయంలోనే నేను నీకెక్కువగా కృతజ్ఞతలు చెప్పుకోవలసిఉంది. ఎందుకనీ అంటే నేను నాకుతోచింది అడుగుతాను. నీవు నాకు అవసరమైంది ఇస్తావు. నేను కోరిన వాటిలో నిజంగా నాకవసరమైనవేమిటో నీకన్నా నాకెక్కువ తెలుస్తుందా? ప్రభూ ! కనుక నేనడిగిన వీయనప్పుడే నిజంగా నేను నీకు థాంక్స్ చెప్పాలి. ఎందుకనీ ! అవి నాకవసరం కావని శ్రద్ధతో గమనించి నాకివ్వనందుకు. అలా ఎప్పటికప్పుడు కంటికి రెప్పలా కాపాడుకుంటూ ఉంటావు నువ్వు.

విన్నారా. రవీంద్రుని మాటలు ! సత్యాన్ని ఎంత తీయగా చెప్పాడాయన ! ఎంత తీరుగా చెప్పాడు ! మన పిల్లవాడే ఉంటాడు. చూసిందల్లా అడుగుతూ ఉంటాడు. అప్పుడు మనం ఏం చేస్తాం ? అందులో ప్రమాదంలేనివి వాడు ఆడుకోవడానికి

పనికి వచ్చేవీ వాడికిస్తాం. వాడు ఆడుకోవడానికి పనికిరానివి, ప్రమాదకరమైనవి వాడడిగినప్పుడల్లా, ఏవో కబుర్లు చెప్పి వాడిని మంపస్తాం. హుష్ కాకెత్తుకుపోయింది అంటాం. వాడటు చూస్తాడు, మనమిటు దాచేస్తాం. అంతేగా ! వాడు ఏ రేజరో అడిగానుకోండి మనం గడ్డం గీసుకుంటున్నప్పుడుచూసి, మా అబ్బాయేకదా ! అడిగాడు అని ఇచ్చేస్తామా ? దేవుడుకూడా మన విషయంలో సరిగా అల్లాగే ప్రవర్తిస్తాడు. కనుక ఈ మంత్రం చేస్తే ఏమొచ్చింది ! ఈ ప్రార్థన చేస్తే ఏమొచ్చింది. అనకండి. మన ప్రకారం అతడు నడుచుకోవడంకాదు. అతడి ప్రకారం మనం నడుచుకోవాలి. అలానడచుకోవడానికిగాను మనం దైవాన్ని చేస్తున్న అభ్యర్థనే మన ప్రార్థన.

అంటూ స్వామి దైవాన్ని నసపెట్టేవారి పని పట్టారు ఒకసారి.

## అవతార్ అవతార్ అంటారు - వీరెప్పటికి అలా అవుతారు

ఒకసారి స్వామి ఒకానొక ఆధ్యాత్మిక సోదర బృందాన్ని ఉద్దేశించి మాట్లాడటానికి అంగీకరించి వెళ్ళారు. ఆ బృందం వారు సంకీర్తన చేస్తూ మధ్య మధ్యలో 'అవతారునికీ జై కలియుగ అవతారునికి జై' అనసాగారు.

స్వామి వారిని ఉద్దేశించి మాట్లాడుతూ ఇలా అన్నారు: మనకొక అవతారమూర్తి నచ్చడం మన అదృష్టం. ఆ అవతార మూర్తి యొక్క స్మరణ అనుభూతి ప్రదమేకాని అస్మరణ యొక్క

పరమార్థమేమిటో మనం గమనించుకోవాలి. మనం ఆయనలా ప్రవర్తించడానికి మనలను ఉన్ముఖం చేయడానికే ఆ స్మరణ. మనం ఆయనలా ప్రవర్తించకుండా కేవలం స్మరించుకుంటూ, జై కొడుతూ, తృప్తి పడుతూ కూర్చుంటే చూసి చూసి ఏదో ఒక రోజున ఆయనే మనకు కనిపించి అవతార్ అవతార్ అంటారు. మీరెప్పటికి అలా అవుతారు ? అని అడుగుతాడు. ఎందుకనంటే మనం ఎలా అవ్వాలో ఎలానడుచుకోవాలో చూపించడానికే కదా ఆయన దిగివచ్చింది ! మరి మనం అలా అవకుండా, నడుచుకోకుండా కూర్చుండిపోతే ఆయన అడగడా ? మీరిలా కూర్చుండి పోయినప్పుడు నేను దిగి వచ్చిన ప్రయోజన మేమిటని ఆయన ప్రశ్నించడా ? ఆలోచించండి. అవతారుని అడుగు జాడల్లో ప్రయాణం చేయడానికి ఉద్యమించండి.

స్వామి మాటలు వారికి ఆశ్చర్యాన్ని కలిగించాయి. వారు స్మరిస్తున్న అవతారుడే ఈ రూపంలో గోచరించి, వారిని హెచ్చరిస్తున్నట్లుగా అనుభూతి చెందారు వాళ్ళు.

## కొలుస్తున్నారు

'మాకు మొదటినుండీ వారే ఇష్టదైవం. వారినే నిరంతరం మా ఇంటిల్లిపాదీ కొలుస్తూ ఉంటాం' అన్నాడొక సోదరుడు,

స్వామి చిరునవ్వు నవ్వారు.

'ఏమిటి మాస్టరుగారూ ? నవ్వుతున్నారు' అని అడిగాడతడు.

అందుకుస్వామి ఇలా అన్నారు: 'ఏమీలేదు. కొలుస్తున్నారు అన్నపదప్రయోగాన్ని గూర్చి ఈపదం ఎంత చిత్రమైనది! దైవాన్ని రెండురకాలుగా కొలిచే వాళ్ళున్నారు. రెండు రకాల వాళ్ళూ ఆయన్ను కొలుస్తున్నారు. మొదటిరకంవారు మామూలుగా భక్తివిశ్వాసాలతో కొలుస్తున్నారు. రెండవరకంవారు ఆయన ఎంతవరకు దేవుడు? అని కొలుస్తున్నారు. అంటే మహిమలు చేయగలడా? లేదా? అడిగినవి ఈయగలడా లేడా? ఇతరులకన్నా చిన్నదేవుడా? పెద్దదేవుడా? ఇంతకూ ఈయన పవరెంత? ఈయన వలన జరిగే ఉపయోగమెంత? అని కొలుస్తూ ఉంటారన్నమాట! మొత్తంమీద కొలుస్తున్నారు. అన్నపదం ఇద్దరికీ సరిపోతుంది. ఇద్దరికీ అన్వయిస్తోంది. ఏమంటావ్? అందుకని నవ్వొస్తేను నవ్వుతున్నాను. ఇంతకూ నీవు మీ ఇష్టదైవాన్ని ఏ అర్థంతో కొలుస్తున్నావ్? అంటూ స్వామి అతనివైపు చూసారు.

అతను తనలో తానే నవ్వుకుంటూ తలవంచుకుని అది మీరే చెప్పాలి' అన్నాడు.

'తెలివిగలవాడివి' అంటూ వెన్నుతట్టి చిరునవ్వులు చిందించారు స్వామి.

# యాంత్రిక జీవనం కాదు - యాత్రిక జీవనం కావాలి

రాను రాను మనుషులు యాంత్రికమైన జీవనానికి అల వాటుపడుతున్నారు. అంటే వాళ్ళ జీవితం మెకానికల్ అయి పోతోంది. ప్రకృతితో సంబంధం క్రమంగా సన్నగిల్లుతోంది. ప్రకృతితో సంబంధంఎవరికైతే సన్నగిల్లుతుందో, వారిజీవితంలో క్రమంగా అశాంతి నిండుతుంది. యంత్రాలతో పాటు మనం కూడా ఒక యంత్రమైపోయినట్లుగా భావనకలుగుతుంది. అదే పని అలాగే చేసుకుంటోపోవడం యాంత్రికమనబడుతుంది. అలాకాక రోజు రోజుకూ పనిలోనూ, చేయడంలోనూ కూడా విస్తృతి, ఎదు గుదలా కనబడినపుడు ఆ జీవితానికో రుచి ఏర్పడుతుంది. దాన్ని మనం యాత్రికజీవనం అనవచ్చును. యాత్రికుడు రోజూ ప్రయాణం చేస్తున్నాడు. కాని ప్రయాణం సాగుతున్న కొద్దీ కనబడే దృశ్యాలలోను, ఆ దృశ్యాలనుండి అతను పొందే అను భూతిలోనూ ఒకానొక నిత్యనూతనత్వం చోటు చేసుకుంటుంది. అప్పుడతనికి ప్రయాణం యొక్క అలసట తెలియదు. ప్రయాణం చేస్తున్నట్లే అనిపించదు. మరింత ప్రయాణం చేయాలనిపిస్తుంది. ఎందుకని ? మరింతగా అనుభూతి లభిస్తుంది కనుక ! మనది అలాంటి యాత్రిక జీవితంకావాలి. మన విధి నిర్వహణ అలాంటి యాత్రను తలపించాలి. మరిపించాలి.

యాంత్రిక జీవనంలో పడి కొట్టుకుంటున్న మనకు యాత్రిక జీవనం సాధ్యమవుతుందా ? అని అనుకోవద్దు. మనం దృఢంగా సంకల్పించినప్పుడు ఎందుకు సాధ్యంకాదు? అమెరికాలో

కొందరు సజ్జనులు భాగవతాన్ని చదువుకున్నారు. అందులో కృష్ణుడు తిరుగాడిన బృందావనాన్ని గూర్చి చదువుకుంటున్నప్పుడు వారి మనస్సులు పులకించాయి. 'మనమలాంటి బృందావనాన్ని ఎందుకు నిర్మించుకోకూడదు.' అనుకున్నారు. అంతే నిర్మించుకున్నారు.

మళ్ళీకోరి అవతరింప చేసుకున్న ఆ బృందావనానికి వారు 'న్యూబృందావన్' అని పేరు పెట్టుకున్నారు. స్త్రీలు గోపికలుగా రూపొందారు. పురుషులు గోపాలకులుగా రూపుదాల్చారు. పాడి పంటలను వృద్ధిచేశారు. కృష్ణుని స్మరణలో వృత్తివ్యాపారములను రాసలీలగా నిర్వహిస్తున్నారు. ప్రజ్ఞామయ స్వరూపుడైన కృష్ణుడితో తిరుగాడుతూ 'కృష్ణా కాన్షస్‌నెస్ మిషన్' పేర యాత్రిక జీవనాన్ని దివ్యంగా గడుపుతున్నారు. అమెరికా లాంటి దేశంలోనే అలాంటిది సాధ్యమైనప్పుడు మనకు ఎందుకు సాధ్యం కాదు ? కావలసినది దృఢసంకల్పం ! ఆత్మవిశ్వాసం ! ఆచరణశీలత ! ఆలోచించండి ! అంటూ ఒకానొక సందర్భంలో సోదరబృందాన్ని ఉద్దేశించి ప్రవచనం చేస్తూ పిలుపునిచ్చారు స్వామి.

## కలసి రావడం

'ఎన్ని పూజలుచేసినా, ఎన్నినోములునోచినా, ఏమిటో నండీ ! కలసిరావడంలేదు.' అంటుంటారు కొందరు. ఏమిటి కలసి రావాలి ? డబ్బులు, ఉద్యోగాలు, పెళ్ళిళ్ళు, పిల్లలు ఇవేనా ? అవన్నీ వచ్చాయనుకోండి. అప్పుడు మనం సుఖపడగలమని గ్యారంటీ ఉందా ? కనుక నిజంగా కలసిరావడం అంటే ఏమిటీ అంటే మనకి మనం కలసిరావడం. మనదేహం, ఇంద్రియాలు, మనస్సూ మనకు కలసి రావడం. మనం చెప్పినట్లుగా అవి నడచుకోవడం ! మన కర్తవ్యనిర్వహణలో మనపిగా అవినిలబడటం. అదీ కలసి రావటమంటే ! కనుక దేవుని దగ్గరకూర్చున్నప్పుడు ఈ కలసిరావడాన్ని గురించి ప్రార్థించకండి. అప్పుడు మిగతావి ఉన్నా, లేకున్నా కూడా మీరు సుఖపడగలుగుతారు' అంటూ స్వామి ఉపదేశించారు ఒక శుభవేళలో.

## పాత పుస్తకాలు కావవి - పాత్ పుస్తకాలు

రామాయణ, భారత భాగవతాది గ్రంథాల వైపుచూస్తూ వాటిసంగతి తెలియని వారు కొందరు 'ఇప్పడెందుకండీ ఇవన్నీ ఎప్పటివో పాతపుస్తకాలు కదా ! అందరూ ముందుకు పోతుంటే మనం వెనకబడి పోవటానికా ? అన్నట్లు వీటి సంగతి ఇప్పుడెందుకండీ అయినా ఈ నవీన యుగంలో వీటి అవసరం ఇంకా ఉందంటారా ?' అని అడిగేవారు తారసపడుతూ ఉంటారు అక్కడ

క్కడా అడపాదడపా పాపం. వాళ్ళకు తెలియదు. ఇవి పాత పుస్తకాలు కావనీ, పాత్ పుస్తకాలనీ !

పాత్ పుస్తకాలు- పాత్ అంటే మార్గం. మానవజాతి చిరకాలం సుఖపడడానికి కావలసిన సనాతన ధర్మమార్గం ! అలాంటి మార్గం యొక్క అవశ్యకత మానవజాతి ఉన్నంతవరకూ ఉండనే ఉంటుంది కదా ! అలాంటి దివ్య మార్గాన్ని గూర్చి తెలియజెప్పే దివ్యగ్రంథాలను పాతపుస్తకాలని అనవచ్చా ? అంటే మనకింక పుట్టగతులుంటాయా ? ఇంతమాట అంటున్నానని అనుకోకండీ. పుట్టినందుకు గతులుచూపే దివ్యగ్రంథాలు గదా అవి ! అందుకనే అలా అన్నాను ఏమంటారు. అని స్వామి అంటే, విన్నవారేమంటారు ? నాగస్వరానికి నాగులు తల ఊపినట్లు ఈ నాదస్వరానికి అన్ని కాలాల ప్రజలు తలలు ఊపక ఏం చేస్తారు ?

## వద్దు అనలేదు హద్దు అన్నారు

ఆధ్యాత్మిక జీవనం అలవరచుకోవడం అనగానే కొందరు లేని పోని ఆంక్షలు పెడుతుంటారు. సినిమాలు వద్దని చెప్పడంతో మొదలు పెట్టి పెళ్ళి చేసుకోవద్దు దాకా ఎన్నెన్ని వద్దులో ఉంటాయి వారి ఆంక్షల్లో.

ఇలాంటి వారందరూ ఒక సూక్ష్మాంశాన్ని గమనించాలి. భారతీయ సంప్రదాయంలో నాటినుండి నేటి వరకు మన పెద్ద

లెవరూ ఇలాంటి ఆంక్షలు పెట్టలేదు. వారు దేనిని వద్దనలేదు. హద్దు అన్నారు. అన్నీ అనుభవించవలసిందే ! అయితే హద్దు లెరిగి అనుభవించాలి. ఆ హద్దుల ఎడల ఎరుకగలగాలి అంటే మనలో వివేకం వెలగాలి. వివేకం వెలగాలి అంటే మనస్సు బుద్ధివైపుకు మొగ్గాలి. ఇంద్రియాలలో చిక్కుబడుతున్న మనస్సు బుద్ధివైపుకు మొగ్గి, ఆ బుద్ధి సారథ్యంతో ఇంద్రియాలను నడపడం నేర్చుకోవాలి.

అప్పుడు తెలుస్తుంది. ఈ సృష్టిలో అక్కరలేనిదిగానీ, అంటరానివిగాని ఏవీలేవని. అన్నీ ఆ దైవము యొక్క వ్యక్త రూపాలేనని దేని ఆవశ్యకత, దేని వినియోగం దానికి ఉన్నాయని ! ఏ అంశం ఎందుకున్నదో, బుద్ధి వెలుగులో గమనించుకొని, ఆ అంశాన్ని అందుకే వినియోగించుకోగల్గడం మనకు చేతకావాలి. హద్దులెరిగి ప్రవర్తించడం అంటే అదే ! కనుక పెద్దలైనవారు వద్దు వద్దని ఆంక్షలు పెట్టకుండా సృష్టిలోని ఆయా అంశాల నిజస్వరూపాన్ని సామాన్యులకు తెలియజెప్పి, ఏ దృష్టితో ఆయా అంశాలను, ఎలా వినియోగించుకోవాలో నేర్పడంఅవసరం. ఈ నేర్పడానికి మన పెద్దలు శిక్షణ అని పేరు పెట్టారు. గురువు శిష్యునకిచ్చే శిక్షణ అదే. మన సంప్రదాయాన్ని చిత్తశుద్ధితో తేరిపార చూసినప్పుడు ఈసత్యం మనకు బోధపడుతుంది. అంటూ స్వామి తెలియజెప్పారు ఒకానొక సందర్భంలో.

# ఆశ్చర్యాలనుండి ఆచరణకు

'ఫలానాచోట ఒక పెద్దాయన ఉన్నారు. ఒక ఆధ్యాత్మిక వేత్త ఉన్నారు. అని ఎవరైనా చెప్పగానే ఆ ప్రక్కవాళ్ళు వారుకూడా ఏమైనా మహిమలు చేస్తారా ? మీరేమయినా మీకు సంబంధించి అలాంటివేమైనా గమనించారా ? అని అడగడం ఈ నాడొక అలవాటయిపోయింది.

ఆధ్యాత్మికవేత్త అనగానే అతడు మనం ఆశ్చర్యపడే ట్టుగా ఉండాలనుకుంటోంది లోకం. లేని వాటిని సృష్టించడమో లేదా ఉన్నవాటిని మాయం చేయడమో, లేదా అన్నపానాలు లేకుండా అలా నిలబడిపోవడమో, ఇలా ఆయన ఏదో చేయాలి మొత్తంమీద ! లేకపోతే మనకు తృప్తి ఉండదు. ఆయన మన లాగా ఉండే ఆధ్యాత్మికవేత్త ఏమిటి అనిపిస్తుంది. ఏదైనా ఒక స్పెషాలిటీ ఉండాలికదా అని మన మనస్సే మనని ప్రశ్నిస్తూ ఉంటుంది.

విచిత్రమేమిటంటే ఆధ్యాత్మికవేత్త అయినవాడు ఇతరుల కన్నా ఏ విషయంలోకూడా విచిత్రంగా ప్రవర్తించకూడదని శ్రీ కృష్ణుడు గీతలో చెప్పాడు. అలా కనబడకుండా ఉండడం సాధనలో ఒక భాగమన్నాడాయన ! అందరిలాగ ఉంటూనే, అందరిమేలూ కోరుతూ, అందరికొరకు పనిచేసేవాడు నిజమైన ఆధ్యాత్మికుడని ఆయన నిర్వచనం. కనుక ఆశ్చర్యాలనుకోరే స్థితినుండి ఆచరణకు విలువనిచ్చే స్థితికి మనం ఎదగవలసి ఉంది.

